# కాదంబరీ కావ్యసుషమ



రచయిత్రి

డాక్టర్ కె. కమల ఎమ్. ఏ., పిహెచ్. డి.

KADAMBARI KAVYA SUSHAMA — A Critical Appreciation of Bana's Kadambari in Telugu by Dr. (Smt.) K. Kamala, M.A.,Ph.D., Reader, Department of Sanskrit, Osmania University, Hyderabad, Andhra Pradesh.

ప్రథమ ముద్రణ 1981
ప్రతులు 1000



వెల రు. రూ. 15-00

ప్రతులకు :
కె. శారద
16, తుల్జాగూడ
మోజంజాహిమార్కెట్,
హైదరాబాదు-500 001.

ముద్రణ :
పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్,
హైదర్‌గూడ, హైదరాబాదు.

ఈ గ్రంథ ముద్రణకు యూనివర్సిటీ గ్రాంట్సు కమిషన్ వారు
ద్రవ్య సహాయమును చేసిరి.

# మనవి మాటలు

కాదంబరీ కావ్యం బాణోపజ్ఞం. బృహత్కథామంజరీకథాసరిత్సాగరాలలో దాని కథ తర్వాత చేరింది. బృహత్కథ అనేది కాశ్మీర కవుల కల్పనా మాత్రమనే సుప్రసిద్ధ చారిత్రకులు శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారి సిద్ధాంతం నాకు విశ్వాసపాత్రం. పద్మపురాణంలో కాళిదాసు శకుంతల కథ యథాతథంగా చేరినట్టు కాదంబరీ కావ్యకథ చేరి ఉంటుంది. బాణుడు హర్షచరితం ఆముఖంలో ప్రశంసించిన బృహత్కథామంజర్యాదులలో శివలీలల ప్రాధాన్యం కనిపించదు.

మూడు జన్మల కథ ముప్పేటగా అల్లుకొన్న కాదంబరీ కథ జానపదులకు కుతూహలకరం కావచ్చుగాని, సుసంస్కృత బుద్ధులకు విడ్డూరమనక తప్పదు. గుర్రం మనిషి కావడం, మనిషి చిలుకగా మారడం వంటి అద్భుతాలు పునర్జన్మ సిద్ధాంతవాదులకు కూడ వింతే. అద్భుతరసం కథకు ప్రాణం గనుక బాణుడు ఈ పద్ధతిని అనుసరించి ఉంటాడు. కాని, బాణునిపై గౌరవాన్ని ఇనుమడింప జేసేది నా దృష్టిలో కథాకథాన చాతురి కాదు, వర్ణనలు, పాత్ర పోషణం—అంటే లోక వృత్త పరిశీలనం.

బాణుడు పూర్తిగా రాజరంజక కవి అయినా, కవితకు జీవగర్ర అయిన లోకవృత్తపరిశీలనలో మిన్న. లోకవృత్తపరిశీలనమంటే, మనస్తత్వ విశ్లేషణం కూడ. దీనిలో బాణుని మించిన వాడు ప్రాచీన భారతీయ కవితా జగత్తులో మరొకడు లేడు రాజాస్థాన, రాజప్రాసాద జీవితంతోపాటు జానపదుల, ఆటవికుల జీవితాలను కూడ పూర్తిగా ఆకళించుకొన్నాడు బాణుడు. రామాయణ భారత పాత్రలను మనం వీడు వీడు అని పోల్చుకున్నట్టే, కాదంబరి పాత్రలను కూడ పోల్చుకోగలం. కవులలోని పోలికలతోపాటు భేదాలను కూడ మనం గుర్తించినట్టే బాణుని పాత్రల వైవిధ్యాన్ని మనం గుర్తించి ఆనందించగలం. ఎన్ని పురుష పాత్రలు? ఎన్ని స్త్రీ పాత్రలు? అన్నిటా సూక్ష్మతరమైన వైవిధ్యం! వీరందరూ ఒకరిని మించినవారు మరొకరు సౌందర్యంలోను, శౌర్యాదులలోను. కాని ఒకరితో మరొకరికి సామ్యంలేదు. పేరు పేరున పిలిచి పలుకరించగలం. బాణునికి మనస్తత్వపరిశీలనలో ఇంతటి చాతురికి కారణం

సంఘంలోని వివిధ వర్గాలతో అతనికి గల సన్నిహితత్వమేనని హర్షచరితం సాక్షి. ఈ సాన్నిహిత్యమే అతని హృదయాన్ని ప్రేమ తుందిలం చేసింది. కనుకనే కాదంబరిలో ప్రేమ వేయిపాయలుగా విరబారింది.

"జీవితంలో ప్రధానమైనది ప్రేయసీ ప్రియుల ప్రేమ మాత్రమే కాద నియు, మరియెన్నియో బంధములతో జీవి జన్మించుననియు నిరూపించుటకే" నన్నట్లు ఒకవైపు తలిదండ్రుల ప్రేమ, తల్లిలేని తండ్రిప్రేమ, కన్నప్రేమ, పెంచినప్రేమ, ప్రేమ పాశమునకు దేవతలైనను అతీతులుగాని వైనం బాణుని లేఖిని ప్రస్తరించింది. గురువుల వాత్సల్యం, మైత్రి, మైత్రీపరాకాష్ఠ, మైత్రిలో త్యాగం, అంతఃపురంలోని వివిధ స్తరాల అనుచరుల పామరభక్తి, జంతువులకు యజమానులపై ననరు-ఏదీ అతని దృష్టిని దాటి పోలేదు. ప్రేమలోని ఛాయ లన్నిటినీ బాణుడు వింగడించినాడు.

ఇంతయినా అతని ప్రేమ మర్యాద మీరనిది. సంయమం ఇతరులకు కానరాని ఖలీనం. కాళిదాసు దుష్యంతుడు నేటి రౌడీలాగ ఆశ్రమకన్యల ఎదుట ఏదోసాకుతో నిలబడి, తనను బట్టబయలు చేసుకొన్నాడు గాని బాణుని చంద్రా పీడుడు తనేలోకమయిన ప్రియురాలి సామీప్యంలోనూ ఎల్లలు దాటలేదు. కాదం బరి ప్రేమకూడ పుటపాకంగా ఆమె మనసులోనే ఉండిపోయింది గాని, వెర్రి మొర్రి చేష్టలు చేయలేదు. పత్రలేఖతో ఆమె చంద్రాపీడునికి పంపిన ప్రేమలేఖ ప్రపంచ లేఖ సాహిత్యంలో అగ్రగణ్యం, నిరుపమానం.

ఈ ప్రేమతోపాటు బాణుడు సభ్యతను కూడ మనకు ప్రసాదించాడు. అంతఃపురసభ్యత, సామాన్య గృహస్థుల గృహసభ్యత, తపోవనసభ్యత, ఆట వికులసభ్యత, గంధర్వులసభ్యత, —ఇలా సంఘంలోని నానారీతుల సభ్యతను బాణుడు తెలిపి, పరోక్షంగా మనకు ఉపదేశించాడు. ఈ ఉపదేశం నేటికీ మనకు ఉపాదేయం.

బాణుని ఈ మెలకువలన్నిటినీ డాక్టరు శ్రీమతి కె. కమలమ్మ పూర్తిగా ఆకళించుకొన్నది. కమలమ్మ నాకు పుత్రీనిర్విశేషగనుక ఆమె శక్తి శ్రద్ధలను గురించి విశేషంగా తెలుపడం పక్షపాతమనిపించుకొంటుంది. బాణుని రచనో

ద్దేశం ప్రేమ విస్తరణమని ఈమె చాల చక్కగా తెలిపింది. నా ఉద్దేశమూ అదే గనుక, నాకు నచ్చింది. కాదంబరి పాత్ర చిత్రణం మరింత చక్కగా చేసింది కమలమ్మ పదివేలమందిలోవున్నా మనం సులువుగా పట్టుకొనిరాగలవారు బాణునిపాత్రలు. బాణుని వర్ణనల ఆనవాలుతో మనం వారిని సులువుగా గుర్తుపట్టగలం. కమలమ్మ ఈ ఆనవాళ్లను కనులకట్టేట్టు వివరించింది. ఈ గ్రంథంలోని 'కాదంబరి—సమకాలీన సమాజము' అనే అధ్యాయం మరొక ఉత్తమ పరిశీలనం. ఇంత ఉదారుడైన బాణునికి జరద్ద్రవిడ ధార్మికుడంటే అంత అసహ్యమెందుకో! దీనికి కారణం నాకొకటి తోస్తున్నది. శ్రీహర్షుడు కర్నాటకుడైన పులకేసితో ఓడిపోయాడు. ఓడిపోయినవారికి గెలిచినవారిపై మంట ఉంటుంది. దానిని వారు విధ విధాలుగా ప్రకటిస్తుంటారు. తన ఆశ్రయమైన రాజుకు కలిగిన పరాజయానికి బాణుడు ఈ విధంగా కొంత కసి తీర్చుకున్నాడేమో! కాదంబరిలో ఏదైనా అసంబద్ధ విషయం ఉందంటే, ఇదే. దీనిని తొలగించినా కావ్యానికి ఎలాటి లోటూ ఉండదు. నిజానికి అలాటి పెర్వెర్టెడ్ ధార్మికుడు ద్రవిడుడే కానక్కరలేదు; మరెవడైనా కథాగతికిగాని, వస్త్వైక్యానికిగాని భంగం లేదు.

ఈ గ్రంథంలో మనకు కనువిప్పు కలిగించే మరొక అధ్యాయం 'కాదంబరి—తెలుగు సాహిత్యంపై దాని ప్రభావము' అన్నది. దాదాపు ప్రతి తెలుగుకవీ కాదంబరిని కాపీ కొట్టినవాడే; శ్రీనాథుడు, ప్రబంధ కవులు మక్కీకి మక్కీ నకలు చేసినవారు. శ్రీనాథుని నకల్‌నవీస్‌తనాన్ని కమలమ్మ బాగా వివరించింది.

జిజ్ఞాసువులైన చదువరులు ఈ గ్రంథం నుండి చాల విషయాలు తెలుసుకొని ఆశ్చర్యానందాలు పొందుతారని విశ్వసిస్తున్నాను.

మే డే 1981 — భాషా సేవకుడు

హైదరాబాద్. — తిరుమల రామచంద్ర.

# ప్రస్తుతి

ప్రొఫెసర్ డా॥ బి. ఆర్. శాస్త్రి
సంస్కృత విభాగము
ఉస్మానియా విశ్వవిద్యాలయము

''సరస్వత్యా స్తత్త్వం కవి సహృదయాఖ్యం విజయతే" కవి సహృదయ నామకమగు సరస్వతీ తత్త్వమునకు జయమగు గాక. ఔను. సాహిత్యమునకు పరమ ప్రయోజనము సహృదయానందమే కదా.

శ్రీమతి డా॥ కె. కమల రచించిన ఈ ''కాదంబరి కావ్యసుషమ'' లో బాణుని కాదంబరి వివిధ సాహితీ దృక్కోణాల నుండి పరిశీలింపబడినది.

మహాకవి బాణుని కాదంబరి సంస్కృత సాహిత్యమున నిరుపమము( నిరతిశయరామణీయకమును అగు గద్యకృతి. ఇది ఒక కథ.

"కథా ఆఖ్యాయికా'' అను కావ్య విభాగము కడు ప్రాచీనమైనది.

''కురు రామకథాం పుణ్యామ్'' (వాల్మీకి రామాయణము 1-2-36, అని బ్రహ్మ వాల్మీకికి ఉపదేశించెను.

> ''పునరాఖ్యాయికాం జల్పన్ సుగ్రీవ సహితస్తదా
> పుష్పకం తత్సమారుహ్య నన్దిగ్రామం యయౌ తదా''
> (వాల్మీకి రామాయణము. 1-1-88)

ఇచట ఆఖ్యాయికాశబ్దము, స్వీయ చరిత్రము అను అర్థములో వాడబడినట్లున్నది. ఆదిశంకరులు కఠోపనిషత్తులోని వస్తువును ఆఖ్యాయిక అని వివరించిరి; "తత్రాఖ్యాయికా విద్యాస్తుత్యర్థా'' (కఠోపనిషత్తు, శాంకరభాష్యము 1-1)

కథాఖ్యాయికాది రూపమగు గద్యసాహిత్యము మూడు యుగములలో క్రమవికాసము నొందినదని చెప్పవచ్చును: (1) ప్రాగ్బాణయుగము (2) బాణ యుగము (3) బాణానంతర యుగము.

వాసవదత్తా-మానవతీ-తరంగవతీ - పంచతంత్రము - భట్టారహరిచంద్ర గద్యము మొదలగు కృతులు బాణుని కాలమువరకు ప్రచారములో ఉండెను.

బాణుడు గద్యసాహిత్యమును నవ్యప్రక్రియలతో తీర్చిదిద్ది గద్యకావ్య నూతన శకారంభకుడయ్యెను. తన కాలములో గద్యకావ్యములో జాతికి (స్వభావోక్తికి - యథావద్వస్తు వివరణకు) ప్రాధాన్యమున్నదనియు, కాని ఉత్పాదన (నవనవోన్మేష ప్రతిభ-సృజన) సాహిత్యమునకు ముఖ్య లక్షణ మనియు బాణుడు ఉద్ఘోషించెను.

"సంతి శ్వాన ఇవాసంఖ్యా జాతి భాజో గృహే గృహే
ఉత్పాదకా న బహవః కవయః కపయో యథా."
(ప్రారంభ శ్లోకములు - హర్షచరితము)

అర్థనవ్యత, అక్లిష్టశ్లేషత, అక్షరరమ్యత, రసస్ఫుటత, శయ్య, ఉపమాద్యలంకారములు, సుజాతులు (సముచితములగు స్వభావోక్తులు), కోమల పదావళి ఇత్యాది ప్రక్రియలతో గద్యమును భాసురమొనర్చిన మహామనీషి బాణుడు (హర్షచరితం, కాదంబరి ప్రారంభ శ్లోకములు).

సర్గబంధములకు (మహాకావ్యములకు) చారుత చేకూర్చిన కావ్యాంగములు బాణుని గద్య కావ్యములలో కూడ వినివేశితములయ్యెను. ఫలితము? సంస్కృత గద్య సాహితీ సుందరి నవ్యసుషమతో లాస్య మొనర్చెను. వేదకాలము నుండి కావ్యశిలా లేఖాదులలో అనుస్యూతంగా వస్తున్న గద్యశైలి మహాకావ్య ప్రక్రియా రంజితమై బాణుని కృతులలో సుందరతా పరాకాష్ఠ నధిరోహించెను.

బాణుడు ప్రతిపాదించిన కథాఖ్యాయికా విభాగమును భామహాది లాక్షణికులు అనుసరించిరి. కవిలాక్షణికుడైన దండి తదనుయాయులు ఈ విభాగము నామోదించలేదు.

దండి మహాకవి అవంతి సుందరీకథలో బాణకాదంబరీచ్ఛాయలు పెక్కు చోట్ల కానవచ్చుచున్నవి. కాలదృష్ట్యా సన్నిహితులైన బాణుడు, దండి సంస్కృత గద్య వాఙ్మయమునకు కొత్త వన్నెలు చేకూర్చిన మహిత చరితులు.

బాణుని కృతులను అవగతము చేసికొనుటకు దండి కావ్యములకు అవంతిసుందరీ కథ, దశకుమార చరితము ఎంతయో ఉపకరించును.

బాణుని జీవితానుభూతులు, హృద్గత భావములు, వైదుషి, లోకావేక్షణ, బాణునికి గోచరించిన సామాజికపరిస్థితులు, భారతీయ సంస్కృతి-కాదంబరిలో ఎటుల ప్రతిబింబించెనో డా॥ కమల ఈ గ్రంథములో హృదయంగమముగా నిరూపించెను:-

''మనము ఈనాటి నిర్వచనములో బాణుని అభ్యుదయవాదిగా చెప్ప వచ్చును'' (కాదంబరీకావ్య సుషమ-పుట-26) అని డా॥ కమల అభిప్రాయము. ఇది సర్వథా సత్యము. అంతేగాదు, బాణుడు సంఘ సంస్కర్త కూడా. సతీసహగమనము, రాజుల దుష్పరిపాలనము మొదలగు సాంఘిక దృష్ట్యా అహిత ప్రవృత్తులను పాత్రముఖముగా బాణుడు నిరసించెను. దురాచారములను పఠితల దృష్టికి తెచ్చుటలో మహాకవులు ముందంజ వేస్తారు. కాళిదాస, బాణ, దండి ప్రభృతులు లిట్టివారే.

పునర్జన్మ సిద్ధాంతము భారతీయ విచారధార కొక వైశిష్ట్యాన్ని ఆపాది స్తుంది. ఈ సిద్ధాంతానికి బాణుడు తన కృతులలో చేసిన రూపకల్పన అనితర సాధారణమని చెప్పాలి. పౌర జానపదుల విశ్వాసాలకు కవి కృతులు అద్దం పట్టును అను సూక్తికి కాదంబరి పుష్కలంగా సార్థక్యాన్ని చేకూరుస్తుంది.

''హిందూ ధర్మమునకు మూలస్తంభమైన పునర్జన్మ సిద్ధాంతము ఈ కథలోని క్లిష్టతకు జిగికి కారణము. దీనికి శాపవృత్తాంతము జోడించపబడింది'' (పుట 23) అంటుంది ఈ గ్రంథకర్త్రి.

కాళిదాసాదుల కృతులలోనూ, బాణుని కృతులలోనూ కల ''సంవాద'' సన్నివేశాదులను పోల్చిచూపుట ఈ గ్రంథంలోని మరియొక ప్రత్యేకత. బాణుడు చిత్రించిన స్త్రీమూర్తులు కాళిదాసాదుల స్త్రీమూర్తులకన్నను విశిష్టములు, ఉత్తమ ములు (పుట 25). చంద్రాపీడుని యౌవ రాజ్యాభిషేకము ముగిసిన పిదప అతని దిగ్విజయ ప్రస్థానము అతని పరాక్రమ విశేషముచే (గ్రంథాంతరమున పేలిక హర్షవర్ధనుని పరాక్రమముచే) పాఠకుల హృదయమును స్పృశింపజేయును.

''ఇతని దిగ్విజయ యాత్ర కాళిదాసు వర్ణించిన రఘు దిగ్విజయ యాత్ర అంత వివరముగా ఓజోవంతముగా లేదు'' (పుట 85). ఈ విధముగా నిర్దుష్టముగా కావ్యమునకు విలువ కట్టుటయే సద్విమర్శ.

బాణభట్టు జీవిత విశేషములు, రచనోద్దేశము, శైలి, కాదంబరి-సమకాలీన సమాజము, శాస్త్రపురాణ పాండిత్యము మొదలగు ప్రకరణములలో ఈ రచయిత్రి సునిశిత సాహితీ విమర్శనాపటిమను, ఔచితీపూర్ణ దృక్పథమును ప్రదర్శించెను. కవి హృదయాంతరాళ భావములను ఆవిష్కరించుటలో డా॥ కమల సఫలత పొందెననుటలో అతిశయోక్తి లేదు.

ఈ కాదంబరీ కావ్యసుషమ కాదంబరిని అధ్యయన మొనర్చు సహృదయులకు కమనీయ కాంతులను వెదజల్లుచు మార్గప్రదర్శన మొనర్చునని ఆశింపవచ్చును.

బాణుని గ్రంథములన్నింటిపైన ఇతోధికముగా సమగ్ర పరిశీలనమును డా॥ కమల చేయునని ఆశిద్దాము. శ్రీమతి డా॥ కమలను ఆశీర్వదిస్తూ-

కమలశ్రీరివ కమలం
కమలాక్షప్రీత్యర్మదం న తనుతేఽనూనామ్
కమనీయబాణవాణీ
విలాస కాదమ్బరీ కావ్య సుషమేయమ్?

ఇతిశమ్

దుర్మతి
వైశాఖ బహుళ నవమి 1
28-5-81 హైదరాబాద్

డా. బి.ఆర్. శాస్త్రి

# సాధువాదః

విదితచరమేవ సర్వేషాం విదుషాం యద్గద్యకావ్యప్రణయనే మహా కవిర్బాణోఽతిశేతేఽన్యాన్ సర్వానప్యభిరూపాన్. భూయాన్ పరిశ్రమోఽపేక్ష్యతే గద్యకావ్య రచనాయామ్. అత ఏవోక్తం ఖలు "గద్యం కవీనాం నికషం వదంతీ"తి. పద్యప్రబంధేషు వాగ్వైచిత్ర్యం, పదోజ్జ్వలత్వం, భావాకర్షణం, వివిధమపి రచనాసు దృశ్యతే. కింతు బాణరచనాయాం పదేపద ఉపలభ్యమానా కాంతిరన్యత్ర దుర్లభా. బాణేన సమం దండీ సుబంధుశ్చ సనామ గ్రాహముల్లిఖ్యేతే, పరంభావాభివ్యక్తౌ మనోహరశైల్యాం వర్ణనవిన్యాసే బాణ ఏవ గరిష్ఠ ఇతి నిశ్చప్రచమ్. రుచిరస్వరవర్ణపదా రస మావహంతీ, జగన్మనోహరంతీ. బాణస్య వాణీ చిరం చకాస్తే స్వచారుత్వేన.

వస్తువర్ణనే ప్రకృతివర్ణనేవా బాణ ఆత్మనోఽపూర్వం భౌగోలికం పౌరాణికం విజ్ఞానం ప్రకటయతి. వర్ణనానాం సర్వాంగీణమనోహరత్వాత్ సూక్ష్మతర వివరణ సమన్వితత్వాచ్చ బాణోచ్ఛిష్టం జగత్సర్వమితి సుతరా మపితథమేవ. బాణస్యోభయోరపిగ్రంథయోః కవేర్వర్ణనచాతురీ బహుశోఽవలోక్యతే శూద్రకవర్ణనమ్, వింధ్యాటవీ వర్ణనమ్, ఉజ్జయినీవర్ణనమ్, మహాశ్వేతా వర్ణనమ్, శుకనాసోపదేశః ఇత్యాదీని కాదమ్బరీ గత వర్ణనాని విదుషాం వదనేషు నరీనృత్యంతి.

బాణస్య రీతిః పాఞ్చాలీతి సర్వైరభ్యుపేయతే. "శబ్దార్థయోః సమోగుమ్ఫః. పాంచాలీరీతిరిష్యతే" ఇతి బాణ రచనాయాం శబ్దార్థయోర్మనోహారి మేలనం దరీదృశ్యతే. కించతస్య పదావలిరపి విషయానురూపం పరివర్తనం ప్రాప్నోతి. తథాహి వింధ్యాటవీవర్ణనే సమాసభూయస్త్వం వర్తతే, యథా "ఉన్మద మాతంగ కపోలస్థలగలిత సలిల సిక్తేనేవానవరత మేలావనేన మద గంధినాంధకారితా" ఇతి "క్వచిచ్చ వసంత వర్ణనాదిషు మాధుర్యం దృశ్యతే- "కోమలమలయమారుతావతార నవరంగితానంగ ధ్వజాంశుకేషు మధుకరకుల కలంకీకృత కాలేయక కుసుమ కుడ్మలేషు మధుమాసదివసేషు."

బాణ రచనా వివిధాలంకార సుమానాముద్యానమివ ప్రతిభాతి. రూపకోత్ప్రేక్షాశ్లేష విరోధాభాసాదీనామలంకారాదీనాం సంయోజనే అప్రతి

ద్వంద్విత్వ మాపాదితమనేన మహాకవినా. చతుర్విధే పరిసంఖ్యాలంకారప్రయోగే నకోఽపి కవిరనేన తులామారోఢుం శక్నోతి. తత్తుల్యకవేరభావాదయం పరి సంఖ్యాశేఖర ఇతి వక్తుముచితమ్.

అన్యోఽప్యేకోమహాన్ విశేషః. శ్లిష్టసమస్త దీర్ఘవాక్య ప్రయోగా నంతరమేవ బాణభట్టో లఘుపదయుక్తాం. వాక్యావలీం ప్రయుంక్తే. ప్రాయో యత్ర భావగాంభీర్యమర్థగౌరవం స్యాత్తత్ర సరలా వాక్యావలీ అన్యథాశ్లిష్టా సమాసప్రచురా దీర్ఘావా. ఏవం విధమ పూర్వప్రతిభాసంపన్నం బాణభట్టమధి కృత్య ఆంధ్రభాషాయాం సంరచనాకృతా డా. కమలామహోదయయా. బాణస్య శైలీవైశిష్ట్యాని చరిత్ర వైశిష్ట్యాని చ సమ్యగుద్ఘాటితాన్యస్మిన్ గ్రంథే. సంపూర్ణేఽపిగ్రంథే రచయిత్ర్యా బాణభట్ట మాహాత్మ్య వైవిధ్యం. సుష్ఠు బోధపదవీం నీతమ్ వైశారద్యేన చ ప్రకటీకృతమితిస్ఫుటం భవతి. వివిధానాం నరనారీణాం చారిత్రాణి, కాదమ్బర్యా రచనోద్దేశం - ప్రకృతి రహస్యం చ సవిస్తరమా విష్కృతమత్ర. అస్యాం కథాయాం వర్తమానం జానపదాంశం. జానపద కథా నివేదనశైలీ విశేషం ప్రధ్యానేన దర్శితవతీ డా. కమలామహోదయా. నూనంసా విదుషీ అధీతినీ గద్యకావ్యే, గృహీతినీ చ బాణభట్టరచనాయామ్ వాత్సల్యమ్, అనురాగః, త్యాగః, భక్తిః ఇత్యాదీన్ పాత్రోచితగుణాన్. తైస్తైరుదాహరణైః వ్యవరిష్టాస్మిన్ గ్రంథే రచయిత్రీ, ఆతసాధు ప్రదర్శితః శాపగ్రస్తానాం. పురుషాణాం (నస్త్రీణాం) వ్యవహారః కథానివేదకా ఏవ యథాకాలం పాత్రతాం గచ్ఛంతీతి కాదమ్బర్యాః ప్రముఖం విశేషం మనోగ్రాహం ప్రతిపాదితవతీ. అచ్ఛోదసరః పరిసరే ఏవకథాసూత్రం పరివర్తతే ఇత్యపివిషయో నూత్నతయైవ స్థాపితః.

కిం బహునా డా. కమలా మహోదయా ఆంధ్రపాఠకానాం పురః బాణభట్టస్య కాదమ్బర్యా సర్వానప్యభిరామాన్ విశేషాన్ సుగమయా లలితయా చశైల్యాసము పాస్థాపయత్. సర్వథా గౌరవాభినందసమర్హాతి సా ఉత్తమ గ్రంథరచనయేతిశమ్.

శ్రీ ప్రమోద్ గణేశ్ లాలే
అధ్యక్షః, సంస్కృత విభాగః
ఉస్మానియా విశ్వవిద్యాలయః

హైదరాబాదు
15-6-81

# అభినందనము

సంస్కృత గద్య రచయితలలో అద్వితీయుడు బాణభట్టు. ఈతనిని అనుకరించడానికై ఎందరో ప్రయత్నించినారు కాని సాఫల్యం పొందలేకపోయారు. సంస్కృత గద్య కావ్యాలలో ఉన్న ఆఖ్యాయిక, కథ అనే రెండు ప్రధాన విభాగాలను దృష్టిలో ఉంచుకుని బాణభట్టు హర్ష చరితము, కాదంబరి అనే రెండు గద్య కావ్యాలు వ్రాసినాడని కొందరి అభిప్రాయం. ఈ రెండు కావ్యాలు చూచిన తరువాతనే విమర్శకులు ఈ విభాగం చేశారని మరికొందరి అభిప్రాయం. ఈ రెండింటిలో కాదంబరి అత్యుత్తమమైనది. ''కాదంబరీ కావ్యసుషమ'' అనే ఈ గ్రంథంలో శ్రీమతి డా. కే. కమల కాదంబరి యొక్క వైశిష్ట్యాన్ని చాలా చక్కగా నిరూపించారు.

నూట డెబ్బై పేజీల ఈ గ్రంథంలో కాదంబరికి సంబంధించిన సర్వాంగీణ పరిశీలనం జరిగింది. సంస్కృత కవులెవ్వరూ తమ కావ్యాలలో తమను గూర్చి ఏమీ వ్రాసుకోలేదు. బాణుడు మాత్రం ఆ పద్ధతికి అపవాదంగా, హర్ష చరిత ప్రారంభంలో తనకీ, తన వంశీయులకీ సంబంధించిన ఎన్నో విషయాలను చెప్పి ఉన్నాడు. దాన్ని ఆధారంగా తీసుకుని ఈ గ్రంథ ప్రారంభంలో బాణభట్టుని జీవిత విశేషాదులు వర్ణింపబడి ఉన్నాయి. కథానాయకుని మూడు జన్మలకు సంబంధించిన కథ అవడంచేత కాదంబరీ కథ అంతా గజిబిజిగా ఉంటుంది. అందుచేత పాఠకుల సౌకర్యం కోసం ఆ కథను కూడా అతి సంక్షిప్తంగా వ్రాశారు రచయిత్రి.

సాధారణంగా ఇతర కావ్యాలలో ఉన్న పద్ధతిలో కేవలమూ ప్రేయసీ ప్రియుల ప్రణయాన్ని మాత్రమే కాకుండగా పితాపుత్రాదుల ప్రేమ, మిత్రుల ప్రేమ, స్వామి భృత్యుల ప్రేమ, చివరకు మానవులకు జంతువులకు మధ్య ప్రేమ వీటిని కూడా చిత్రించడం బాణుని లక్ష్యం అని డా. కమల చక్కగా ప్రతిపాదించారు.

బాణుడు చూపిన పాత్ర చిత్రణ నైపుణి అత్యద్భుతమైనది. షేక్స్పియర్‌ను గూర్చి చెప్పేప్పుడు— ఆతడు సృష్టించిన పాత్రలలో ఏ ఇద్దరూ కూడా ఒక విధంగా ఉండరు అని అంటారు. అది బాణభట్టులో కూడా కనబడుతుంది. ఈ వైశిష్ట్యాన్ని దాదాపు యాభై పేజీలలో నిరూపిస్తూ చంద్రాపీడుడు, కాదంబరి, మహాశ్వేత మొదలైన ప్రధాన పాత్రలను గూర్చియే కాకుండా, శుకనాసుడు, కేయూరకుడు, పత్రలేఖవంటి నాతి ప్రధాన పాత్రలను గూర్చి కూడా చర్చ చేయబడింది. ఇలాంటి రకరకాల పాత్రలు ఉండడం చేతనే బహుశా ''బాణోచ్ఛిష్టం జగత్సర్వమ్'' అన్న నానుడి వచ్చి ఉంటుందని రచయిత్రి ప్రకటించిన అభిప్రాయం యుక్తంగా ఉన్నది. ఈ సందర్భంలో కాళిదాస-దిఙ్నాగాదుల రచనలతో బాణుని రచనలో ఉన్న సంవాదాలు చూపించడం జరిగింది. ఆనందవర్ధనుడు చెప్పినట్లు మహాకవుల రచనలలో అక్కడక్కడ సంవాదాలు ఉండడం సహజమే కదా !

''ఓజః సమాస భూయస్త్వమ్ ఏతద్గద్యస్య జీవితమ్'' అని ఆనాటి ఆలంకారిక సంప్రదాయం. అందుచేత గద్య కావ్యం వ్రాయదలచుకున్నవాడు, పంచతంత్రాదులలో ఉన్నట్లుగా, ఏదో సులభశైలిలో వ్రాసినట్లైతే అది నీతికథ అవుతుంది కాని కావ్యం అనిపించుకోదు. అందుచేత సమాస భూయిష్ఠమైన రచనయే చెయ్యాలి ఆ నియమాన్ని అనుసరిస్తూ వ్రాసినా బాణభట్టు సుగ్రాహ్యాలైన సమాసాలుమాత్రమే వాడి తన రచనను ఒక అనన్య సాధారణ పద్ధతిలో నడిపాడు. ఈయనది పాంచాలీ శైలి. ''బాణుని శైలి'' అన్న ప్రకరణంలో ఈ విషయాలన్నీ చక్కగా ప్రతిపాదింపబడ్డాయి.

'బాణుని ప్రకృతి వర్ణన', 'కాదంబరీ రసచర్చ' అన్న విషయాలు క్లుప్తంగా ముచ్చటించి కథాకథనం విషయంలో బాణు డవలంబించిన పద్ధతి నేటి flash back టెక్నిక్ వలె ఉన్నదని చెప్పడం చాలా యుక్తంగా ఉన్నది. బాణుని కథాకథన పద్ధతికి ఇది సూత్రరూప వ్యాఖ్యానం. యౌవన ప్రారంభంలో కొంతకాలంపాటు దేశద్రిమ్మరిగా తిరిగిన బాణుడికి వివిధ జీవిత విధానాలతో పరిచయం ఉండడం సహజమే. ఆ విషయాన్ని డా కమల ''కాదంబరి-సమకాలీన సమాజము'' అన్న అధ్యాయంలో చక్కగా చిత్రించారు. 'బాణుని సుభాషితాలు', 'బాణుని శాస్త్రపాండిత్యం' అన్న ప్రకరణాలలో బాణుని నీతి

బోధన పద్ధతి, అతని రచనలో అడుగడుగునా కనబడే వివిధ శాస్త్ర పురాణేతిహాసాది పాండిత్యమూ విశదీకరింపబడ్డాయి. ఈ సందర్భంలో ఉదాహరించిన బాణుని ''సుభాషితం హారి'' ఇత్యాది శ్లోకంలో 'సుభాషితం'అన్నదానికి కేవలం 'నీతివాక్యం' అనికాక, 'కావ్యము' అని అర్థమని నా అభిప్రాయం. భర్తృహరి ఉపయోగించిన ''జీర్ణమంగే సుభాషితమ్'' అన్న సుభాషిత శబ్దానికి కూడా కావ్యమనే అర్థం. అది విస్తృత కావ్యం కావచ్చు. లేదా ఏక శ్లోకరూపమూ లేదా ఏకవాక్యరూపమూ అయిన కావ్యం కావచ్చు. ఐతే ఈనాడు మాత్రం 'సుభాషితం' అనగానే 'నీత్యుపదేశక వాక్యం' అన్న అర్థం ప్రచారంలో ఉన్నది.

''పూర్వోత్తరార్థముల తారతమ్యము'' అన్న ప్రకరణంలో రచయిత్రి భూషణుడు తండ్రికేమాత్రము తీసిపోడని సయుక్తికముగా చూపినారు. ''తెలుగుపై కాదంబరి ప్రభావము'' అన్న ప్రకరణమున ప్రధానముగ శ్రీనాథునిలో కనబడే కాదంబర్యనుకరణములను చూపి ఇలాంటివి ప్రబంధ కవులలో కూడ కోకొల్లలుగ ఉన్నవని సూచించబడింది. ఈ విధంగా ఈ నిబంధం సర్వాంగసుందరమై కాదంబరీ కావ్యం విషయంలో పాఠకులకు అభిరుచిని కలిగించే చక్కని విమర్శనాత్మక గ్రంథంగా తెలుగవారి ఆదరణ పొందగలదని నా విశ్వాసము. ప్రాచీన గ్రంథాలలో ఏమున్నదో తెలుసుకొనే కోరిక గాని, తీరిక గాని, ఓపిక కాని లేకుండా-''ఆ! వాటిలో ఏముంది?'' అని ఈసడించుకునేవారు అత్యధికంగా ఉన్న రోజులలో ఇలాంటి గ్రంథాలు తెలుగులో రావడం ఎంతైనా అవసరం. ఇవి మంచి పుస్తకాలు చదవడం అలవాటు ఉన్నవారికి కనువిప్పు కలిగిస్తాయి.

హైదరాబాదు
15-3-1981

పుల్లెల శ్రీరామచంద్రుడు
రీడర్, సంస్కృత విభాగము
ఉస్మానియా విశ్వవిద్యాలయము

# కృతజ్ఞతలు

నేను కాదంబరీ కావ్యముపై విమర్శనాత్మక వ్యాసమును వ్రాయుటకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ వారు కారకులు. వారి విషయముపై రచించిన ఉత్తమ గ్రంథమునకు పారితోషికము నిత్తుమనగా ప్రాంశులభ్యమైన ఆ ఫలము నకై ప్రయత్నించితిని. తత్ఫలితమే ఈ పుస్తక ప్రచురణము.

ఈ గ్రంథ రచనలో నా కడుగడుగునా వాత్సల్యపూర్ణదృష్టితో, సహాయము చేసి, మనవి మాటలు చెప్పినవారు శ్రీ తిరుమల రామచంద్రగారు. పితృతుల్యులైనవారికి నా నమోవాకములు.

నేనడుగగనే తమ అభిప్రాయములను కాదంబరీ కావ్యముపై తమ కేర్ప డిన దృష్టితో సమన్వయపరచి ఇచ్చిన ఆచార్య శ్రీ బి. ఆర్. శాస్త్రిగారికి, డా ప్రమోద్ గణేశ్ లాల్యేగారికి, డా. పి. శ్రీరామచంద్రుడు గారికి నా ధన్య వాదములు.

ఈ పుస్తక ప్రచురణమునకు ధన సహాయము చేసిన యూనివర్సిటీ గ్రాంట్ కమిషన్ వారికి నా ధన్యవాదాలు.

పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ వారీ పుస్తకాన్ని శరవేగముతో ముద్రించిరి. ప్రచురణలో జరిగిన ఆలస్యమునకు నేనే కారణము. ప్రెస్సు వారికి నా శుభాకాంక్షలు.

ముఖ చిత్రమును తయారుచేసి ఇచ్చిన శ్రీ శీలా వీర్రాజుగారు జగమెరిగిన కళాకారులు వారికి నా కృతజ్ఞతలు.

గ్రంథ రచన ముద్రణ ప్రచురణలో ఎన్నో లోపములు జరిగి ఉండ వచ్చును. సహృదయులు వానిని సూచించిన సరిదిద్దుకొనగలను.

—రచయిత్రి

# అంకితము

కాదంబరీ కావ్యామృతాన్ని ఎందరికో పంచిపెట్టిన పుణ్యశ్లోకులు మా పితృపాదులు కీర్తిశేషులు బ్రహ్మశ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు. తెలుగు సంస్కృత భాషలలో అపార పాండిత్యాన్ని, కవన శక్తిని సాధించిన సుశ్లోకులు వారు. నా ఈ చిన్న పుస్తకము అచ్చులో ఉండగా 10-1-81 నాడు కాంథ హతమయింది వారి జీవితము. నా కక్షరాభ్యాసాన్ని చేసింది మా నాయనగారే అయినా రామశబ్దముతో ప్రారంభించి ప్రాథమిక విద్యను నేర్పినది మా అమ్మనే వారిరువురకు నమస్కరిస్తూ మా నాయనగారి ప్రతినిధిగా ఈ పుస్తకాన్ని గ్రహించవలెనని మా అమ్మను వేడుకుంటున్నాను.

వైశాఖ శుద్ధపంచమి
8-5-81

-కమల

# కృతి సమర్పణ



బ్రహ్మశ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు, శ్రీమతి అన్నపూర్ణమ్మగారు

# విషయ సూచిక


| | | |
|---|---|---|
| బాణభట్టు | ... | 1-3 |
| బాణభట్టుని జీవిత విశేషములు | ... | 4-16 |
| కాదంబరి కథ | ... | 17-22 |
| బాణుని రచనోద్దేశము | ... | 23-26 |
| కాదంబరి-పాత్రచిత్రణము | ... | 27-28 |
| శుకము పుండరీకుడు | ... | 28-30 |
| శూద్రకుడు | ... | 30-31 |
| చండాల కన్యక | ... | 31-32 |
| చంద్రాపీడుడు | ... | 32-42 |
| కాదంబరి | ... | 43-49 |
| మహాశ్వేత | ... | 50-54 |
| పత్రలేఖ | ... | 54-57 |
| కపింజలుడు | ... | 57-62 |
| శుకనాసుడు | ... | 63-66 |
| వైశంపాయనుడు | ... | 66-71 |
| తారాపీడుడు | ... | 72-73 |
| మనోరమా విలాసవతులు | ... | 73-74 |
| కేయూరకుడు | ... | 77-76 |
| బాణుని శైలి | ... | 77-91 |
| ప్రకృతి వర్ణనము | ... | 92-95 |
| కాదంబరి-రసచర్చ | ... | 96 |
| నాటకీయత | ... | 97-99 |
| జానపద ప్రభావము | ... | 100-104 |

కాదంబరి-సమకాలీన సమాజము ... 105-136
బాణుని సుభాషితములు ... 137-140
బాణుని శాస్త్రపురాణ పాండిత్యము ... 141-151
పూర్వోత్తరార్ధముల తారతమ్యము ... 152-157
కాదంబరి-తెలుగు సాహిత్యముపై
దాని ప్రభావము ... 158-166
ఉపసంహారము ... 167-168
అనుబంధము ... 169

---

# బాణభట్టు

బాణుడు పుంభావాపన్న వాణి. శబ్ద బ్రహ్మను సాక్షాత్కరింప జేసుకొన్న వాఙ్మయ ఋషి. ఈతని ముఖ కమలమునందు సరస్వతి మేఘచ్ఛన్న మగు ఆకాశమును చూచి పురివిప్పిన నెమలివలె తాళ లయ విన్యాసములతో నాట్యము చేసెను. బంగారు మువ్వలు ఘల్లు ఘల్లున మ్రోగు ఈ మహాకవి ముంజేతి కంకణము ఈతడు రచనా వ్యాసంగము సాగించుచుండగా మధ్యలో ఎచ్చటనూ భావ దారిద్ర్యమువలనగాని భాషా దారిద్ర్యమువలనగాని ఆగి మూగ పోయినట్లు కనిపించదు. సరస్వతి ఇతనికి వచో విధేయ కాబట్టి లేఖిని కన్న ముందే అహమహమికతో సాగియుండి యుండును. ఈతడు సంస్కృత భాష యందు రచించుట యాదృచ్ఛికమే! ఏ భాష నితడు ఆశ్రయించిననూ ఆ భాష కీతని రచన పెట్టని వన్నె అయి ఉండెడిది. గీర్వాణ భాషకు గీర్వాణత్వము ఇట్టి రససిద్ధులు సంపాదించి పెట్టినదే! చూచిన వస్తువునే, సామాన్యజనమునకు అనుభవమునందున్న దానినే జగన్మోహనముగా అనన్య సామాన్యముగా వర్ణించి పాఠకుల నాశ్చర్యచకితులను చేసినాడీ మహాకవి. ఈతని భావుకత సంస్కృత సాహిత్యమునందే ఏ కొలది మందికో కలదని చెప్పుట అతిశయోక్తి కానేరదు. సువిశాలమైన గద్యమయ రసజగతిలో బాణుడే నిరంకుశ చక్రవర్తి. ఈతని శైలిని పరివృత్త్యసహిష్ణువు అని వర్ణింతురు. ఈయన పొదిగిన పదములు, అందులోనూ ముఖ్యముగా క్రియలు ఒక మహాసౌధ నిర్మాణములోని ఇటుక రాళ్ళవలె ఉండును. మధ్యనుండి ఒక ఇటుక రాయిని పెళ్ళగించి మరొక దానిని పొదగలేము గదా! బాణుని కవితా సౌధముకూడా అట్టిదే. గద్యమును వ్రాసి ఛందోమయ కవితను వ్రాసిన మహాకవుల నతిశయించి గద్యమునకే అపూర్వ మైన గౌరవమును కల్పించిన యశస్సు బాణునకు దక్కినది. అందుకే 'గద్యం కవీనాం నికషం వదంతి' అను ఆభాణకము ప్రసిద్ధిని పొందినది. ఈయన సంతరించిన రాగవాహినిలో పాఠకులు ఊయల లూగుచుండగనే హఠాత్తుగా ఈ మహాకవి జీవన వీణాతంత్రులు తెగిపోయినవని తెలిసికొనునప్పటికి వారు కాదంబరి ఉత్తర భాగమును చేరుకొనెదరు. అయితే తెగిన వీణా తంత్రులనుండి

వెలువడిన స్వరతరంగముల అనురణన పాఠకుని కర్ణకుహరములలో మారు మ్రోగుచునుండగనే అతని నోములపంట, త్యాగ బుద్ధికి ప్రమాణము అయిన అతని కుమారుడు భూషణభట్టు తండ్రి వ్రాసిన పుటలలోని దస్తూరిమీది తడి ఆరకముందే తాను లేఖినిని చేత బుచ్చుకొనును. పుణ్యాత్ములే మహాకావ్యములను రచింతురందురు. బాణుడు ఎంతటి భాగ్యశాలి కాకపోయిన తనయంతటి కొడుకును పొంది, 'ఆత్మావై పుత్ర నామాసి' అన్న వేదోక్తిని తనయందు నిరూపించుకొని సహృదయ పాఠకులకు మహోపకారి కాగలడు? బాణుడు అల్లినది కల్పితమగు కథ. అందొక సంఘటనను మరియొక దానితో ముడి పెట్టుట కష్టము. కథ శూద్రక మహారాజు వర్ణనతో ప్రారంభమై వైశంపాయన శుక వృత్తాంతముతో కథాముఖము ముగియగా, ఆతర్వాత కథను జాబాలి మహాముని సాగించును. కథ మరికొంత దూరము పోవుసరికి చిలుక, జాబాలి ఇరువురును అదృశ్యులై కథలోని పాత్రలు తారాపీడ శుకనాసులు చంద్రాపీడ వైశంపాయనులు మహా శ్వేతా కాదంబరులు జరద్ద్రవిడ ధార్మికాదులు సజీవముగా సాక్షాత్కరించు టయేకాక ఆనాటి రాజు పేరోలగములోని వైభవమును తమ వెంట తీసికొని వచ్చును. ఈ వైభవమునకు మించినది ప్రకృతి వర్ణనము. ఇంతటితో కన్నులు మిరుమిట్లుగొలిపి ధర్మమును విస్మరింపరాదు సుమా! అని తెలుపుటకు శుక నాసోపదేశమును కవి చేర్చెను. ఆటవికులు, వారి దండు, వారి ఆవాసమగు వింధ్యాటవి, అచ్చట చెట్లు చేమలు, జంతువులు పక్షులు బాణుని వర్ణనమువలన అమరత్వమును పొందెను. వీని వెంటనే కవి నోటిరుచిని మార్చుటకు జాబాలి తపోవన చిత్రమును గీచి పాఠకుల తలలు ఊపింపజేయును. ఇచ్చట ఆశ్రమ మృగములు, ముని కన్యలు అధ్యయన శీలురగు ఛాత్రులు, అగ్నిహోత్ర ధూమము, ఆ పొగ ఆకాశమున కెగసి ఋషులకొరకు కట్టు స్వర్గ సోపాన పంక్తి, ఆజ్యగంధము, తపోవనము ముంగిట ముగ్గులు, భోజన స్థలమునందు గీసిన విభూతి కర్రలు, భూతబలికొరకు కడపముందు పెట్టిన ధాన్యపు పిడికిళ్ళు, కోతుల సహాయముతో తిరుగాడు వృద్ధ అంధ తాపసులు-ఒకటేల తపోవన ప్రపంచము మనముందు సాక్షాత్కరించును. ఈ విధముగా ఏ ప్రపంచమున కా ప్రపంచమును తన కావ్యములో సృష్టించుచు బాణుడు ముందుకు సాగిపోయెను.

చనిపోయిన తన ప్రియుడు తిరిగి వచ్చునన్న నమ్మకముతో మహాశ్వేత నిరీక్షణము చేయుచుండగా, కాదంబరీ విరహమునందు చంద్రాపీడుడు వేగిపోవు

చుండగా పూర్వభాగము నిలిచిపోవును. ఈ రచనయందలి ప్రతి పదమును భూషణ భట్టు అనుసరించక పోయినచో కథలో తండ్రికున్నంత అవగాహన అతనికి ఏర్పడియుండదు. తండ్రి జీవిత కాలమునందే అతనికి అతడు లేఖకుడుగా సహాయపడి ఉండవచ్చును. తండ్రి ఆదేశ ప్రకారము అచ్చటచ్చట పూర్వ భాగములోనే కొన్ని వాక్యములను భూషణ భట్టు చెప్పినా చెప్పియుండవచ్చును. ఈ విధముగా కథలో లీనము కాకుండిన తండ్రి అవాంతర మృతిని పొందగనే తాను సమీప్సిత వస్తు పరిసమాప్తిని చేసి ఉండడు. 'యాథా తాతః తథా పుత్రః' అని భూషణ భట్టును వేయినోళ్ళ కొనియాడనిదే ఏ సహృదయుని మనస్సుకూడా సంతృప్తిని పొందదు. బాణుని సింహనాదములు, గజఘీంకారములు వినిపించుచుండగనే భూషణ భట్టు రచించిన చిట్టి చిట్టి వాక్యములు వివిధ రూపములను ధరించిన స్నేహవర్ణనము పాఠకులను తనియింపజేయును.

'పుష్పం ప్రవాళోపహితం యదిస్యాత్ ముక్తా ఫలం వాస్ఫుట విద్రుమస్థం' అను కాళిదాసు వర్ణనమును స్మరించినచో కనకాంబరములు మల్లెలు కలిపి అల్లిన దండవలె అందమును, ఆమోదమును గుబాళించు భూషణభట్ట బాణభట్టుల కాదంబరీ వైభవము మనకు సాక్షాత్కరించును. ఒక్కొక్కప్పుడు భూషణ భట్టునకు రావలసినంత ప్రశస్తి రాలేదేమో యనిపించును.



# బాణభట్టుని జీవిత విశేషములు

సంస్కృత సాహిత్య జగత్తులో బాణభట్టుని చరిత్రము మధ్యమ బిందువు వంటిది. అజ్ఞాతముగానున్న పలువురు కవుల జీవనకాలమును బాణుని 'హర్ష చరితము' ఆధారముగా ఉజ్జాయింపుగా నిర్ణయించవచ్చును. బాణుడు తన ఏలిక హర్షవర్ధనుని వంశ చరిత్రమును వర్ణించుటకు ముందు పూర్వ కవి ప్రశంసను చేసి, తన వంశమును వర్ణించి తన జీవితములోని వసంత దశను, హర్షవర్ధన చక్రవర్తి సభను తాను చేరుకొన్న విధమును తెలిపి చక్రవర్తి వంశ వర్ణనమునకు పూనుకొనెను.

రాజుల వంశావళుల పట్టికలు, నారాశంసులు, ప్రశస్తులు, శాసనములు, పురాణములు, ఐతిహ్యములు, అభూత కల్పనా కల్పిత కథలు, విదేశ యాత్రికులు చేసిన వర్ణనములు భారతదేశ చరిత్రలో విరివిగా కనిపించును. మన దేశ చరిత్ర రాజుల చరిత్రగా మారినది. కాబట్టి హర్ష చరితమును బాణుడు రచింపకపోయినను ఏదైనా యాత్రికులవలననో, బౌద్ధ భిక్షువులవలననో మనకు అతని చరిత్ర తెలిసియుండెడిది. కాని హర్ష చరితారంభములోని మొదటి రెండు ఉచ్ఛ్వాసములలో బాణుడు తన ఆత్మ కథను తెలుపకున్న, అంతటితో తృప్తిజెందక సంగ్రహముగా కాదంబరి ప్రారంభ శ్లోకములలో తన వంశవృక్షమును ఇవ్వకున్న కాళిదాసాదులవలెనే ఈతని ఆత్మకథకూడా పాఠకుని ఊహాగానము మీద, అతడు చేసిన అభూత కల్పనల మీద ఆధారపడియుండెడిది. బాణుడు తన వంశగాథను తెలిపి సంస్కృత సాహిత్య జిజ్ఞాసువులకు మహోపకారి అయినాడు. సంస్కృత సాహిత్య చరిత్ర నిర్మాణములో బాణభట్టుని ఆత్మకథ, పూర్వ కవిస్తుతి అత్యంతోపకారకములు.

## బాణుల వంశ వృక్షము :-

కాదంబరీ హర్ష చరితములు రెండింటిలో బాణుడు పూర్వికులను స్మరించినాడు. హర్ష చరితానుసారము శాపగ్రస్త అయిన సరస్వతీ దధీచి దంపతుల

సంతానము సారస్వతుడు. సారస్వతుని పినతల్లి కొడుకు వత్సుడు ఆ వత్సుని వంశములో కుబేరుడు, అతని సంతతిలో పాశుపతుడు, వానికి అర్థపతి జనించిరి. అతని పదకొండు మంది పుత్రులలో చిత్రభానువు ఒకడు. ఆ చిత్రభానుని కొడుకే బాణభట్టు. కాదంబరిలో పాశుపతుని పేరు మాత్రము చెప్పలేదు. మహా మహోపాధ్యాయ పి. వి. కాణే పాశుపతుని పేరు స్మరించు శ్లోకము ఇప్పు డుపలభ్యములయిన కాదంబరి వ్రాత ప్రతులలో లుప్తమయి యుండవచ్చునని అభి ప్రాయపడుచున్నారు. [1]

హిరణ్యబాహువను నామాంతరము గల శోణానదీ తీరములోని ప్రీతి కూటమను స్థానము ఈ వాత్స్యాయనుల ఆవాసము. బాణుని తల్లి రాజదేవి ఈతని శైశవములోనే మరణించగా తండ్రి చిత్రభానువు తానే తల్లి తండ్రి అయి ప్రేమతో ఇతనిని పెంచెనట. తనకు తల్లి లేదన్న దుఃఖము, తండ్రి తన ఎడల చూపించిన వాత్సల్యము ఈ రెండింటిని రంగరించి బాణుడు వైశంపాయన శుక చరిత్రములో నిమిడ్చెను. తల్లిచిలుక వింధ్యాటవిలో శాల్మలీ వృక్ష కోటరంలో ఈచిలుకను ప్రసవించి ఆ ప్రసవవేదనను భరించలేక మరణించగా భార్యా వియోగ పీడితుడై ప్రవయస్కుడైన తండ్రి చిలుక అప్పుడే పుట్టిన రెక్కలురాని వైశం పాయనునికొరకు ప్రాణత్యాగము చేయక అసాధారణమైన అపత్యప్రేమతో పెంచెను. కవి ఆత్మ అతని కావ్యములో ప్రతిఫలించుననుటకు ఇది చక్కని నిదర్శనము.

బాణుని తండ్రి బాణునికి ఉపనయనాది సంస్కారముల నిర్వర్తించి, పదునాలుగవ ఏట శ్రుతులను, స్మృతులను నేర్పించెను. చిత్రభానునకు పది పదులు నిండక మునుపే నూరేండ్లు నిండెను. అప్పుడు పితృవియోగ శోకముతో బాణుడు దేశాటనమునకు బయలుదేరెను. అతని వెంట బయలుదేరిన అతని మిత్రబృందమున సమానులు, సహాయోగులు, సంఘమునందన్ని వృత్తు లవ లంబించిన వారు నుండిరి. వారినిట్లు బాణుడు పరిచయము చేయును. [2]

---

1. హర్ష, వీఠిక. II
2. హర్ష I. పుట 19.

అతని భ్రాతలు చంద్రసేన మాతృషేణులు పారశవులు (బ్రాహ్మణునికి శూద్ర స్త్రీయందు కలిగిన సంతతి). భాషాకవి ఈశానుడు అతని కాప్త మిత్రము; అతనికిష్టులు రుద్రనారాయణులు,విద్వాంసులు వారబాణ వాసబాణులు, ప్రశస్తులను (లేక ప్రాకృత కవిత్వమును) రచించు వాణీభరతుడు, ప్రాకృత వేత్తకులపుత్రుడయిన వాయువికారుడు, బందీగణము అనంగబాణసూచీ బాణులు, మధ్య వయస్కురాయగు కాత్యాయనిక (కాషాయధారిణి), చక్రవాకిక, విషవైద్యుడు మయూరకుడు, తాంబూలమునిచ్చు చండకుడు, భిషక్పుత్రుడు మందారకుడు, పుస్తకవాచకుడు సుదృష్టి, స్వర్ణకారుడు చామీకరుడు, స్వర్ణ కారులమీద పర్యవేక్షకుడు సింధుషేణుడు, లేఖకుడు గోవిందకుడు, చిత్ర కారుడు వీరశర్మ, బట్టబొమ్మలను చేయు కుమార దత్తుడు, మార్దంగికుడు జీమూతుడు, సోమిలగ్రహాదిత్యులను గాయనులు, కురంగిక యను సైరంధ్రి, మధుకర పారావతులను వాంశికులు (వేణుగానము చేయువారు), దర్దురకుడను గాంధర్వోపాధ్యాయుడు, కేరలికయను సంవాహిక (మాలిష్ పని చేయునది), తాండవకుడను లాసక యువకుడు (పాచికలాడువాడు), భీముకుడను జూదరి, శిఖండుడను శైలాలి యువకుడు (నటుడు), హరిణికయను నర్తకి, సుమతి యను పారాశరి (పరాశర శబ్దమును అధ్యయనము చేసిన పరివ్రాజకుడు), వీర దేవుడను క్షపణకుడు (బౌద్ధభిక్షువు), జయసేనుడను కథకుడు, శక్రఘోణుడను శైవుడు, కరాళుడు అను మంత్ర సాధకుడు, లోహితాక్షుడను అసుర వివరవ్యసని (పాతాళమందలి నిధులు త్రవ్వి తీయవలెనను పిచ్చిగలవాడు), విహంగముడను ధాతువాదవేత్త (రసవిద్యవలన ఇతర లోహములను బంగారముగా మార్చగలిగిన వాడు), దామోదరుడను దార్దురికుడు (కుండలు చేయువాడు- దర్దురవాద్యమును పటహము వంటి దానిని మ్రోయించువాడు), చకోరాక్షుడను ఐంద్రజాలికుడు (గారడీచేయువాడు), తామ్రచూడుడను మస్కరి (పరివ్రాజకుడు). వీరుబాణుని పరివారము.

పై పట్టికలో బాణుడు తొలుత చెప్పిన చంద్రసేనమాతృషేణులు, ఈశానుడు, రుద్రనారాయణుడు బాణునికి చాలా ఆప్తులు. మిగిలినవారిలో వారు అవలంబించిన వృత్తులను చూచునపుడు, దారిలో పాములు కరచిన మందుపెట్టు జాంగలికులు, త్రవ్వకపు పని చేయగలిగిన వారు, ఇంద్రజాలాది విద్యలవలన వినోదమును సమకూర్చువారు, గాయకులు, వాద్యబృందము,నటకులు,నర్తకులును నుండిరనియు దెలియును. వారందరును కలసి త్రోవలో ఉత్సవములు జరుపు

కొనుచు, కావ్యరచన చేయుచు, పరివ్రాజకుల సహాయముతో వివిధ దేశములను గురించి మొదటనే తెలిసికొని ప్రయాణము సుకరము చేసికొని ముందుకు సాగిపోవు చుండిరనియు, జూదమాడుచు, పాచికలను పరచుకొని, రాత్రులు కాపలా కాయుచుండిరనియు, వీరి దేశాటనము కేవలము మొక్కుబడి కొరకు గాక విద్యా సముపార్జనమునకు, నేర్చిన విద్యకు మెరుగులు పెట్టుకొనుటకు, తదనుభవమున జీవిత పరమార్థము నెరిగిరనియు తెలియుచున్నది వీరి గుంపులో స్త్రీలు కూడ ఉండుట విశేషము.

బాణుడు తానచ్చట తిరిగి ఏమేమి చూచెనో కూడ సంగ్రహముగా చెప్పెను. అతడు వివిధ రాజ కులములను దర్శించెను. నిరవద్య విద్యావిద్యోతితములగు గురుకులములను సేవించెను. మహార్హాలాప గంభీర గుణవద్గోష్ఠుల యందు పాల్గొనెను. బుద్ధిధనముగల విదగ్ధ మండలములను సేవించి, ఆత్మ వంశోచితమగు వైపశ్చితిని (పాండిత్యమును) సంపాదించెను. దేశాంతరములను చూడవలెనను కౌతుకముతో యౌవన సహజమగు తొందర పాటుతో బయలుదేరి ఇతరులచేత ఉపహసింపబడెనట. లోకోత్తరమగు ధిషణ గలవాడితను. సామాన్యుల కితని ప్రవర్తనమెట్లు అర్థమగును? తిరిగి తిరిగి మరల బ్రాహ్మణాధివాసమునే (స్వగ్రామము) చేరుకొనెను.

బాణుడీ సందర్భమునందు ఇందరి స్నేహితుల పేర్లను ఎట్టి తారతమ్యము లేకుండ ఉట్టంకించి, గొప్ప చక్రవర్తి జీవితచరిత్రను వ్రాయదలచుకొన్న ఈ ఉద్గ్రంథమునందు వారికి గూడ గౌరవమును, ప్రతిపత్తిని కల్పించెను.

ఈతడు దేశాటమునందు సంపాదించిన అనుభవపు ఛాయలు కాదంబరీ హర్ష చరితములందు ప్రతిచోటను కనిపించును. ఆశ్రమ వర్ణనము నందితడు చూపించిన ప్రత్యేక శ్రద్ధకు కారణము స్వయముగా ఈతని బంధుజనమంతయు సాక్షాత్తు యీ తపోవనముల వంటి గురుకులములను స్థాపించి నడిపించుటయే. వానినతడు తనివి తీర దర్శించి సల్లాప గోష్ఠులతో కాలము గడిపెను. ఈ కుటుంబములు అనవరతాధ్యయనధ్వనిముఖరములు. వీరిండ్లలో భస్మ త్రిపుండ్రక లేఖలతో కపిల శిఖా జాలముతో క్రతువు కొరకవతరించిన అగ్నుల వలె వటుపుల నివసించుచుండిరి. వీరిండ్లముందు నీరు పెట్టిన సోమ కేదారికలు[1]

1. సోమలతలు

ఏపుగా పెరిగి పరిసరములను పచ్చపచ్చగా చేసెను. కృష్ణాజినముల మీద పురోడాశమునకై బియ్యమును ఎండపోసియుండిరి. బాలికలు నీవారబలుల నిచ్చుచుండిరి. అడవినుండి శిష్యగణము హరితకుశలను పలాశ సమిధ లను తెచ్చుచుండిరి. వంటచెఱకు కొరకు పిడకలు చేసి యుంచిరి. అగ్నిహోత్ర ధేనువులు అంగణమునందలి వితర్దికలపై (అరుగులపై) భూమిని రాచుచుండెను. ఈ ధేనువుల పాలను, పెరుగును కలిపిన ఆ మిశ్రమును వైశ్య దేవ బలి యందు సమర్పించెడివారు. ఇచ్చటనే కమండలువులు చేయుటకు మట్టిని యతులు మర్దించుచుండిరి. వైతాన వేదికను కట్టుటకు ముందు గుర్తుల కొరకు పాతిపెట్టిన మేడికొమ్మల రాసులు పడి ఆ ప్రదేశమును పవిత్రము చేసెను. ఇచ్చటి పరిసర ములు వైశ్వదేవ పిండములతో తెల్లగ కనిపించెను. హవిర్ధూమములు ఆకాశము మీద వ్యాపించి చుట్టుపట్ల చెట్ల చిగురుటాకులను నల్లబరచు చుండెను. ఆవు దూడలను తమ పిల్లలుగా భావించి గోపాలకులు లాలించుచుండిరి. ఈ అంగ ణమునందు అనేక వర్ణములుగల మేకపిల్లలు చెంగుచెంగున గంతులు వేయుచు అచ్చట యజ్ఞముల యందు జరుగు పశుబలిని సూచించు చుండెను. చిలుకలు, గోరువంకలు తాము కూడా పాఠములను నేర్చి ఎడనెడ పాఠముల నందించి నప్పుడు అధ్యాపన సమయమునందు అధ్యాపకుల కొకింత విశ్రాంతి దొరికెడిదట.[1] ఈ వర్ణనమంతయు కాదంబరిలో జాబాలి తపోవన వర్ణనములో గూడా పాఠకు లకు కన్పించును.

తానింకను స్వధర్మ పరిపాలన మందు స్థిరపడక ముందే వసంత ఋతువు చిన్న పిల్లలను లాలించినట్లు చెట్లను చేమలను లాలించు వేళలో క్రమ క్రమముగా ఎండలు ముదిరి సూర్యుని కన్నెత్తి చూచుటయే అసాధ్యము కాగా, ఒక నాటి మధ్యాహ్న వేళలో బాణుడు తన యింటనే భోజనము చేసి విశ్ర మించు చున్నప్పుడు అతని పారశవభ్రాత చంద్రసేనుడు ప్రవేశించెను. చతు స్సముద్రాధిపతి, సర్వచక్రవర్తులకు ధౌరేయుడు మహా రాజాధిరాజ పరమేశ్వ రుడు శ్రీ హర్షదేవుని భ్రాత కృష్ణవర్ధనుడు బాణుని వద్దకొక వార్తాహరుని పంపె

1. హర్ష. పుట. 21

నని చంద్రసేనుకు తెలియజేసెను.[2] బాణుడతనిని వెంటనే ప్రవేశపెట్టమని ఆదేశించగా ఆ లేఖ హారకుడు ప్రవేశించెను. అతని పేరు మేఖలకుడు. వాని వర్ణన మిట్లున్నది. అతడు సుదూరము ప్రయాణము చేసి వచ్చినందున, వాని పిక్కలు మొద్దుబారియుండెను. అతడు చండాతకమును (Tunic) కట్టుకొని నడుముకొక మట్టికొట్టుకొని పోయిన గుడ్డను బిగించి యుండెను. వీపు మీదకు వ్రేలాడిన బట్టపేలికల ముడి అతడు పరుగెత్తుచున్నప్పుడు సడలి యుండెను. గట్టితాడుతో గ్రుచ్చిన లేఖ మాలికను అతడు తల మీద పెట్టుకొని వచ్చెను.[3] ఇట్టి లేఖ హారకుని వర్ణనము నొకదానిని దామోదరగుప్తుని 'కుట్టనీ మత గ్రంథము'నందు కూడ చూడవచ్చును. ఈ గ్రంథముకూడ ఇదే కాలమునకు చెందియున్నది.

కృష్ణవర్ధనుడు మేఖలకుని వెంట పంపిన సందేశము బాణునకు చాలా ఇష్టమయిన స్నేహధర్మమును ఉట్టంకించునదియే. ఇచ్చట కృష్ణుని ముఖమున బాణుడు ప్రస్తుతించిన స్నేహ మీమాంస కూడా మిక్కిలి ప్రశంసార్హము. కృష్ణు డతనికిట్లు సందేశము పంపెను: 'మాన్యుడవైన నీకు స్నేహపు విలువ తెలియనిదికాదు. ఏకగోత్రతవలనను, సమానజాతి వలనను ఒకచోట కలసి పెరుగుట, నివసించుటవలనను తరచుగా ఒకరినొకరు కలసికొనుచుండుట, ఒకరి ఎడల మరొకరికి గల అనురాగమును ఇతరుల ద్వారా తెలిసికొనుట, పరోక్షముగా ఉపకారముచేయుట, సమానశీలత వీనినన్నింటి దోహదమున స్నేహలత పెరుగును. నీ ఎడల నాకు ఎట్టి కారణములేకయే నిన్ను చూడక ముందే అప్రయత్నముగా స్నేహభావము కలుగుచున్నది. నా హృదయము నిన్ను చేరవచ్చిన బంధువును వలె గారవించుచున్నది. చంద్రుడు అల్లంత దూరమునుండి కుముదాకరమును సంభావించుట లేదా ?' అని కృష్ణవర్ధనుడు బాణుని ఎడల లేఖనీమైత్రిని వెలిబుచ్చెను (ఈ స్నేహ పాశమే బాణుని హర్ష వర్ధనుని ఆస్థానము వైపునకు ఆకర్షించినది. కృష్ణుడు బాణునకు నిర్నిమిత్త

---

2. *మధువన 'ఖాన్స్రా' తామ్ర శాసనమునందు హర్షవర్ధనుడు తన వంశావళిని వర్ణించి చివరకు 'స్వహస్తోమమ' మహారాజాధిరాజ శ్రీ హర్షస్య' అనియే తన చేవ్రాలు నుంచెను.*

3. హర్ష. పుట. 28.

బంధువయ్యేను. భవభూతి చెప్పిన 'వ్యతిషజతి పదార్థానాంతరః కోఽపి హేతుః' అన్న సుభాషితమును ఇక్కడ చక్కగా అన్వయించవచ్చును.) తొలుత కృష్ణుడు బాణుని ఎడల తన స్నేహ బంధమును ఏర్పరచి, ఆ తర్వాత సందేశ ప్రయోజనమును మేఖలకుని ద్వారా వివరింపజేసెను.

మేఖలకుడు చెప్పిన మాటలివి:—

దుర్జనులు కొందరు బాణుడు చాపల్యముచేత స్వైరవిహారము చేసెనని ఆరోపించి అతడు చేసిన చిలిపి పనులను చిలవలు పలవలుగా పెంపొందించి అడరాని మాటలు ఆడి అతనిపై దుష్ప్రచారముచేసి చక్రవర్తికి కూడా అతని ఎడల అనిష్టభావమును కలిగించిరి. వారు బాణునిపై ఆరోపించినవి కేవలము నీలాప నిందలే. ఎట్టివారికైనను కొందరు మిత్రులు, మరికొందరు ఉదాసీనులు, శత్రువులు ఉండియే యుందురు. అట్టి దుష్ప్రచారములు చక్రవర్తివరకు కూడ చేర్చి యిందరాడిన మాటలో నిజమే ఉండును కాబోలునని అతనినికూడా నమ్మించిరి. బాణుని సౌశీల్యము నెరిగిన కృష్ణవర్ధనుడు మాత్రము ఆ అపనిందలను నమ్మక చక్రవర్తి భ్రమను కొంతవరకు తీసివేసెను. అయినప్పటికిని బాణుడేమాత్రము కాలయాపన చేయక పరమేశ్వరుని దర్శనము చేయవలయును. అవకేశి (వంధ్య వృక్షము) వలె అతడు నిష్ప్రయోజనముగా తన బంధువుల మధ్య కాలము గడుపరాదు. చక్రవర్తి ఏమనుకొనునో అన్న భయము అతనికి అవసరము లేదు. వెంటనే అతడు బయలుదేరి రావలయును. ఈ కృష్ణవర్ధనుని సందేశమునుబట్టి బాణుడన్నచో పడరానివారు కొందరుండిరనియు, గోరంతలు కొండంతలు చేసి వారతనిని దూషించిరనియు తెలియుచున్నది. అందుకే కాదంబరి అవతారికా శ్లోకములో బాణుడట్టి వారిని- ఈ విధముగా నిందించెను.

1. 'అకారణావిష్కృత వైరదారుణాత్
2. అసజ్జనాత్ కస్యభయం నజాయతే' (శ్లో. 5)

ఈ సందేశమును విన్న బాణుని హృదయములో రాజపరమేశ్వరుని దర్శనము చేయుట అవశ్యమని నిశ్చితాభిప్రాయమేర్పడెను. కృష్ణునకు తని మీద స్నేహము, హర్షునకు అన్యధా భావము కలిగినందువలన మహారాజు హృదయము నుండి అట్టిభావమును తీసివేయుట బాణునకు తప్పనిసరి అయ్యెను.

బాణుడిట్లు నిశ్చయించుకొని మరునాడు ప్రాతఃకాలమున స్నానము చేసి తెల్లని పట్టు పుట్టమును గట్టి అక్షమాలను చేత ధరించి, ప్రాస్థానిక సూత్రములను, మంత్ర పదములను పఠించి, దేవ దేవుడగు విరూపాక్షునికి క్షీరాభిషేకము చేసి సుగంధ కుసుమ, చందన, ధూప దీప బలులతో పూజను నిర్వర్తించి ధ్వజారోపణము చేసి అగ్ని దేవుని ఆజ్యతిలాహుతులతో పూజించగా, అతడు దక్షిణార్చియై కలుగవోవు శుభములను సూచించెను. తన శక్తి కొలది అతడు బ్రాహ్మణులకు ద్యుమ్నమును (దక్షిణలను) ఒసగెను. తూర్పు దిక్కున కెదురు ముఖము చేసి నిలచిన నైచికికి (పవిత్ర ధేనువునకు) ప్రదక్షిణము చేసెను. తెల్లని వస్త్రములు, తెల్లని అంగరాగము, తెల్లని పువ్వులను ధరించి, గోరోచనము నద్దిన దూర్వాగ్ర పల్లవములతో గిరికర్ణికారమును కలిపి గ్రుచ్చి చెవిమీద మడిచి పెట్టుకొనెను. సిగమీద సిద్ధార్థకములను (తెల్ల ఆవాలు) చల్లుకొని అతడు బయలుదేరెను. ఈ బాణుని వర్ణనము శ్రౌత స్మార్తముల యందు నిష్ఠ కలిగిన ఒక బ్రహ్మమయ మూర్తిని, కర్మఠుని పాఠకులకు పరిచయము చేయును.

అతడట్లు బయలుదేరువేళ ఆతని మేనత్త మాలతి యను నామె అతనికి ప్రయాణమంగళమును నిర్వర్తించెను. ఈమె బాణునికి మాతృనిర్విశేష. అతనికి తల్లిలేని లోపమును ఈమె తీర్చను. స్నేహార్ద్ర హృదయ ఈమె. తెల్లని వస్త్రములను ధరించి సాక్షాత్తు భగవతి మహాశ్వేతవలె ఈమె ఉండెను. బాంధవ వృద్ధ లందరును బాణుని ఆశీర్వదించగా పరిజనము నందలి వృద్ధ స్త్రీలు అభినందించిరి. గురుచరణ స్పర్శచేసి వారి సమ్మతితో అతడు ప్రయాణము చేసెను. కుల వృద్ధుల కతడు నమస్కరించగా వారతని శిరమును మూర్కొనిరి. మంచి శకునమును చూచుకొని అతడు బయలుదేరుముందు యింటిముందర ప్రస్థాన పూర్ణ కలశమును నిలిపిరట. ఆ కలశము కంఠమునకు నలుపురంగు లేని పూవులతో దండనల్లి చుట్టిరి. కలశమునకు పిండితో వేలి ముద్రల నద్ది, పైన మామిడి చిగుళ్ళను పెట్టిరి. ఇట్టి కలశమును గోమయలిప్తమయిన గృహాంగణము నందు నిలిపిరి. ఇది మంగళకరము, ప్రయాణము చేయువారికి శుభావహము.[1] ఈతడు

---

1. *ఈ ప్రస్థాన కలశ వర్ణనము గాథా సప్తశతిలోని వర్ణనమునకు సరిగ్గా సరిపోవును* (చూ. *గా.* స. II. 43)

కులదేవతలకు నమస్కరించి చేత పండ్లను పూవులను పట్టుకొని జపము చేయుచు బ్రాహ్మణులనుసరించగా ప్రీతికూటమునుండి బయలుదేరి మూడవనాటికి చక్రవర్తి రాజభవనము వద్దకు చేరుకొనెను.[1]

రాజద్వారమునందున్న జనసమ్మర్దమును చూచి బాణుడు ఇంతమందిని సృష్టించిన బ్రహ్మకు అలసట కలుగలేదా? పంచమహాభూతములు పరిక్షయము నొందలేదా? పరమాణువులు విచ్ఛిన్నము కాలేదా? కాలము అంతమొందలేదా? ఆయుష్యము నిండలేదా అని ఆశ్చర్యపడెను. చిన్నచిన్న గ్రామములనుండి వచ్చి రాజధానిలోని జనసమ్మర్దమును చూచినవారి తొలి యనుభవమిట్టిదే.[2]

ఇతడాస్థాన మండపమును చేరి యజ్ఞోపవీతమును వేలికి చుట్టుకొని చక్రవర్తికి స్వస్తి శబ్దమును పలికెను. రాజతనిని చూచి పర్వత గుహనుండి వెలువబడిన సింహబృంహిత గంభీర స్వరముతో ఆకాశ మండలమును పూరించి 'ఇతడు బాణుడా? అని అడిగెను. అంతియే యని దౌవారికుడు పలుకగనే చక్రవర్తి ముఖమును గిరుక్కున తిప్పి నలుపెక్కిన అపాంగములతో వెనుక కూర్చున్న మాలవ రాజకుమారుని ఉద్దేశించి 'ఇతడు మహా భుజంగము' అని అనగనే బాణుడప్పుడు తనను తాను సమర్థించుకొనుచు 'దేవా! లోకవృత్తాంతము తెలియని వానివలె నన్ను గూర్చి ఇట్లాజ్ఞాపించుచుంటిరి. స్వైరముగా తిరుగు నావంటివారిని గురించి లోకులు నలుగురు నాలుగు విధములుగా భావించుట సహజము. జాత్యానేను బ్రాహ్మణుడను. సోమపాయులగు వాత్స్యాయనుల వంశమున జన్మించిన వాడను. వేదవేదాంగములను, శాస్త్రములను అధ్యయనము చేసితిని. దారపరిగ్రహము చేసి గృహస్థునయితిని. నేనెట్లు భుజంగుడను (విటుడను?)' అని విన్న వించుకొనెను.[3]

---

1. హర్ష. పుట. 26.
2. హర్ష. పుట. 28. శాకుంతల నాటకములో శార్ఙ్గరవ శారద్వతులు హస్తినాపురమును ప్రవేశించినప్పుడు వారికిట్టి భావమే కలిగెను. చూ. శా. 5 వ అంకము.
3. హర్ష. పుట. 36

భూపతి 'నేనట్లు వింటిని' అని ఊరకుండెను. బాణునకెట్టి రాజమర్యాదలును జరుగలేదు. కాని చక్రవర్తి అమృతమును వర్షించు స్నేహమయ దృష్టితో తనకు బాణుని ఎడలగల ప్రీతిని వ్యక్తము చేసెను. ఇట్లు రాజునకు ప్రీతిపాత్రుడై అతడు గృహోన్ముఖుడై బ్రాహ్మణాధివాసమును చేరెను.

అతనిని బంధువర్గము అత్యాదరముతో ఎదుర్కొని స్నేహవర్షమును అతనిపై కురిపించిరి. బంధు మిత్రుల ప్రీతితో బాణుని జీవితము తనిసిపోయెను. అప్పుడతడు తన బంధువులకు వేసిన కుశలప్రశ్న అధ్యయన అధ్యాపన సంప్రదాయమును పాటించుచు అట్టి వృత్తిలోనున్న ప్రతి ఒక్కరు తమనుతాము ప్రశ్నించు కొనునట్లు చేయును. బాణుడు తన వారితో 'మీరు సుఖముగా నుంటిరా? మీ క్రాతపిక్రిమ (యజ్ఞము) యథావిధి నిర్విఘ్నముగా జరిగి ద్విజ చక్రమునకానందము కలిగించుచున్నది కదా? మంత్రపూర్వకముగా మీరు సమర్పించు హవిస్సును అగ్నిహోత్రుడు గ్రహించుచుండెగదా? వటువులు యథాకాలము అధ్యయనము చేయుచుండిరా? ప్రతిదిన మవిచ్ఛిన్నముగా వేదాభ్యాసము జరుగుచున్నదా? చిరంతనముగా వచ్చుచున్న యజ్ఞవిద్యయందు మునుపటివలెనే శ్రద్ధగలదా? పూర్వమువలెనే సమయమును వ్యర్థము చేయక వ్యాఖ్యాన మండలములు పరస్పర స్పర్ధానుబంధముతో వ్యాకరణ చర్చలయందు ఆదరము చూపుచుండిరా? ఇతర కర్తవ్యములను పరిత్యజించి విద్వాంసులు ఎప్పటివలెనే ప్రమాణగోష్ఠిని (తర్క శాస్త్ర చర్చ) జరుపుచుండిరా? ఇతర శాస్త్ర రసములయందు మంద ఆదరమును కల్గించు మీమాంసయందు ఎప్పటివలెనే మీకు అతిరస మేర్పడుచున్నదా? అభినవ సుభాషిత సుధలను వర్షించు కావ్యాలాపములు జరుగుచున్నవి కదా?' అని ప్రశ్నించెను.[1]

ఇట్లత్యంత ప్రమోదముతో వారు కాలముగడుపుచున్నప్పుడు మిత్రులలో నొకడగు సుదృష్టి యను పుస్తక వాచకుడు ఒకనాటి మధ్యాహ్న విశ్రామ సమయమునందు పవమాన ప్రోక్తపురాణము (వాయుపురాణము) లోని భాగములను

---

1. హర్ష. పుట. 38

పఠించెను. [1] అప్పుడతని సమీపమునందే ఉన్న సూచీబాణుడను బంది (వంది) తారమధుర కంఠముతో నీ ఆర్యను పఠించెను.

> 'తదపి మునిగతమతి పృథు, తదపి జగద్వ్యాపి,పావనం తదపి,
> హర్షచరితా దభిన్నం ప్రతిభాతి హి మే పురాణమిదం'

(ఈ వాయుపురాణము మునిప్రోక్తము. జగద్వ్యాపి. చాలా పెద్దది. పావనము-పవిత్రము, పవనుడు చెప్పినది. ఇది హర్షచరితమున కభిన్నమని నాకు తోచుచున్నది.) ఈ ఆర్యను విన్న బాణుని పితృవ్య పుత్రులు గణపతి, అధిపతి, తారాపతి, శ్యామలులను వారు కూడబలుకుకొని చిన్నవాడగు శ్యామలునిచేత రెండవ మహా భారతము వలె గంభీరమయిన 'హర్షచరితము'ను బాణుడు రచించి తీరవలెనని అడిగించిరి. బాణుడు వారి ప్రార్థనను అంగీకరించి శ్రీకంఠ జనపద వర్ణముతో హర్షచరితాఖ్యాయికను ఆరంభించెను.

---

1. *సుదృష్టి వర్ణనమిట్లున్నది:*
*అతడు నెమలి అపాంగమువలె తెల్లని పౌండ్ర క్షౌమ వస్త్రయుగ్మమును (పుండ్రదేశము అనగా నేటి బెంగాలు, బీహారు) ధరించెను. ఈతడు బందికావున (క్షత్రియునకు శూద్ర స్త్రీ యందు పుట్టిన వాడు) గోరోచనము తీర్థమృత్తికతో కలిపిన తిలకమును ధరించెను. (కాదంబరిలో చండాల కన్యకను వర్ణించినప్పుడామె కూడా గోరోచన తిలకమును దిద్దెనని కవి వర్ణించెను). ఇతడు ఆమలక తైలమును తలకు రాచుకొనెను. చిన్నవైన సిగకు పువ్వులు చుట్టి యుండెను. అప్పుడప్పుడు మాత్రమే తాంబూల చర్వణము చేయుట వలన ఆతని దంతకాంతులు ఉజ్జ్వలమయి ఉండెను. కంటికి సన్నని కాటుక రేఖ మెరయు చుండెను. వినీతార్య వేషము నతడు ధరించి, ఆసందిక మీద (పీఠము) కూర్చుండి శరశలాకాయంత్రము (రెల్లు పుల్లలతో చేసిన వ్యాస పీఠము) మీద పుస్తకము నుంచి, దానికి కట్టిన దారపు ముడిని విప్పి, గుర్తుపెట్టిన కాగితమును తీసి దంత కాంతులతో మసితో వ్రాసిన అక్షరములను ప్రకాశింపజేయుచు పత్రములమీద బరువును పెట్టి, గమకములతో శ్రోతృహృదయముల నాకట్టుకొనుచు, వాయు పురాణమును పఠించదొడగెను. అతని వెనుక మధుకర పారావతులు (వాంశికులు) కూర్చుని యుండిరి.*
*(హర్ష చరితము* – III - 39.*)*

ఇంత వరకున్న కథలో మనకు బాణుని జీవిత విశేషములు అతని ముఖతః విన్నవి ఇవియే. ఇచ్చట ఊహాగానములకు, కట్టుకథలకు తావులేదు. భుక్తికి లోపములేని పండితవంశము నందు బాణుడు జన్మించెను. ధైర్యసాహసములు ఆత్మాభిమానము విద్యాభినివేశము, బంధుమిత్రుల ఎడల ప్రీతి, స్వతంత్ర భావములు, విశాల దృష్టి, పరిణతబుద్ధి, క్రొత్తక్రొత్త స్థలములను దర్శించి జీవనమునందలి వైవిధ్యమును కనుగొనవలెనను కుతూహలము, సమానులయం దుత్తమ శ్లోకత్వము, తోటివారి నోటియందు నాలుకగా మెలగుట, వృత్తి గౌరవము, ధర్మము తనయందున్నప్పుడు చక్రవర్తికి కూడా భయపడక అతనిని ఒప్పించి మెప్పించు నేర్పు, ఆభిజాత్య గౌరవము మొదలగు గుణ పరంపరల వలన ఈత డయస్కాంతమువలె లోకులను తనవైపున కాకర్షించుకొని సూర్యకాంతమణివలె ప్రకాశమును, చంద్రకాంతమణివలె చల్లదనమును ప్రసాదించెడివాడని ఈ స్వీయ చరిత్ర తెలుపుచున్నది. మన దేశమునందు ఇదియే ప్రప్రథమ స్వీయచరిత నిర్మాణ ప్రయత్నమేమో! తెలియదు.

## బాణుడు స్తుతించిన కవులు :-

హర్షచరిత అవతారికలో పూర్వకవులను బాణుడు స్తుతించెను. కవీశ్వరులు బ్రహ్మసములు. వారిని స్మరించగనే బాణభట్టుని మనఃఫలకము మీద వ్యాసబ్రహ్మ సాక్షాత్కరించెను. కవి అంటే వ్యాసుడే కవి; తదితరులు అతని ముందు తీసికట్టు అనే భావ మితనిలో ఏర్పడినది. ఇతడు (వ్యాసుడు) సృష్టించినది విజ్ఞాన ప్రపంచము, బాణుడు సృష్టించినది కావ్యప్రపంచము; రసమయ భావనామయ, అలంకార భూయిష్టమయిన ప్రపంచము. వైదికధర్మనిష్ఠుడయిన బాణునిగుండెకు భారతామ్నాయమే ఎక్కువగా ఆకర్షకమైనది. సరస్వతీ వృష్టివల్ల పుష్టమైనది భారతామ్నాయము. సరస్వతీనదిచేత పునీతమైనది భారతవర్షము అనిఈతని భావము. (హర్ష. శ్లో. 3)

బాణుడు వ్యాసుని భారతమును తనివితీర స్తుతించిన పిదప "వాసవదత్త" కథను ప్రశంసించెను. ఈకథ ఇతర కవుల దర్పమును అది అణచి వేసెనని ఇతడు చెప్పెను ఇది సుబంధు ప్రోక్తమగు వాసవదత్తయో, పతంజలి సూచించిన వాసవదత్తయో తెలియదు. ఆ తరువాత గౌరవ తాంబూలముభట్టార హరిచంద్రు

గాథ. ఇతని గద్యబంధము పదబంధములతో ఉజ్జ్వలమై, మనోహరమై, వర్ణక్రమ స్థితిని కలిగి రాజమర్యాదను పొందగలిగినదట.[1] ఈ భట్టార హరిచంద్రుడు రచించిన గద్యబంధమేదో తెలియదు. ఇట్లు రెండు గద్యబంధములను ప్రశంసించిన తరువాత బాణుని దృష్టి సాతవాహన సప్తశతి పైకి మరలెను.[2] ఇది అవినాశి, అగ్రామ్యము, సాతవాహనుడు రత్నములతో కోశమును నింపినట్లు దీనిని సుభాషితములతో నింపెను అని బాణుడనెను. కుముదోజ్జ్వలమగు ప్రవరసేనుని కీర్తి సేతునామక కావ్యముతో సముద్రాలను దాటిపోయినది. కపిసేనకూడా సేతునిర్మాణమును చేసియే సముద్రమును దాటెగదా ![3] పరోక్షముగా సేతుబంధ ప్రశంసను బాణుడు కాదంబరిలో కూడా ఒకచోట తారాపీడుని వర్ణించు సందర్భమునందు చేసెను. 'నలకర తలాకలిత శైల సహస్ర సంఘాతాదా సేతుబంధాత్'[4] భాస కాళిదాస బృహత్కథాకారులను బాణుడిట్లు కొనియాడెను: భాసుని నాటకములను సూత్రధారులు ఆరంభమును చేయుదురు. ఇందు పాత్రలసంఖ్య ఎక్కువ. దేవకులములు సపతాకములైనట్లే ఈ నాటకము లందును పతాకాస్థానముండును. అట్టి నాటకములను రచించి భాసుడు కీర్తిని పొందెను.[5] కాళిదాసు సూక్తులు పూలగుత్తులవంటివి. వానియందెవరికి ప్రీతి కలుగదు[6] పార్వతీదేవి ప్రసాధనము, కందర్ప సముద్దీపనము, శివుని లీలలే. ఇట్టి లీలలు చూపించు 'బృహత్కథ' ఎవరి కాశ్చర్యము కలిగించదు ?[7]

ఈ ప్రశంసలో బాణుడు సంస్కృత ప్రాకృతమును కులమత భేదములను పాటించక తన మనస్సు నాకట్టుకొన్న ప్రతి మహాకవికిని నీరాజనము లెత్తెను. సాతవాహన సప్తశతి, సేతుబంధము, బృహత్కథ- ఈ మూడును ప్రాకృత రచనలే.

---

1. హర్ష. అవతారిక. శ్లోకము. 10.
2. ,, ,, ,, 12.
3. ,, ,, ,, 13.
4. ,, ,, ,, 14.
5. ,, ,, ,, 15.
6. ,, ,, ,, 16.
7. ,, ,, ,, 17.

# కాదంబరి కథ

మూడు జన్మల వృత్తాంతమును కాదంబరీకారుడు గొలుసుకట్టు కథ వలె వర్ణించెను. కాదంబరీ కథకు తిలకము వంటిది కథాముఖము. బాణభట్టు తన వంశ వృక్షమును ఇరువది శ్లోకములలో వర్ణించి శూద్రక మహారాజు కథతో కథా ముఖమును ఈ విధముగా వర్ణించెను — వేత్రవతీ నదీతీరములో కలికాల భయ పుంజీభూతమైన కృతయుగము వలె సద్ధర్మమునకు నిలయముగా విదిశానగర మున్నది. దానికి ఏలిక శూద్రక మహారాజు. ఇతడు సకల గుణగరిష్ఠుడు. ఆదర్శ ప్రభువు. కళాకోవిదుడు. శాస్త్రపారంగతుడు.

ఒకనాడు ఈ రాజు కొలువుతీర్చి యుండగా ఒక చండాల కన్యక చిలుక నొకదానిని పంజరమునందు బంధించి రాజునకు ఉపాయనముగా సమర్పించును. ఆ చిలుక అన్ని కళలు, శాస్త్రాలు నేర్చినదనియు సకల భువనతల రత్నములకు ఉదధివలె మహారాజు అన్ని రత్నములకు ఏకభాజనము కావున దానిని పరిగ్రహించ వలెననియు అర్థించును. ఆ శుకము కుడికాలు పైకెత్తి ఒక 'ఆర్య'తో మహారా జునకు జయ శబ్దము పలికి సభ్యుల నాశ్చర్యచకితులను చేయును.

మహారాజు మధ్యాహ్న విశ్రామ సమయములో చిలుక వృత్తాంతమును వినగోరెను. చిలుక తాను వింధ్యాటవిలో నొక శాల్మలీ వృక్షముమీద ముదుసలి తల్లిదండ్రులకు పుట్టితినని ప్రసవవేదనను భరించజాలక తల్లి గతాయువగుటయు (చిలుకకు ప్రసవవేదనయా!) తండ్రి తన పోషణభారమును వహించి తోటి చిలుకలు తినిపారవేసిన ఫలఖండములను,శాలికణములను(బియ్యపుగింజలను)తెచ్చి తనను అసాధారణమగు ఆపత్య ప్రేమతో పెంచుచుండగా రెక్కలు వచ్చి ఆకాశము నందు ఎగసి పోకముందే ఒకనాడు వేటకాండ్రగుంపు అడవికి వచ్చుటయు, అందుండి ఒక ముసలి వేటకాడు శాల్మలీ వృక్షము నెక్కి దాని చిగురుటాకులు, పల్లవముల నుండు చిలుకపిల్లల గొంతునులిమి క్రిందికి విసిరివేయుచు యమ దండము వంటి తనచేతిని చాపి ముసలితనము వలన ఎగురలేని స్థితిలోనున్న తన

తండ్రిని చంపి క్రిందికి పారవేయుటయు, ఆ తండ్రి రెక్కల సందులో తల దాచుకొని ఉన్న తాను ఎండుటాకుల మీదపడి ప్రాణములతో బయటపడుటయు, సంభవించెనని చెప్పెను.

ఆ చిలుక పేరే వైశంపాయనుడు. తానిట్లు అడవిలో పడుచు లేచుచు ప్రాణాల నరచేతిలో పెట్టుకొని ముందుకు పోవుచుండగా హారీతుడను ఋషి కుమారకుడు తనను చూచి భూతానుకంపతో రక్షించి తన తండ్రి జాబాలి ఆశ్రమమునకు తీసికొని పోవును. జాబాలి మహాముని తనను చూచి ఈ చిలుక తాను చేసిన అవినయ కార్యముల ఫలమునే అనుభవించుచున్నదని చెప్పగా అతని చుట్టునూ చేరిన ముని కుమారకులు 'ఏమా అవినయ కార్యము ?' అని ఉత్కంఠతో ప్రశ్నించిరి. వారి నిర్బంధమున జాబాలి 'శ్రూయతాం యది కుతూహలం' అని కాదంబరీ కథను ప్రారంభించుటతో కథాముఖము ముగిసి పోవును.

కథ ఇట్లారంభమగును :

ఉజ్జయినీ నగరమును ఏలు తారాపీడ మహారాజుకు విలాసవతి అను భార్య యందు నోముల పంటగా చంద్రాపీడుడు అను కొడుకు పుట్టెను.

తారాపడుని మంత్రి శుకనాసుడు. ఇతడు బుద్ధికి బృహస్పతి వంటివాడు. శుకనాసునకు కూడ అదేసమయమునందు మనోరమయను బ్రాహ్మణి యందు వైశంపాయనుడను కొడుకు పుట్టెను. వైశంపాయన చంద్రాపీడులు ఒకే వృంతములోని రెండు అకుల వలె కలిసి పెరిగి విద్యాబుద్ధులు నేర్చుకొనిరి. గురు వనుజ్ఞతో గురుకులమును వదిలి ఇంటికి తిరిగి వచ్చిన చంద్రాపీడునకు తండ్రి ఇంద్రాయుధమను మేలుజాతి అశ్వమును బహూకరించి దిగ్విజయ ప్రస్థానమునకు ప్రేరేపించెను. యౌవనము నందు ప్రవేశించుచున్న రాజ కుమారునకు శుకనాసుడు నయసారమనదగిన అపూర్వోపదేశమును చేసెను. వైశంపాయన ద్వితీయుడై ఆ రాజకుమారుడు దిగ్విజిగీషతో కైలాస పర్వత సమీప ప్రాంతమున పూర్వజలనిధికి చేరువన హేమకూట పర్వతము వద్ద సువర్ణ పురమనే కిరాతావాసమును జయించి, అచ్చటనే సైన్యమును కొంతకాలము విశ్రమింపజేసెను. అక్కడ సంచరించుచు ఇంద్రాయుధముమీద పోయి పోయి కిన్నర మిథునము నొకదానిని వెంబడించి తన సైన్యమునకు దూరముగా తనకు

తెలియని ప్రాంతమును చేరుకొనెను. అచ్చట జలాన్వేషియై ముందుకు పోయి అచ్ఛోదమను సరోవరమును దర్శించి దాని తీరమునందున్న శివసిద్ధాయతనములో తపశ్చర్యయందు నిమగ్నురాలైన మహాశ్వేతను దర్శించెను. మహాశ్వేత అతనికి అతిథి సత్కారములను చేసి తన వృత్తాంతమును ఈ విధముగా చెప్పదొడంగెను?

## మహాశ్వేత కథ :-

అప్సరసల కులములో హంసుడను వానికి గౌరియను కళత్రమునందు మహాశ్వేత జన్మించెను. ఆమె ఒకనాడు అచ్ఛోద సరోవరమునకు స్నానార్థము సఖీజనముతో కలిసిపోగా అచ్చట లక్ష్మిదేవికి శ్వేతకేతువను ఋషివలన పుట్టిన మానసపుత్రుడు ధృతవ్రతుడు పుండరీకుడను వర్ణి కనిపించును. అతని దేహము నుండి వెలువడు సుగంధము వలన మహాశ్వేత ఆకృష్టయయి రూపాతిశయమును చూచి వివశయై అతని యందు బద్ధ భావయగును. పుండరీకుడు కూడా ప్రథమ దర్శనము నందే మహాశ్వేతయందనురాగము ఏర్పడగా ఆమెను పొందుటయందు జరిగిన కాలయాపనను సహించలేక తిరిగి మహాశ్వేత అతనిని చేరుకొనక పూర్వమే పరాసువగును. అప్పుడతని వద్ద అతనికి రెండవ ప్రాణమగు కపింజలుడు మాత్రమే ఉండును. ప్రాణములను విడుచుచు పుండరీకుడు తన ఈ అవస్థకు కారకుడగు చంద్రుని ఈ విధముగా శపించును, 'యథాహ మప్రాప్త ప్రియాసమాగమయేవ త్వయా ప్రాణై ర్వియోజితః తథా త్వమపి కర్మభూమి భూతేఽస్మిన్ భారతే జన్మని జన్మన్యేవ ఉత్పన్నానురాగోఽప్రాప్త ప్రియాసమాగమః జీవిత ముత్స్రక్ష్యసి' (తనవలె చంద్రుడు కూడా జన్మజన్మలలో మన్మథ వ్యథను అనుభవించవలెనని శాపసారాంశము). అట్లు మరణించిన పుండరీకుని శరీరముతో సహగమనమును చేయదలచిన మహాశ్వేతను ఆకాశవాణి వారించెను. పుండరీకుని దేహమును చంద్రమండలం నుండి ఒక తేజస్సు వచ్చి పైకి లేవనెత్తగా కపింజలుడు ఎనుగెత్తి ఏడ్చుచు ఆ దేహమును అనుసరించెను. జీవితేశ్వర సమాగమ వ్రతమును మహాశ్వేత ప్రారంభించెను.

మహాశ్వేత తన వృత్తాంతమును ముగించి తన ప్రియ వయస్య కాదంబరీ వృత్తాంతమును చంద్రాపీడునకు చెప్పును. కాదంబరి అప్సరసల కులములోనే

పుట్టిన మదిరాదేవికినీ గంధర్వరాజు చిత్రరథునకు ఉదయించిన ముద్దులపట్టి. మహాశ్వేతకు వాటిల్లిన విపత్తు కాదంబరి హృదయమును కలచివేయును. మహాశ్వేత శోకాగ్ని చల్లారు వరకు తాను వివాహమాడనని కాదంబరి శపథము చేసెను. హేమకూట పర్వతము రమణీయమైనదని చెప్పి దానిని చూడరమ్మని మహాశ్వేత చంద్రాపీడుని ఆహ్వానించును. చంద్రాపీడుడు హేమకూటమునందు కాదంబరిని దర్శించెను. ఇక్కడనే నాయికా నాయకులు తొలిసారి పాఠకులకు సాక్షాత్కరింతురు. కింపురుష దేశమగు ఈ హేమకూట పర్వతము భారత వర్షమునకు ఉత్తరమున ఉన్నదట. ఇది భారత భూభాగము కాదు. అందువలననే కాదంబరి సఖియగు మదలేఖ, 'కీదృశీ చోజ్జయినీ, కీదృగ్భారతవర్షం, రమణీయోవా మర్త్యలోకః' (ఉజ్జయిని ఎటువంటిది? భారతవర్ష మెట్టిది? మానవలోకము అందమైనదేనా?) అని చంద్రాపీడుని ప్రశ్నించెను.

చంద్రాపీడుని తాంబూల కరండ వాహిని పత్రలేఖ. ఆమెను కాదంబరి స్నేహభావముతో కొంతకాలము తనవద్దనే ఉంచుకొనెను. అచ్ఛోద సరోవర తీరమునకు చంద్రాపీడుని వెదకుచువచ్చి విడిసిన స్కంధావారమునకు మహారాజు తారాపీడుడు పంపిన లేఖ అందెను. చంద్రాపీడుని తిరిగి రమ్మని పంపిన వర్తమానమది. తిరుగు ప్రయాణములో ప్రకృతి శోభను, అడవిని, అందున్న చండికాయతనమును జరద్ద్రవిడ ధార్మికుని చూచి వినోదించుచు రాజకుమారుడు ఉజ్జయినిని చేరుకొనెను. అతని వెనుక పత్రలేఖ కూడ ఉజ్జయినిని చేరుకొని కాదంబరి విరహావస్థను కన్నులకు కట్టినట్లు వర్ణించి చంద్రాపీడునికి చెప్పెను. ఇంతటితో ఆకాండ హతమైనట్లు బాణభట్టుని లేఖిని ఆగిపోవుటతో పూర్వార్థము ముగియును.

ఉత్తరార్థమును అతని కొడుకు భూషణభట్టు ప్రారంభించుచు
''యాతేదివంపితరి తద్వచసైవ సార్థం. విచ్ఛేదమాప భువియస్తు
కథాప్రబంధః.
దుఃఖంసతాం తదసమాప్తి కృతంవిలోక్య ప్రారబ్ధ ఏష సమయా
న కవిత్వ దర్పాత్.''

''పుణ్య శ్లోకులగు మా తాతపాదుల మరణముతో ఈ కథాకథనమునందు విచ్ఛిత్తిని పొందెను. సహృదయు లందరునూ ఈ తీరని నష్టమునకు వగయుటతో నేను ఈ కథను పూర్తిచేయు పనికి పూనుకొంటిని గాని కవిత్వ దర్పము''తో గాదు) ఇవి భూషణభట్టు పలుకులు.

ఇట్లు ప్రతిజ్ఞా వాక్యమును పలికి తండ్రి వెదజల్లిన కథాబీజములను తన యుడు పెంచి పెద్దజేసి ఫలరూపమునకు తీసికొనివచ్చెను. ఇంతవరకు చంద్రాపీడు డెవరు? వైశంపాయను డెవరు? జాబాలి చెప్పబోవు చిలుక వృత్తాంతమునకు వీరితో ఏమి సంబంధము? కాదంబరీ చంద్రాపీడులతో తదితర పాత్రలకు ఏమి సంబంధము? ఎవరీ మహాశ్వేత? పత్రలేఖ ఎవరు? ఇంద్రాయుధము వైశిష్ట్యము ఏమి? అను ప్రశ్నల పరంపర పాఠకుల మనస్సులలో సహజముగా ఉదయించును. అసమాప్తముగా ఈ కథ ఉండిన చెల్లాచెదురుగా పడిన రత్నములవలె ఈ పాత్రలు మట్టికొట్టుకొని పోయి ఉండెడివి. ఈ రత్నములను ఏర్చికూర్చి దండను కట్టిన శ్రేయస్సు భూషణబాణునికి దక్కినది. ఇక ఉత్తరభాగ కథను వినుడు;-

పత్రలేఖ కాదంబరి ఉత్కంఠాపూర్ణ సందేశమును చంద్రాపీడునకు వినిపించెను. ఇంతలో స్కంధావారము దశపురము తిరిగి వచ్చినదన్న వర్తమానము చేరగనే దానివెంట వచ్చిన వైశంపాయనునితో కలిసి కాదంబరి వద్దకు పోవుదునని చంద్రాపీడుడు తలంచెను. పిదప అతడు పత్రలేఖాకేయూరకులకును తాను తిరిగివచ్చుచున్న సందేశమును ఇచ్చి హేమకూటమునకు పంపివేయును. త్రోవలోనే స్కంధావారమును కలిసికొని వైశంపాయనుని చూడవచ్చునను ప్రత్యాశతో బయలుదేరిన చంద్రాపీడునకు ఆశాభంగమగును. వైశంపాయనుడు అచ్ఛోద సరోవర తీరములో తిరుగాడుచు ఆ స్థలమును వదలిరాలేక ఉండిపోయెననియు, అతని వర్తమానము నందజేయుటకు తాము బయలుదేరి వచ్చితిమనియు అతని సైన్యము విజ్ఞప్తి చేసెను.

వర్షఋతువునందు కాదంబరిస్థితి ఎట్లుండునో అని ఆలోచించుచు వైశంపాయనుని వెదుకుచు బయలుదేరిన చంద్రాపీడుడు అచ్ఛోదమును చేరుకొనెను. అచ్చట తన మిత్రుని జాడ తెలియక మహాశ్వేతను తిరిగి కలిసికొని ఆమెవలన ఒక బ్రాహ్మణ యువకుడు అచ్చటికి వచ్చి ఆమెను చూచినది మొదలు చిరపరిచితతో వ్యవహరించినట్లు వ్యవహరించి 'చంద్రముఖీ ! నన్ను మన్మథుడు చంపివేయునేమో ? నీవే నాకిక శరణు' అని చిలుక పలుకులు పలుకగా చిలుకవు కమ్మని తాను శపించితిననియు వెంటనే అతడు మొదలు నరికిన చెట్టువలె భూమిమీద అచేతనుడై పడిపోయెననియు చెప్పెను. ఈ మాటలు విన్న చంద్రాపీడుని హృదయము వ్రక్కలై ఉన్నచోటనే అతడు ముక్త జీవితుడయ్యెను. అదే

సమయమున అతని నెదుర్కొనుటకు పత్రలేఖతో సహా కాదంబరి అక్కడికి వచ్చి జరిగినది చూచి నిశ్చేష్ట యగును. ఆమె అనుమరణార్థినియై (సహగమనమును చేయదలచి) చంద్రాపీడుని చరణములను స్పృశించగనే ఒకజ్యోతి అతని దేహమును వదలి ఆకాశ మార్గమునకు ఎగసిపోయెను. అశరీరవాణి మరల కాదంబరీ మహాశ్వేతల నుద్బోధించి పుండరీకుని శరీరం చంద్రలోకములో రక్షితమైనదనియు, శప్తుడైన చంద్రాపీడుడు మరణించెననియు, అతని శాపము ముగియువరకు పరకాయ ప్రవేశమునుచేసిన యోగి శరీరమును రక్షించినట్లు అతని శరీరమును రక్షించవలెననియు పలికెను. చెక్కిన చిత్రరువువలె ఉన్న పత్రలేఖ 'నీ యజమాని వాహనము లేకయే చనిపోయెను. నీవింకొక్క క్షణము కూడాఇక్కడ ఉండరాదు' అని పలికి ఇంద్రాయుధమును జరజర ఈడ్చుకొనిపోయి అచ్ఛోద సరోవరములోనికి దుమికెను.

పుండరీక శాపమువలన కర్మభూమి అయిన భారతదేశములో జన్మించిన చంద్రుడే చంద్రాపీడుడు. 'జన్మని జన్మని' అన్న పుండరీకుని శాప వచనమును అవితథము చేయుటకు అతడు పునర్జన్మ నెత్తవలసి వచ్చెను. పుండరీకుడే వైశంపాయనుడు. ఇతడు మహాశ్వేతా శాపమువలనే శుక యోనియందు జన్మించి వైశంపాయనుడను పేరుతోనే బరగెను. ఈ శుకమే జాబాలి వలన తన పూర్వజన్మ వృత్తాంతమును తెలిసికొనెను. ఇంద్రాయుధము కపింజలుడే. అచ్ఛోదము నందు మునిగి అశ్వరూపమును త్యజించి తిరిగి తన రూపమునే పొంది మిత్ర కార్యమును నిర్వహించుటకు బయలుదేరినవాడు ఇతడు. చంద్రుని భార్య రోహిణియే పత్రలేఖ చంద్రాపీడ మరణానంతరము ఈమె చంద్రలోకమును చేరుకొనెను. కపింజలుడు మహాశ్వేత నోదార్చి పుండరీకుని తండ్రి అయిన శ్వేతకేతువు వద్దకు వెళ్ళిపోవును.

ఈ కథనంతయు జాబాలి మహర్షి చెప్పి వైశంపాయనుడే ఈ చిలుక అని చెప్పగనే ఆ చిలుకకు తన పూర్వజన్మ సంస్కారములన్నియును ప్రాప్తించెను. హారీత ఋషికుమారకు డెంత ఆదరించినను ఆశ్రమమునందుండలేక మహాశ్వేతను తలచుకొనుచు ఒకనాడు అడవి లోనికి ఎగిరిపోగానే సాక్షాత్తు లక్ష్మీదేవి చండాల కన్యక రూపమును ధరించి ఆ చిలుకను ఒక పంజరమునందు బంధించి శూద్రక మహారాజునకు సమర్పించెను. శూద్రకుడే చంద్రాపీడుడు. చండాల కన్యక శూద్రక వైశంపాయనులకు వారి వారి ప్రియురాండ్రతో సమాగమ మగునట్లు దీవించి అదృశ్య యగును. వారుభయులును తమ శరీరములను త్యజించి పుండరీక చంద్రాపీడులుగా మారి మహాశ్వేతా కాదంబరులను కూడి సుఖముగా నుండిరి.

ఇదీ సంక్షేపముగా కాదంబరీ కథ.

# బాణుని రచనోద్దేశము

కాదంబరీ కథను స్థూలముగా పరిశీలించగనే మనకు స్ఫురించు విషయములు ఇవి :-

1) ఇది లోకాతీతమైన కథ. 2) హిందూ ధర్మమునకు మూలస్తంభమయిన పునర్జన్మ సిద్ధాంతము ఈ కథ అల్లికలోని క్లిష్టతకు, జిగికి కారణము. దీనికి శాప వృత్తాంతము జోడించబడినది. 3) ఇందులో పురుషపాత్రలే శాపగ్రస్తులై పునర్జన్మ పొందుట విశేషము. స్త్రీ లెవరును శాపగ్రస్తులు కాలేదు. వీరు తమ ప్రియులు మూడు జన్మములెత్తి వచ్చువరకును వేచియుండుట మరియొక విశేషము. (అందుకే వీరు గంధర్వాంగనలు). 4) ప్రాచీనకాలమున కిన్నర కింపురుష గంధర్వాదులకును, మానవులకును ప్రత్యక్ష సంబంధము ఉండెడిదని మన ప్రాచీనులు నమ్మిరి. జాగ్రత్తగా శిక్షణ నిచ్చినచో తిర్యగ్జంతు జాలమునకు గూడ బుద్ధి వికాసమునకు అవకాశమున్నదనియు భారతీయుల నమ్మకము. 5) కాదంబరి కథ పంచతంత్ర కథలవలె ఒక పెద్ద పెట్టెలో చిన్న పెట్టెలను ఇమిడ్చినట్లు లేదు. ఇందు అతి క్లిష్టమయిన మలుపులతో ఏ పాత్ర ఎవరో పాఠకులు గుర్తుపెట్టుకొనుట సాధ్యముకాక ఉక్కిరిబిక్కిరి అగుదురు. 6) ఈ కథ అటు రాజరికమునకు, ఇటు ప్రజానీకమునకు, ఆటవికులకు, దేవతలకు - మనుష్యులకు, మనుష్యులకు - పక్షులకు, పూర్వజన్మలకు-ఈ జన్మకు మధ్య వంతెనలు కట్టుచున్నది. దీని ప్రయోజన మేమి ? అని ప్రశ్నించిన సూటిగా వచ్చు సమాధానము ఒక్కటేనని నేను భావించుచున్నాను. ప్రేమ దేశకాలములకే గాక జనన మరణములకు కూడ అతీతమైనది. ఈ బంధమును తెంచివేయగల శక్తి లేదని చెప్పుటయే ఈ కథలోని ప్రధానోద్దేశ్యము. ఎక్కడి ఉజ్జయిని? ఎక్కడి హేమకూటము? ఎక్కడి అచ్ఛోదసరోవరము ? ఎక్కడి వింధ్యాటవి? ఎక్కడి చండాల కన్యక? ఎకడి చిలుక? ఎక్కడి శ్వేతకేతువు? ఎక్కడి కపింజలుడు? ఎక్కడి ఇంద్రాయుధము? ఎక్కడి పత్రలేఖ? ఎక్కడి మహాశ్వేత? ఎక్కడి కాదంబరి? ఎక్కడి చంద్రపీడుడు? ఎక్కడి వైశంపాయనుడు? ఎక్కడి విలాసవతి? ఎక్కడి చంద్రపీడుని శరీరము? ఇవన్నియు

తరచి చూచిన తేలునట్టి ప్రేమ నవనీతము వేడికి కరిగిపోనిది. కాలాంతరమున, పురుషాంతరమున నశించనిది. ఆస్వాదించుకొలది రుచ్యమైనది.

ఇందులో ప్రేయసీప్రియుల ప్రేమయేకాక మిత్రుల ప్రేమ, స్వామిసేవ కుల బంధము, తల్లి దండ్రులకు పిల్లలకును గల పరస్పర ప్రేమ (వాత్సల్య భక్తులు), చివరకు పెంపుడు జంతువులు గుఱ్ఱములు మొదలగువానితో మానవునికి గల అనుబంధము కూడా అమరమైనదవి కవి నిరూపించును. ఈ నిష్పత్తియే కథకు ప్రాణము. వర్ణనములు కావ్య బాహ్యసౌందర్యమును ఇనుమడింపజేయును. కాని బాణుని వర్ణనములు కథతో పెనవేసుకొని శైలిలో భాగమై బాణభట్టు రచనకే ప్రాణమై పోయినవి.

జీవితములో ప్రధానమైనది ప్రేయసీప్రియుల ప్రేమమాత్రమే కాదనియు మరి ఎన్నియో బంధములతో జీవి జన్మించుననియు నిరూపించుటకే కవి ఒక వైపు తల్లిదండ్రుల ప్రేమ, తల్లిలేని తండ్రిప్రేమ, కన్నప్రేమ, పెంచినప్రేమ, ఈ ప్రేమపాశమునకు దేవతలు సైతము అతీతులు గాని వైనము, గురువుల వాత్సల్యము, మైత్రి, మైత్రీ పరాకాష్ఠ, మైత్రిలో త్యాగము, రాణివాసములో వివిధ స్తరములకు చెందిన అనుచరులు, వారివారి స్వామిభక్తి ప్రేమలు, జంతువులకు యజమానిపైగల స్వామిభక్తి (నెనరు) ఇందు వర్ణితములు.

మనోరమా విలాసవతుల మైత్రి, తారాపీడ శుకనాసుల మైత్రి, చంద్రాపీడ వైశంపాయనుల మైత్రి ఒకవైపు, పత్రలేఖా చంద్రాపీడుల మైత్రి మరియొక వైపు, కాదంబరీ మహాశ్వేతల మైత్రి యొకవైపు, కాదంబరీ పత్రలేఖల మైత్రి మరియొకవైపు, కపింజల పుండరీకుల మైత్రి యొకవైపు, కపింజలేంద్రాయుధ చంద్రాపీడుల అనుబంధము మరియొకవైపు, కపింజలశుకముల మైత్రి ఇంకొకవైపు - ఈ విధముగా కథ మొత్తము స్నేహమయముగా నున్నది. ప్రేమ కెక్కడ ఎంతటి స్థానమో స్నేహమునకును అంతటి గొప్ప స్థానము — అంతకన్న గొప్పస్థానము ఉన్నది. దీనికి కారణము బాణుడు నిజ జీవితమున వివిధ రంగములవారితోను వివిధ వృత్తుల వారితోను మైత్రిని కలిగి యుండుటయే కాబోలు! అతనిది మిత్ర కుటుంబము. అతనికి వర్ణావరజులగు భ్రాతలును కలరు అయినప్పుడు ప్రేమ వైవిధ్యమును చిత్రించు శక్తి ఎట్లు కలుగకుండును?

ఈ ప్రేమ అను సూత్రముపై ఆధారపడిన మరియొక ముఖ్య విషయము ఉపదేశామృతము. ఇది తడవ తడవకును పాఠకులను ఉర్రూతలూగించును. సూక్తి రత్నములు, సుభాషితములు, ఉపదేశములు సంస్కృత సాహిత్యములోని అవినాభూతాంగాలు. కావ్యరత్నమైన కాదంబరిలో వానికి విశిష్ట స్థానమున్నది.



శుకనాసోపదేశము వీటన్నిటిలో మకుటాయమానము. ఇదియేకాక సుగంధ ద్రవ్యములను, పుష్పాలను వెదజల్లినట్లు ప్రతివర్ణనములోను సూటిగానో, గౌణముగానో సుభాషితములను అభియుక్తోక్తులను పొదిగినవాడు బాణుడు.



'ఉపదేశయుజే కావ్యం' అను ప్రశంస కాదంబరికి నూలుపోగు మాత్రమే.

వ్యాస వాల్మీకులలో వ్యాస ప్రోక్తమయిన భారతీకథయందే ఈ కవికి మక్కువ కాబట్టి వ్యాసుడు ప్రపంచించినకావ్య జగత్తును ఆదర్శముగా పెట్టుకొని ఉపదేశామృతమును ఒలికించుచు వీలైనంత పెద్ద రంగ స్థలమును నిర్మించుకొని అందు చేతనైనంతమంది పాత్రలను ప్రవేశపెట్టి, వారిని సమన్వయ పరచెను. ప్రేమైక మూర్తులయిన మనుష్యుల ప్రదర్శనము (Pageantry) చేయుట కూడ బాణుని ఉద్దేశ్యమై యుండును. రకరకాల పాత్రలను సృష్టించినందుకే 'బాణోచ్ఛిష్టం జగత్సర్వం' అను ఆభాణకము కలిగెనేమో ?



బాణుడు ప్రజాసామాన్యమును వర్ణించినట్లు ప్రాకృతేతర కవులెవ్వరును వర్ణించలేదు. రాజాంతఃపురములలోని జీవితమును చిత్రించిన కవులు ఎవ్వరును బాణుడు చిత్రించినట్లు సామాన్య ప్రజలను చిత్రించలేదు. 'వనేవా హర్మ్యేవా సమకరనిపాతో హిమకరః' (చంద్రుని వెన్నెల వనమునందును, రాజప్రాసాదమునందును సమానముగనే కాయుచున్నది) అను శంకర భగవత్పాదుల వాక్యము బాణుని సూచ్యుపమమైన ధిషణను వర్ణించుటకు తగినది.

బాణుడు చిత్రించిన స్త్రీ మూర్తులు కాళిదాసాదుల స్త్రీమూర్తుల కన్నను విశిష్టములు; ఉత్తమములు. వారు పురుషులకు కేవలము భోగసాధనములు కారు. వారి వర్ణనములు చదివినప్పుడు పాఠకులకు వారి ఎడల పవిత్ర భావము ఏర్పడును. బాణుడు ప్రతి స్త్రీ పాత్రకును అంగాంగ వర్ణనము చేయక వదలలేదు. కాని ఆ వర్ణనము పాఠకునికి చాపల్యమును కలిగించక ఆ స్త్రీ పాత్రయొక్క

వ్యక్తిత్వమును, ఔన్నత్యమును ఉద్బుద్ధము చేయును. కాళిదాసు పార్వతీ పరమేశ్వరులను 'జగతః పితరౌ' అని ఒకవైపు చెప్పుచునే వేరొకవైపు తన సమకాలికుడైన వాత్స్యాయనుడు నిర్వచించిన 'చౌశీతి' బంధములను వారి రతోత్సవమును వర్ణించెను. బాణుని ప్రేమ మర్యాదను అతిక్రమించనిది - ఉల్లోల కల్లోలమగు వారిధి చెలియలి కట్టను దాటనట్టు చంద్రాపీడుని మనసులో ఉద్వేలముగ నున్న ప్రేమ ప్రియురాలి సాన్నిధ్యమున ఎల్లలు దాటలేదు. చంద్రాపీడుడు స్వతంత్రుడు, గాఢముగ ప్రేమించినవాడు. కాదంబరి గంధర్వ కన్యక కనుక స్వేచ్ఛగా వివాహమాడుట తప్పుకాదు. అయినను అతడు ఆత్మగౌరవమునకు భంగకరమయినది కాని, కాదంబరి కించబడునట్టి పనిగాని చేయలేదు. చేసిన అందరు ఓర్చెడివారే. అతని సంయమము అటు వంటిది. అట్లే కాదంబరియును. ఆమె మానుషి కాదు, గాంధర్వి; అందునను రాజకుమారి. ఆమె ప్రేమోద్వేగమంతయు మనసులోనే కుతకుతలాడినది కాని అవంతయినను పైకి పొక్కలేదు. పత్రలేఖతో ఆమె పంపిన ప్రేమసందేశము సభ్యతకు, సహృదయతకు గీటురాయి. ఆ సందేశపు వక్కాణము అసదృశము.

బాణుడు పాఠకుల కిచ్చిన మరొక కానుక సామాన్య సభ్యత. అంతఃపుర సభ్యత, సామాన్య గృహస్థుల గృహ సభ్యత, తపోవనాశ్రమముల సభ్యత ఆటవికుల సభ్యత, గంధర్వలోక సభ్యత-ఇట్లు సభ్య ప్రపంచమునే బాణుడు మన ఎదుట అవతరింప జేయును

బాణుడు సనాతన ధర్మ పరాయణుడు. శ్రౌత స్మార్త సంప్రదాయానుయాయులైనవారి వంశమున జన్మించినవాడు. కాని అతని ఆశ్రయ దాత హర్షవర్ధనుడు బౌద్ధమతాభిమాని. బౌద్ధమత ప్రభావము కొంతకు కొంత బాణుని పైనను పడియుండును. హర్షుని ఆస్థాన విద్వాంసులలో నొకడగు మాతంగదివాకరుని సాహచర్యము కూడా బాణుని మనస్సును కొంత మార్చి యుండును. కనుకనే ఆనాటి సనాతనులవలె కాక కథావర్ణనములోను పాత్ర గ్రహణములోను, మూఢాచారముల గర్హణములోను కవి ముందంజ వేసెను. మనము ఈనాటి నిర్వచనముతో బాణభట్టును 'అభ్యుదయ వాది'గా చెప్పవచ్చును.

# కాదంబరి-పాత్ర చిత్రణము

కాదంబరిలోని పాత్రలను స్థూలముగా మూడు విధములుగా విభజింప వచ్చును; ఒకటి-'మానవ పాత్రలు'; రెండు - 'తిర్యగ్జంతు జాలము'; మూడు-'దేవయోనులు'. మానవ పాత్రలలో కూడా 'రాజ వంశమువారు', వారి 'ఆశ్రితులు', 'ఆటవికులు', దివ్యగంధర్వ యోని సంభూతులు కాదంబరీ మహా శ్వేతలు పుండరీకాదులు. సాక్షాత్తు లక్ష్మీదేవి ఇందొక పాత్ర. ఆమె మానస పుత్రుడే పుండరీకుడు. చంద్రుడు, రోహిణి చంద్రాపీడ పత్రలేఖపాత్రధారులు. ఈ విధముగా కవి. అతి మానుషమైన ఈ పాత్రధారుల వ్యూహములోనికి జరద్ద్రవిడ ధార్మికునివంటి పాత్రలను ప్రవేశింపజేసి సమకాలీన ధార్మిక జీవనపు తళుకు బెళుకులను పాఠకులకు ప్రదర్శించెను.

శుకము :- కాదంబరి కథాముఖములోనే ఈ శుకము ప్రవేశించును. శూద్రక మహారాజు ఆ స్థానములోనికి ఒక చండాల కన్యక ప్రవేశించి ఇది విహంగమ రత్నమని చెప్పి శుకము నొకదానిని ఉపాయనముగా రాజునకు సమర్పించెను. రాజుచేత ప్రచోదితమైన ఈ శుకము తన కథను కన్నులకు కట్టినట్లు వివరించెను.

ఈ శుకమే వైశంపాయన మంత్రి కుమారుడుగా జన్మించిన పుండరీకుడు. పుండరీకుని మనస్తత్వము, అచ్ఛోద సరోవరమును చేరుకొన్న తరువాత వైశంపాయనుని మనస్తత్వము, తన కథను పూర్వజన్మ వృత్తాంతమును తెలిసికొన్న శుకము భావావేశమును ఒకేరీతిగా కవి చిత్రించెను. ఇది కథా కథన శిల్పమునందలి విశిష్టత. ఏ బాలిశత్వము పుండరీకుని అవాంతర మృతికి, చంద్రుని శాపమునకు, తద్ద్వారా మొత్తము కథకు కారణమయ్యెనో, ఆ బాలిశత్వమే వైశంపాయనుడు శాపగ్రస్తుడగుటకు, చిలుక ఎగిరిపోయి చండాల కన్యక చేత బంధింపబడుటకు కారణమయ్యెను. ఈ విధముగా ఈ కథ పెరుగుటకు మూలము పుండరీకుని చంచల ప్రకృతియే. లక్ష్మీదేవి చాంచల్యము

శ్వేతకేతు మహర్షిలోని సంయమము కలిసి పుండరీకుని కష్టసుఖములకు కారణ భూతమయ్యెను.

పూర్వజన్మ సంస్కార వశమున వైశంపాయన శుకమునకు సకల శాస్త్ర జ్ఞానమబ్బెను. శూద్రకు డందువల్లనే శుకచరితమును వినగోరెను. ప్రతి ప్రాణికి సహజమైన జీవితేచ్ఛ ఆహార నిద్రా భయాదులు. వీనితోబాటు విదగ్ధ జనమువలె జరిగిన పొరబాటును గురించి విచారించుట, తండ్రి తన కొఱకు ప్రాణములొడ్డి ఎచ్చటికో పోయినప్పుడతనిని తాను గమింపలేకపోవుట మొద లగు సుకుమార భావములు శుక సహజములు గావు. అట్లే చండాల కన్యక పెట్టిన ఆహారము జుగుప్సాకరముగా శుకమునకు తోచుట, చండాలులు సమ ర్పించినను ఫలమూలాదులు తినుటతో తప్పు లేదనియు, జాతి వర్ణ వ్యవస్థ మను ష్యులకు మాత్రమే పరిమితమయినదని, జంతువులకు పక్షులకు దానితో సంబం ధము లేదను చండాలకన్యక వాదము సమకాలీన సాంఘిక వ్యవస్థను తెలుపును. చిలుక పలుకులతో ఈ కథ ప్రారంభమయినను కాదంబరీకథాకథనము మాత్రము చిలుక పలుకులు కాదు. జాబాలిమహర్షిప్రోక్తమీ కథ. చిలుక చేసిన వింధ్యాటవీ వర్ణనము, మృగయావర్ణనము, చిలుక ప్రాణాల నరచేతిలో పెట్టుకొని పడిన పాట్లు, జాబాలి తపోవర్ణనాదులు, చిలుకపలుకులు కావు. మహా శ్వేత కొఱకు పలవరించుటతో చిలుక పుండరీకుడుగా మారిపోయెను. అవాంతర జన్మ ఎత్తిన వైశంపాయనుని అస్తిత్వమే చివరకు అంతరించిపోయి శుక పుండ రీకులే మిగిలిపోవుదురు. చంద్రాపీడుని బహిఃప్రాణముగా మెలగిన వైశంపా యనుని పాత్ర నీటి బుడగవలె అదృశ్యమైపోవును.

చిలుక చండాల కన్యకచేత పంజరబద్ధమై 'నాహమస్యాఃతనయో న భ్రాతా నబంధుః' (నేనీమె బిడ్డను కాను. తోబుట్టువును, బంధువును కాను) అని అన్న మాటలు కథలోని నాటకీయ వ్యంగ్య వైభవమునకు తార్కాణము. వాస్తవముగా ఈ చిలుక లక్ష్మీదేవి కొడుకైన పుండరీకుని మారు రూపమే కదా !)

*పుండరీకుడు:-* పాశ్చాత్య సాహిత్యములో విషాదాంత కథలలో విషాద సంఘటనలకు మూల బీజమును Tragic Flaw అని అందురు. కాదంబరిలో పెక్కు జన్మలలోని సంఘటనలను సంధానము చేసి కవి కథను సుఖాంతము

చేసెనే కాని న్యాయముగా ఈ కథలో నాయికా నాయకులు విడిపోవుటకున్నన్ని అవకాశములు కలిసికొనుట కేర్పడలేదు. ఈ కథలోని tragic flaw పుండరీకుని బాలిశత్వమే. కథలో చంద్రాపీడుని కన్నను ఇతనికే ప్రాధాన్యము ఎక్కువ. కాని చంద్రాపీడుని వర్ణనమునే కవి కథలోని ప్రముఖ భాగములో నిర్వహించుట వలన, కథకు కాదంబరి అని పేరు పెట్టుట వలన, కాదంబరీ నాయకుడు చంద్రపీడుడగుట వలన, చంద్రాపీడుని రూపాంతరమయిన శూద్రకుని వర్ణముతో గ్రంథారంభమగుట వలన, చంద్రాపీడుడు రాజనందనుడగుటవలన, అతనిని నాయకునిగా భావించవలెను. మహాశ్వేత పుండరీకుని చూచినప్పు డతనిస్థితి నైష్ఠిక సుందరుడగు వటువు యొక్క తపః సమాధిలోనిది. అతనిని గూర్చి 'దీపికాలోక పింగలయా దేహ ప్రభయా కపిలీకృత కాననం కనకమయమివ తంప్రదేశం కుర్వాణం'[1] (అతని దేహవర్చస్సు దీపకాంతివలె పింగల వర్ణనమును కలిగియుండెను. ఆ తేజఃపుంజముచేత అడవి యంతయు వెలిగి బంగారు మయముగా కనిపించెను) అని, 'నిదాఘకాలమివ సాషాఢం' (ఎండకాలము వలె అతడు ఆషాఢ యుక్తుడయ్యెను. అనగా ఆషాఢ దండము పుండరీకుని వద్ద ఉండెననియు, ఎండకాలము చివర ఆషాఢ మాసము వచ్చును). అని వర్ణించెను.

కుమార సంభవములోని ఈ శ్లోకమును చూడుడు :

'అథాజినాషాఢ ధరః ప్రగల్భవాక్
జ్వలన్నివ బ్రహ్మమయేన తేజసా,
వివేశ కశ్చిజ్జ టిలః తపోవనం
శరీరబద్ధః ప్రథమాశ్రమోయథా'— కు. 5 స.

(పార్వతి తపోవనమునకు శివుడు కృష్ణాజినమును ధరించి, చేత ఆషాఢ దండమును పట్టుకొని చమత్కారోక్తులను పలుకుచు బ్రహ్మవర్చస్సుతో జ్వలించుచుండెనాయని అగుపించుచూ జటాధారియై మూర్తీభవించిన బ్రహ్మచర్యాశ్రమము వలె ప్రవేశించెను) ఆ శివుని వర్ణనము ఇచ్చట జ్ఞప్తికి వచ్చును.

---

1. కా. పుట. 300-301.

కామావిష్టులయి తపస్సంచయమును కోల్పోయిన రాజర్షులు చరిత్రలో లెక్కకు మిక్కిలి ఉన్నారు. విశ్వామిత్రుని కథ ఇందులకు అపూర్వమైన తార్కాణము. కామము జయించిన బ్రహ్మర్షిసత్తములు సకృత్తుగా వశిష్టుని వంటివారు కూడా ఉన్నారు. కామమును జయించినను క్రోధమును జయించ లేని శివుడు, విశ్వామిత్రుడు ఉండనే ఉన్నారు కాని కామాగ్నిలో శలభమువలె కాలిపోయిన పుండరీకుని వంటివారు లేరనే చెప్పవచ్చును.

'అలంకారమివ బ్రహ్మచర్యస్య' అని ఒక వైపునుండి అతని బ్రహ్మ చర్యాన్ని ప్రశంసించుచు, 'రతేరివ బాష్పజల బిందుభిః ఆరచితాం స్ఫటికాక్ష మాలికాం కరేణ కలయంతం'[1] అని చెప్పుచు అతనిలోని శృంగార బావో ద్రేకమును కవి సూచించెను. కపింజలు డెన్నిమాటలు చెప్పినను పుండరకుని హృదయములో చిల్లులు పడిన కుండలో నీరు నిలువనట్లు ఆ ఉపదేశవాక్యములు నిలువలేదు. చివరకు ప్రాణములొడ్డి అయినా మిత్రుని ప్రాణములు నిలుప వలె నన్న భావముతో చేసిన కపింజలుని ప్రయత్నము విఫమయ్యెను. పుండరీకుడు మహాశ్వేతకు వ్రాసిన ప్రేమలేఖ అభిజ్ఞాన శాకుంతలములోని శకుంతల లేఖకు ప్రతి రూపము. సకాలముతో మహాశ్వేత తన ప్రతి సందేశమును అందజేయలేకపోవుట వలననే పుండరీకుడు మరణించెను.

*శూద్రక మహారాజు :-* కాదంబరి కథాముఖము ఇతని వర్ణనముతో ఆరంభమను. శూద్రకుడు విదిశానగరమును ఏలిన వాడు. మహాకవి ప్రయత్న పూర్వకముగనే ఇతనిని వర్ణించునప్పుడు వినయము, రూపము. అన్వయము కల్గిన శుద్ధాంత కన్యకలున్నను మంత్రులు వంశోద్ధరణ కొరకై వివాహ మవసర మని వేడుకున్నను ఇతడు బ్రహ్మచర్యమునే అవలంబించెనని వర్ణించును. కావ్యారంభములో కవి చేసిన శూద్రకుని నఖశిఖ పర్యంత వర్ణనము అసదృశము, అత్యంత మనోహరము. కాదంబరి శైలికి వర్ణిక (Sample) ఈ శూద్రక వర్ణనములోనే పాఠకునికి లభించును. కథారంభములో శుకము చెప్పిన కథను ఉన్ముఖుడై వినుట కారంభించిన శూద్రకుడు కథాంతములో తానే చంద్రా

---

1. కా. పుట 2[illegible].

పీడుడని గ్రహించి కాదంబరిని పొందుటకు వెళ్ళిపోవును. ఈతని ఆస్థాన వైభవము, అతఃపురమునందలి స్నానాదికముల వర్ణనము, శయనించు, విశ్రమించు స్థలముల వర్ణనము, ప్రతీహార కంచుకి వర్గముల పరిచయము, బాణుని ఏలిక హర్షవర్ధన మహారాజు వైభవమునే మన కన్నులకు కట్టించును. ఒక దశలో శూద్రక చంద్రాపీడులు అదృశ్యులై వారి స్థానములో హర్షవర్ధను డుదయించును. చరిత్రాత్మకముగా ఒక మహాకవి కాల నిర్ణయాదులు జరిగినందువలన ఏర్పడు పరిణామమిది.

శూద్రకు డెవరై యుండునో అన్న మీమాంస సహజముగా పాఠకుల కుదయించును. మృచ్ఛకటిక ప్రకరణకర్త శూద్రకుడు. ఇంకను ఎడనెడ శూద్రక నామధేయము జానపద సంప్రదాయ ప్రభావమున్న సాహిత్యములలో కనిపించును. ఇదే పేరు బహుశః బాణునికి గూడా నచ్చి ఉండుటచే ఈ పేరుగల రాజుతో కథారంభమును చేసి ఉండవచ్చును. కాదంబరిపై జానపద సంప్రదాయముల ప్రభావమున కీపేరు కూడా పుష్టిని గలిగించి ఉండవచ్చును.

*చండాల కన్యక :–* మెఱుపు మెరిసినట్లు కన్నుల ఎదుట సాక్షాత్కరించి అదృశ్యమై పోవు పాత్ర ఈ చండాల కన్యక. శూద్రకుని ఆస్థానములోనికి పక్కణ (సవరుల పల్లె) స్వామి దుహితగా ఒక స్వర్ణమయ పంజరములో సకల శాస్త్రములను ఎఱింగిన వైశంపాయన శుకమును పెట్టుకొని వచ్చి ''సకల రత్నానాముదధిరివ దేవః భాజనమితి కృత్వా'' (సకల రత్నములకు సముద్రుడు భాజనమైనట్లు శూద్రక మహారాజు కూడా ఈ ఉత్తమ శుకమును పొందుట కర్హుడు) అని చెప్పి చిలుకను మహారాజునకు ఉపాయనముగా సమర్పించెను. చండాల కన్యక అందచందాలను లోకములో నల్లని వారికందరికిని గర్వము కలుగనట్లు కవి వర్ణించెను. కవి తలచుకున్నప్పుడు దేనినైనా అతిలోక సుందరముగా మలచగలుగుననుటకు ఈ వర్ణనము ఉదాహరణము. శూద్రకునితో పాటు అదృశ్యమయిన ఈ చండాల కన్యక కూడా కథాంతములోనే తిరిగి సాక్షాత్కరించి, సాక్షాత్తు లక్ష్మీ దేవినని స్వరూపము నావిష్కరించుకొని పాఠకుల నాశ్చర్య చకితుల జేయును. తన కుమారుడు ఇప్పటికే స్వచాపల్యమువల్ల క్షుద్ర పక్షిజాతిలో పడిపోయెనని అతడు క్రిమి కీటకాదుల యోనిలో పుట్ట

కుండ అతనిని బంధించుటకీ చండాల రూపమును ధరించి 'అధరీ కృత సర్వ స్నేహేన అసాధారణేన అపత్య ప్రేమ్ణా' (అసాధారణమగు పుత్ర ప్రేమ ముందు తక్కిన బంధములన్నియును తీసికట్టే) అను వాక్యమును నిరూపించుచు శుక శావకమును రక్షించి శ్వేతకేతువు తలపెట్టిన క్రతు పర్యవసాన సమయమునకు శూద్రకుని వద్దకు చేర్చును. మహాకవి కాళిదాసు పార్వతి పాత్రను కుమార సంభములో సృష్టించి, శివ పార్వతుల అసదృశ ప్రణయగాథను చిత్రించి,పార్వతికి మానవత్వమును కల్పించును. బాణ మహాకవి ప్రసిద్ధముకాని లక్ష్మి శ్వేతకేతువుల ప్రణయమును సృష్టించిలక్ష్మీదేవి పాత్రను అంతటితో ముగించక ఆమె మనుష్య సామాన్యులవలె తన బిడ్డ కోసము పరితపించుటను చూపించి, మానవత్వము దైవత్వముతో జోడించెను. మహాకవులందరును దైవగణములో మానవత్వమును చూచినవారే. వారు తలచుకున్నచో వారి చేతిలో మనుష్య పాత్రలు సీతారాములవంటి ఆదర్శ మానవులు దేవతలు కాగా, పార్వతి లక్ష్మి సరస్వతి వంటివారు మానవులై పోయినారు.

చంద్రాపీడుడు:- పుండరీకుని వలన శప్తుడై మానవుడుగా జన్మించిన లోకసాక్షియగు చంద్రుడే చంద్రాపీడుడు. ఇతడు తల్లి గర్భమునందు ప్రవేశించినపుడు పరిపూర్ణ మండలమునుండి చంద్రుడు విలాసవతి నోటిలోనికి ప్రవేశించినట్లు రాజునకు స్వప్నము వచ్చెను. ఇది అతని చంద్రాంశను నిరూపించుటకే.

ఈ స్వప్నము బౌద్ధ కథలలోని మాయాదేవి స్వప్నమును పోలియున్నది బుద్ధదేవుడు తల్లి గర్భమునందు ప్రవేశించినప్పుడు ఒక తెల్లని ఏనుగు ప్రవేశించినట్లు ఆమెకు కల వచ్చెనని భారతదేశమునందు ఎల్లెడల విస్తరించి యున్న శిల్పము లెన్నో తెలుపుచున్నవి.

రాజకుమారునకు భావి చక్రవర్తికి ఉండవలసిన లక్షణములన్నియును చంద్రాపీడ శిశువునందు ఉన్నవని శుకనాసుడు సద్యోజాత శిశువును నిరూపించి ఆనందాతి రేకముతో చెప్పెను.

తారాపీడు డితనికి నామకరణము చేయుచూ 'మాతురస్య మయా పరిపూర్ణమండలశ్చంద్రః సప్నే ముఖకమల మావిశన్ దృష్టః ఇతి స్వప్నాను

రూపమేవ రాజా స్వసూనోః చంద్రాపీడ ఇతి నామచకార' అని చంద్రాపీడు డను అతని నామకరణమును సమరించెను.

చంద్రాపీడుడు గురుకులము నందభ్యసించిన విద్యలు విజ్ఞాన సర్వస్వ మును తలపించును. ఒక వ్యక్తి ఇన్ని విద్యలయందు నిష్ణాతుడగుట అసహజము కదా యని అనిపించినను ఈ విషయము రాజకుమారునకు ఎన్నో విషయము లందు ప్రవేశముండుట అనివార్యమని తెలుపుచున్నది.

మౌలికముగా ప్రతి విద్యార్థి అభ్యసించవలసిన పదవాక్య ప్రమాణాదులు, రాజు నేర్వవలసిన ధర్మ శాస్త్రము, రాజనీతి, సైనికుడు తర్ఫీదు పొందవలసిన వ్యాయామ విద్య, చాప, చక్ర, చర్మ, కృపాణ, శక్తి, తోమర, పరశు, గదాది ఆయుధ ప్రయోగము, యుద్ధాంగములైన రథ చర్యలు, గజ పృష్ఠములు, విరామ సమయమునందు వినోదము కొరకు వీణా, వేణు, మురజ, కాంస్య, తాల, దర్దుర, పుటాది వాద్యములు, భరత నాట్య శాస్త్రము, నారదీయ, గాంధర్వ విద్యలందు పరిచయము, యుద్ధ రంగమునందు ఉపయోగపడు హస్తి శిక్ష, తురంగ వయోజ్ఞానము, ఉత్తమ నాగరకుడుగా జీవించుట కుపయోగించు పురుష లక్షణములు (అంగ విద్య), చిత్రకర్మ, పత్రచ్ఛేద్యము (పూలదండ లల్లుట), గేదంగి రేకుల నమర్చుట, పుస్తకర్మ (పత్తితో బొమ్మలు చేయుట) లేఖక కర్మ, సచేతన అచేతన సాధనములతో ఆడు జూదము, శకున జ్ఞానము, జ్యోతిష ములో రాజునకు ఇంతో అంతో ఉండవలసిన జ్ఞానము; ఇవి కాక రత్న పరీక్ష, దారు కర్మ (చెక్క పని), దంతపు పని, వాస్తు విద్య, ఆయుర్వేద, యంత్ర ప్రయో గము, విషమును లాగివేయుట, సురంగములను భేదించుట వంటి నిత్యోప యోగకరమగు విద్యలలో కూడా ప్రవేశము; ఈత, ఎగురట, దుముకుట వంటి శరీర వ్యాయామములందు, ఇంద్రజాలము కథలు, నాటకములు, ఆఖ్యాయి కలు, కావ్యపురాణేతిహాసములందును, అనేక లిపులలో, అన్ని దేశ భాషలలో, అన్ని సంజ్ఞలలో, శిల్పములలో, ఛందస్సులలో రాజుకు ప్రవేశముండవలెను.

ఈ పట్టిక రాజు ప్రతి దినము సభను తీర్చినపుడు వినవలసివచ్చు అభి యోగముల వైవిధ్యమును తెలియజేయుచు రాజునకు ఎన్ని విద్యలలో ప్రవేశ

౩)

మున్న అన్ని సమస్యల నతడు ఇతరుల సహాయము నపేక్షించక స్వయముగా పరిశీలించి, లేక వాని గుణాగుణములను పరిశీలించి ధర్మముగా తీర్పు నివ్వ గలడు.

ఈ జ్ఞానముతోబాటు లోకజ్ఞానము కూడా అతనికున్నచో అనుచరులు, పరివారము మోసగించకుండగా తనను తాను కాపాడుకొని రాజ్యమునకు క్షేమము నొనగూర్చును.

వీనితో బాటు చంద్రాపీడునకున్న శరీరబలమును కవి వర్ణించినప్పుడు ఇతడు సింహబలుని ప్రతిరూపమాయని విస్మయము కలుగును. ఒకే కత్తి వేటుతో అతడు తాటిచెట్లను తామర తూడులను నరికి వేసినట్లు నరికివేయు వాడట. ఏనుగు గున్నల నతడు చెవి పట్టుకొని ఆపినప్పుడు అవి కదలలేక సతమతమయిపోవునట. పదిమంది కలిసి ఎత్తగలిగిన అయోదండము (ఇనుప గుదియ)తో అతడు బస్కీలు తీసేవాడట.

ఈ గుణముతో బాటు అతనిలోని ఆత్మగుణముల వికాసము అపరంజికి తావి అబ్బినట్లుండెను. ఈతడు వైశంపాయనుని ఎడల పెంచుకొన్న స్నేహవృక్షము అరటిబోదెవలె నిగనిగలాడుచు పెరిగెను. అందుకే వైశం పాయనున కాపద వాటిల్లినదని తెలియగనే ఇతడు నేలగూలెను. చరిత్రలో కథ లలో ఏలికకొరకు ప్రాణములు వదలువారు, ఏలిక మృతి వర్తమాన మందగానే నేలకూలువారు తారసిల్లుదురుగాని, ఒక స్నేహితుని కొరకు రాజు తన ప్రాణ ములు తృణమువలె పరిత్యజించుట వేరెక్కడను కానరాదు. చంద్రాపీడునిలో అహంకార మేమాత్రము పెరిగినను ఈ విధముగా నతడు మృత్యువు వాత పడెడువాడు కాడు స్నేహధర్మ మతనికి కాదంబరి ప్రణయముకన్న మిన్న. ఒక విధముగా కాదంబరి కథ స్నేహస్మృతి యేమో! ఇది ''స్నేహస్మృతి''గా కలకాలము నిలిచిపోవును. ఇతనిలో అహంకారము పెరగకుండుట కతనికి శుకనాసుడు యౌవరాజ్యాభిషేకములో చేసిన ఉపదేశము చాలా ఉపకరించి యుండవచ్చును కాలిన ఇనుముపై సమ్మెట పోటు పడినట్లు, గురుకులము నుండి అప్పుడే తిరిగివచ్చి గురువుల మీద పరిపూర్ణ ఆదర భావమును కలిగి ఇంకను రాజ్యభోగ భాగ్యముల రుచి గొంతుకిందికి దిగక ముందే శుకనాసు

దతనిలో అహంకారము పెరగకుండా త్రుంచివేయును. మంచి గురువు లభించుట కూడా ఒక భాగ్య విశేషము. అట్టి భాగ్యశాలి చంద్రాపీడుడు. శుకనాసునిలో తండ్రిని, గురువును, మంత్రిని దర్శించిన వాడితడు. విద్యాభ్యాసము ముగిసిన తర్వాత శుకనాసుని దర్శింపబోయిన చంద్రాపీడుడు భూమి మీద కూర్చుండెనట. అతనికి శుకనాసుని ఎడలగల ఆదరభావము నీ ఒక్క విషయమే నిరూపించును.

యౌవనము ప్రవేశించిన చంద్రాపీడుని తారాపీడుడు గ్రుచ్చి కౌగిలించుకొని (సీవ్యన్నివ) ప్రత్యుత్థానముచేసి కూర్చుండుమని ఆదేశించగా, చేరువనున్న తాంబూల కరంక వాహిని ఉత్తరీయమును చుట్టజుట్టి ఆసనముగా చేసి అతనికి సమర్పించగా, దానిని మృదువుగా కాలితో నెట్టివేసి అతడు భూమిమీదనే కూర్చుండెనట. ఇట్లనేక సందర్భములలో చంద్రాపీడుడు మాన్యుల సమక్షంలో క్షితితలం మీదనే గూర్చుండెననిచెప్పిన కవి అతనికాలీనతనుతెలుపును. భూమిపైన అతడు కూర్చుండబోగానివారించి బలవంతముగా మాతృప్రేమతో ద్విగుణితమైన తనఉత్సంగంలో అతని తల్లి అతనిని కూర్చుండ బెట్టుకొనెను. బాల్యోచితములైన క్రీడలనుత్యజించి గురుకుల క్లేశమును ఎట్లు సహించితివని, నీకు గురువునందు భక్తి ఎంత గొప్పది అని తల్లి అతనిని స్వయముగా అభినందించెను. శుకనాసుడతనిని అభినందించుచు "నేడు తారాపీడునకు ప్రపంచమునంతటిని జయించినంత తృప్తి కలిగినది. నిన్ను రాజునుగా పొందిన ప్రజలు భూమి ధన్యులు. నీ వయస్సెక్కడ ? నీవు నేర్చిన విద్యలు పొందిన శక్తి ఎక్కడ ? మహావరాహము దంష్ట్రావలయమున భూభారమును వహించినట్లు నీవు భుజవలయముతో వహించుము" అని అభినందించెను. ఈ విధముగా కవి పరోక్షముగా చంద్రాపీడుని గొప్పదనమును వర్ణించును. చంద్రాపీడుని యౌవరాజ్యాభిషేకము ముగిసిన పిదప అతని దిగ్విజయ ప్రస్థానము అతని పరాక్రమ విశేషముచే (భంగ్యంతరమున ఏలిక హర్షవర్ధనుని పరాక్రమముచే) పాఠకుల హృదయమును స్పృశింపజేయును. ఇతని దిగ్విజయ యాత్ర కాళిదాసు వర్ణించిన రఘు దిగ్విజయయాత్ర అంత వివరముగా, ఓజోవంతము గాలేదు. ఇక్కడ చంద్రాపీడుడు జయించిన రాజ్యము, రాజు మొదలగు వివరములను కవి మనకు చెప్పక తన ధోరణిలో అతని గొప్పదనమునే చాటును.

ఇచ్చట దిగ్విజయముకన్న కిన్నర మిథునములను వెంబడించి అచ్ఛోద సరోవరమును సమీపించి, వీణానాదమును విని సిద్ధాయతనమును చేరుకొని మహాశ్వేతను దర్శించి, ఆమె వృత్తాంతమును విని హేమ కూటమును చేరు కొనుటయే చంద్రాపీడ కథలోని ప్రధాన ఘట్టము, దానియందే కవిదృష్టి కేంద్రీకృతమై యున్నది.

కిన్నర మిథునమును వెంబడించి తన ప్రయత్నము నిష్ఫలము కాగా చంద్రాపీడు డాత్మ విశ్లేషణము చేసికొనిన తీరతని వివేక బుద్ధికి నిదర్శనము. తానెంత మూర్ఖబుద్ధి ననియూ, ఈ కిన్నరమిథునము దొరికితే ఎంత, దొరకక పోయిన ఎంత, అనియు తాను చేయవలసిన పనిని వదలివేసి ఇట్టి బాలిశ కర్మ చేయుట నిరర్థకమని అతడు వాపోయెను.

అతడు ఆదరణీయమగు మహాశ్వేతను దర్శించినప్పుడెంత శాలీనతను, కులీనతను, సంయమమును ప్రదర్శించెనో అంతటి గుండె నిబ్బరమునే తనకు ప్రియాతి ప్రియమయిన కాదంబరిని దర్శించినప్పుడు కూడా ప్రదర్శించెను. ఇదే శుకనాసుడతనికి వెన్నతో పెట్టిన విద్య. కాదంబరి నతడు సామాన్య స్త్రీగా, ప్రియురాలిగా చూడక ఒక దేవీ మూర్తిని చూచినట్లు చూచెనేమో! ఇతడు కాదం బరీ ప్రస్తావముచేసినప్పుడు, ఆమె సమక్షమునందున్నప్పుడు ఆమె సమర్పించిన గౌరవతాంబూలమును, ఉపాయనములను, శేషహారములను పంపిన సందేశ మును గ్రహించినప్పుడు, ఆమె ప్రశంస వచ్చినపుడు ఇదే భావము పాఠకులకు భాసించును. చంద్రాపీడునకు కాదంబరి యందుగల భావము గ్రామ్యరతి కాదు. అది అగ్రామ్యమయిన శృంగార రసావేశము ; రెండు ఆత్మలు అద్వైతస్థితి ననుభవించినప్పుడు వెలికివచ్చు ప్రేమోద్గారము. ఒక్క చోటకూడా చంద్రా పీడుని మాటలలో హావ భావములలో వెకిలితనము కనిపించదు.

చంద్రాపీడమహాశ్వేతల మైత్రికూడా అలోక సామాన్యము. ఆమె దర్శనమునే అతడు అఘమర్షణముగా భావించెను. మహాశ్వేత అతనిని ఆశ్రమ మునకు గొనిపోయి అతిథిసత్కారము చేయునప్పుడు, అతి వినయముతో శిష్యుని వలె ఆమె ననుసరించెను.

అట్లనుసరించి ఆమెను గురించిన వివరములు తెలిసికొనగోరి "ఉపజన-యతి హి ప్రభుప్రసాదలవోఽపి ప్రాగల్భ్యమధీరప్రకృతేః" అని ప్రతిజ్ఞా పూర్వకముగా పలికి మానుషతాసులభమగు ప్రశ్నకర్మలో నియుక్తుడగును. ఈ ప్రశ్న కర్మయే కాదంబరీ వృత్తాంతశ్రవణమునకు, పుండరీకుని కథకు దారితీయును, చంద్రాపీడుని జిజ్ఞాసయే కథలో అణగి ఉన్న పొరలు విప్పు కొనుటకు, పుండరీక కపింజలుల వంటి పాత్రలను సాక్షాత్కరింప జేయుటకు ప్రోద్బలకమగును. కాదంబరీ పాత్ర ప్రవేశమునకే ఈ ప్రశ్న కర్మ నాందీ వాక్యము.

మహాశ్వేతా వృత్తాంతమును విన్న చంద్రాపీడుని స్నేహనిష్పత్తి చాలా యోగ్యముగా నున్నది. అతని దృష్టిలో అకృతజ్ఞుడు, క్లేశమునకు భయపడు వాడు, సుఖసంగి, స్నేహసదృశమైన కర్మను చేయలేనివాడు, నిష్ఫలమైన అశ్రుపాతములో మాత్రము స్నేహము(ప్రేమ)ను చూపించుచు ఎలుగెత్తి ఏడ్చును. ప్రేమోచిత కర్మలను అనుష్ఠించు మహాశ్వేతారోదనము అతనికి నిష్ఫలముగా తోచును. తన ప్రేమను నిలుపుకొనుటకు చిన్ననాటినుండి పెంచి పెద్ద జేసిన తల్లిదండ్రులను వదులుకొని, విషయోపభోగ విముఖఅయి ఐశ్వర్యము నాశించక, సుకుమారమగు తనువును మరింత కృశింపజేసి, బ్రహ్మచర్యమును చరించుచు, తపస్సుజేయుచు వనితా జనమునకు దుష్కరమగు అరణ్యవాసము నంగీకరించిన మహాశ్వేత నిస్సహాయుల వలె, బాలిశుల వలె ఏడ్చుట తగదని ఆమెను చంద్రాపీడుడు ఊరడించును. మహాశ్వేత మనస్సులో ఏదో ఒక మూలలో అనుమరణమును పొందక పోయితినే అన్న విచారమును గూడా చంద్రాపీడుడు తుడిచి పెట్టి, అనుమరణము నష్ఫలమని, "బ్రతికి యుండిన సుఖముల బడయవచ్చునని" "ఏతి జీవంతమానందో నరం వర్షశతాదపి" అని ఆమెకు బోధించి ఇక్కడ అనుమరణమను సాంఘికాచారమునకు వ్యతిరేక ముగా, గట్టిగా వాదించును.

మహాశ్వేత నూరడించుచు చంద్రాపీడుడు పలికినమాట ఇది "కథమప్యే కస్మిన్ జన్మని సమాగమః, జన్మాంతర సహస్రాణి చ విరహః ప్రాణినామ్" (స్నిగ్ధ జనమునకు, ఎట్లో ఒక జన్మలో సమాగమము, జన్మాంతరములలో విర హము తప్పదు కదా)! ఇదేమాటను విలాసవతి ఈ విధముగా అనును;

'జానామి వరం దీర్ఘకాలమపి దుఃఖాన్యను భవంతీ, సకృదపి వత్సస్య దర్శనాయ జీవితాస్మి నపునరసహ్యాదుఃఖోపశాంతయే సంప్రత్యేవ మృతాస్మీతి.' ఇది కాదంబరీ కథకు మూల సూత్రము. బాణుడు ఈ వాక్యము పైననే 'కాదంబరీ' కథా సౌధమును నిర్మించి అందు ప్రేమికుల జంటలను, మిత్రుల జంటలను నిలిపె ననవచ్చును.

చంద్రాపీడునికి మహాశ్వేత యందేర్పడిన ఆదర భావమే అతని చేత కాదంబరీ వృత్తాంతమును వినిపించి హేమ కూటమున కామెవెనుక సచ్ఛిష్యుని వలె నడిపింప జేయును. అతడు మహాశ్వేతతో ''భగవతి, దర్శనాత్ ప్రభృతి పరవానయం జనః కర్తవ్యేషు యథేష్టమశంకితతయా నియుజ్యతామ్'' అని అనెను.

కాదంబరిని దర్శించిన చంద్రాపీడుని భావావేశము అతని ధీరోదాత్తతకు నిదర్శనము. అతడు ''ఒడలంతయు కన్నులైతే, నేను కాదంబరిని తనివి దీర చూచి యుందునేమో!'' యనుకొనును.

చంద్రాపీడుని కాదంబరికి పరిచయము చేయుచు మహాశ్వేత సాభిప్రాయముగా కొత్తవాడని సిగ్గుపడక, అపరిచితుడని భావించి రహస్యగోపనము చేయక, అవిజ్ఞాతకులశీలుడని భావించి శంకింపక, తన యందు గల ఆదర పూర్వకమగు మైత్రీ భావమునే చంద్రాపీడుని యందు కూడా కాదంబరి వహించవలెనని చెప్పును. పైగా అతనిని మిత్రము, పరిజనము, బంధువుగా భావించవలెనని కూడా తెల్పును. బహుశ కాదంబరి గంధర్వ కన్యక, అప్సరస కావున మానవ మాత్రునిగా భావించిన చంద్రాపీడుని పరిజనముగా భావించుట, కథా మర్యాదకు పాత్ర పోషణ యొక్క ఔచిత్యమును నిలుపుటకు పనికి వచ్చునేమో! అందులకే చంద్రాపీడుడు కాదంబరిని సామాన్య ప్రణయినిని వలెగాక దేవిగా ఆరాధించెను. ఆమె అతనికి మాన్య ప్రేయసి.

కాదంబరీ పరిజనములోని మదలేఖ ఆమెకు అత్యంత సన్నిహిత. ఆమె ద్వారా ఒక అమూల్య రత్నహారమును కాదంబరి చంద్రాపీడునకు బహుమానముగా పంపును. మదలేఖ చంద్రాపీడుని గుణములను ప్రశంసించుచు అతనిలోని

పేశలత (మార్దవము) అహంకారమునకు తావులేకుండా చేసినదనియు, ప్రశ్రయము (వినయ గుణమే) తన వంటి వారు మాట్లాడుట కవకాశమిచ్చినదనియు, మృదు మధురమైన ఆకృతియే అందరికినీ అతడు అకారణబంధువగుటకు కారణమయినదనియు, వాఙ్మాధుర్యమే అందరి మైత్రిని సంపాదించినదనియు, అందువలన చూచిన వారినందరిని లోబరుచుకొను అతని మూర్తియే, ఉపాలంభ యోగ్య (సాక్షాత్కార యోగ్య) మని చెప్పి స్తుతించును. ఒకవేళ చంద్రాపీడుడు ఇతర రాజకుమారులవలె ఉండినట్లయితే అటువంటి మహామహిమునితో మాట్లాడ గల్గుటయే అతనిని తక్కువగా చూచుట; ఆదరించుటయే ఆత్మ శ్లాఘ; స్తుతించుటయే వెకిలితనమును తెలుపుకొనుట; ఉపచరించుటయే చాపల్యమును ప్రకటించుట; ప్రీతియే తమ స్థానమును అర్హతను గ్రహింపకుండుట; విజ్ఞాపన చేయుటయే వదరుబోతు తనము;సేవ చేయుట స్వచాపల్యమును చూపుట;దానము చేయుట పరిభవించుట అగును,'' అని మదలేఖ చెప్పి భంగ్యంతరముగా కాదంబరీహృదయమునే ఆవిష్కరించును.

కాదంబరీచంద్రాపీడులు విస్రంభాలాపములు చేయునప్పుడు ఒకరికొరకు వేరొకరు భూమిమీద గూర్చుండెడి వారు. ప్రీతిపూర్వకముగా తన వద్దకు క్షేమము నరయుటకు వచ్చిన కాదంబరికి తన శరీరమును, ఆత్మను, వైభవమును యావత్తు సమర్పించి ఇందులో ఏది అక్కరకు వచ్చిన దానిని ఉపయోగించు కొని గౌరవింపుమని ప్రేమ అను దేహలి యందు సర్వస్వమును సమర్పించిన అమరప్రేమికుడు చంద్రాపీడుడు.

కాదంబరి వద్ద సెలవు తీసుకొనువేళ చంద్రాపీడునకు హృద్గత భావమును వెలిబుచ్చుటకు మాటలు మిగుల లేదు. అతడు, ''దేవి, కిం బ్రవీమి బహు భాషిణే న శ్రద్దధాతి లోకః, స్మర్తవ్యోఽస్మి పరిజన కథాసు''* అని చెప్పను. ఈమాట లలో వినయము దాని వెనుక ప్రేమనిర్భరత గోచరించును

కేయూరకుడు అచ్ఛోద సరస్తీరమునందు విడిసియున్న చంద్రాపీడుని వద్దకు కాదంబర్యాదుల సందేశమును గొనివచ్చి మహాశ్వేత మాటలుగా ఇట్లు చెప్పును :

---

* (దేవీ! నే నేమి చెప్పగలను? నే నెక్కువగా మాటలాడితే లోకులు నన్ను వదురుబోతు క్రింద జమకట్టి నా మాటలు నమ్మరు. మరి నా హృదయ మును నే నెట్లు ఆవిష్కరింతును? నీ పరిజనమును గురించి చర్చ వచ్చినప్పుడు నన్ను స్మరించుము అంతే చాలును.)

"తథానామ సమక్షం భవత: తుహినశీతలాశ్చంద్రమయా ఇవ గుణా విరహే వివస్మన్మయా ఇవకృతాః" (నీ సమక్షములో చంద్రుని కిరణములవలె చల్లగా నున్న నీ గుణములు, నీ విరహములో చండభానుని కిరణములవలె తాపమును కల్గించుచున్నవి - ("విధురపి సవితరతి-") అతడు లేని గంధర్వ నగరము ఉత్సవము జరిగిన తర్వాత వివిక్తమైన ప్రదేశము వలె ఉన్నదని (నాగవల్లినాటి వివాహ వేదికతో సాధారణముగా ఉపమానము) చెప్పి, చంద్రాపీడుని సౌభాగ్యము మహాశ్వేత వంటి ప్రేమోపాసికకు అకారణముగా స్నేహ భావముమ ఉత్కంఠను కల్గించెనని తెలుపును.

కాదంబరిని తిరిగి కలిసికొనవచ్చిన చంద్రాపీడునకు తండ్రినుండి ఉజ్జయినికి తిరిగి పిలిపించుచు శ్రీ ముఖమురాగా చంద్రాపీడుని స్థితి ద్విధా విభక్తమైన మనస్సుగల దుష్యంతుని స్థితివలె మారును. కాని దుష్యంతునివలె తాను నిలిచిపోయి తనమిత్రుని పంపించక, తానే కాదంబరి యందు తగుల్కొన్న హృదయము నెట్లో విడదీసికొని స్కంధావారమును వైశంపాయనుని కొప్పగించి ఉజ్జయినికి బయలుదేరెను.

ఇక్కడ చంద్రాపీడుని మాటలు గమనింపదగినవి.

"గరీయసీ గురోరనుజ్ఞా ప్రభవతి దేహమాత్రకస్య - హృదయేన హేమకూట నివాసవ్యసనినా లిఖితం జన్మాంతరసహస్రస్య దాస్యపత్రం దేవ్యాః"- (నాశరీరమే ఉజ్జయినిని చేరును. హృదయము హేమకూటమునందు నివసింపగోరుచు జన్మాంతర సహస్ర దాస్య పత్రమును వ్రాసి దేవికి సమర్పించినది)- జీవించి యుండి తిరిగి హేమకూటమును దర్శింపకుండుట కల్ల అని చెప్పి చంద్రాపీడుడుజ్జయినికి బయలుదేరును.

పత్రలేఖవలన కాదంబరి అనుభవించుచున్న బాధను గురించి విన్న చంద్రాపీడుడు "మన్యేచ మమాపి మనోవ్యామోహకారీ కోఽపి శాప ఏవాయమ్ అన్యథాఽ ప్రబుద్ధిబుద్ధేరపి యేషు న సందేహ ఉపపద్యతే తేష్వపి స్ఫుటేషు మదనచిహ్నేషు కథం మే ధీర్వ్యాముహ్యేత" ఇక్కడ చంద్రాపీడుని స్థితిని చాలా విచిత్రముగా కవి వర్ణించెను. కాదంబరి హావభావ విలాసములన్నియు స్పష్టముగా ఆమె మనస్సున కద్దము పట్టినను, దివ్యకన్యకల నంతకు పూర్వము చూడనందున అవి ఆమె సహజ విలాసములేమోయని భ్రమించి అంత గొప్ప కోరికలను తనవంటి అల్పుడు పెంచుకొనుట తగదని ఎంచి ఎన్నియో వికల్పముల చేత

సంశయదోలాధిరూఢుడై కాదంబరి దుఃఖమునకు తాను కారణభూతుడ నైతినని చెప్పి తనకు గూడా ఏదో శని పట్టి యుండవచ్చుననియు, మనస్సునకు వ్యామోహము కల్గించు శాపము (దుష్యంతు డనుభవించిన శాపము వంటిది) ఏదో తనను గూడా (మహాశ్వేతా పుండరీకులనుగూడా) పీడించుచున్నదనియు, లేనిచో సామాన్యులకు గూడా స్పష్టముగా తెలిసివచ్చు కాదంబరి మదన చిహ్నములను తన మనస్సెందులకు ఇంకను గుర్తింప నేరకున్నదనియు. పరిపరి విధముల చంద్రాపీడుడు తన వ్యామోహమును నిందించును. 'మనో వ్యామోహకారి' అను విశేషణము శాకుంతలమునందలి దుర్వాస శాపమును దృష్టియందుంచుకొని ఉపయోగించిన పదమే. శాకుంతల కర్త కావ్య శిల్పము నం దందెవేసినచేయి కనుక తనకేదో శాపము వచ్చినదని దుష్యంతుని చేత పలికించడు. చంద్రాపీడుడుగూడా శాపగ్రస్తుడే. జన్మాంతరమునందే తప్ప ఇతనికి వ్యామోహము తీరదను విషయము నిచ్చట కవి సూచించెను.

కాదంబరి సమక్షమునందున్నంతసేపు చంద్రాపీడుని హృదయ మామె యందవ్యక్తాదర భావముతో నిండిపోయి తనను ఆమె పరిజనముగా భావింప జేయును. తనయందు నిబిడితమైన ప్రేమను స్పష్టముగా వ్యక్తము చేయలేక, ఆమె వ్యక్తము చేసినచో దానిని పూర్తిగా నిదమిత్థమని గ్రహించనేరక, పత్ర లేఖవలన ఆమె స్థితిగతులను తెలిసికొని యథార్థమును గ్రహించుట శాప పరిణామము నందొక దశ.

యథా గజోనే తి సమక్షరూపే తస్మిన్నతిక్రామతి సంశయస్స్యాత్,
పదాని దృష్ట్వా తు భవేత్ప్రతీతిః తథావిధో మే మనసో వికారః''-

అను శాకుంతల శ్లోక మిచ్చట జ్ఞప్తికి వచ్చును.

వైశంపాయనుని గవేషణమునందు బయలుదేరిన చంద్రాపీడుడు కాదంబరిని గురించి కనిన కల పగటికలగా మారును. తలపోసిన స్వర్గసుఖమును పొందుటకు జన్మాంతరము ముగియువరకు వేచి యుండవలెను. కాదంబరీ కళ్యాణముతో కథ ముగియును. కాన కథామధ్యములో కాదంబరిని చేరబోవు చంద్రాపీడుని ఉత్కంఠ పాఠకులలో కూడా ఉత్కంఠనే రేకెత్తించును. చిరకాల నిరీక్షణమనే అగ్నిని ప్రవేశించి బయటపడకముందు కాదంబరి అనే సువర్ణశలాకయొక్క మేలిమి నిరూపితము కాదు. ఇదే అగ్ని

పరీక్ష మహాశ్వేతకును జరుగుచునే ఉండగా, చంద్రాపీడుడు తాను తలవని తలంపుగ మహాశ్వేతను కలిసికొన్నప్పుడామె అనుభవించు ఆశ్చర్యమును, తన హేమకూట యాత్రను, కాదంబరితో గంధర్వ వివాహ మంగళమును ఆమెతో గడుపు వివాహజీవితమును తలచుకొని ఉవ్విళ్ళూరుచుండెను. ప్రేమోన్మాది అయిన చంద్రాపీడుడీ సందర్భములో సాక్షాత్కరించును. 'మనోరథా నామ తటప్రపాతాః', (కోరికలు గట్లుదాటి ప్రవహించు వరదలు కదా !)

మహాశ్వేత వలన వైశంపాయనుని శాప వృత్తాంతమును విన్న చంద్రాపీడుని హృదయము పగిలిపోవును. అట్టి దశలో ఆసన్న మృత్యువయిన చంద్రాపీడుని భ్రష్టవచన సౌష్ఠవమగు చిట్టచివరి వాగ్విన్యాసము అతని సంయమమునకు పరాకాష్ఠ. ఇతడు జన్మాంతరమునందైననూ తనకు. కాదంబరీ సమాగమును కల్పింపుమని దైవమును ప్రార్థించి మొదలు నరికిన చెట్టువలె నేలకూలెను. వికసించుటకు సిద్ధముగానున్న మొగ్గ అకాండముగా రాలినట్లు చంద్రాపీడుని హృదయము కూడా స్ఫుటమయ్యెను. చంద్రాపీడుని దేహత్యాగము యోగి పరకాయ ప్రవేశము వంటిదట. 'శాపదోషాద్విముక్తమప్యంతరాత్మానో కృత శరీర సంక్రాంతే ర్యోగి న ఇవ శరీరమత్రైవ భవతోః ప్రత్యయార్థ మాశాపక్షయా దాస్తాం'.

ఈతని పాత్రలో దీపముపెట్టి వెతికినప్పటికీ కోపము, ఉద్రేకము, ఈర్ష్య, బానిసత్వము, తొందరపాటు, అసహనము, కామోద్రేకము, గురునింద, మాన్యులఉపాలంభనము, మోసము, వక్రబుద్ధి, అసమర్థత, స్వచ్ఛంద చారిత్రము, పరిజనులను కించపరచుట కనిపించవు. ఇతనికి కాదంబరి తర్వాత ప్రాణమునకు ప్రాణము పత్రలేఖ. ఈతనిలో ఆదరపూర్వకమైన ప్రేమతో మహాశ్వేత కొరకు తన ప్రాణములనైన ఒడ్డగలిగినంత మమకారము, వైశంపాయనుని కొరకు చిరకాలము పరితపించి చివరకు ఆత్మార్పణమునే చేసికొన్న తీరు, దీపశిఖవలె తాను కాలిపోయి ఇతరులకు కాంతిని ప్రసాదించు తత్త్వము పాఠకుల నాకట్టుకొనును. బాణుని అమృతమయసృష్టి అమృతకిరణుని ప్రతిరూపమయిన చల్లని చంద్రాపీడుడు.



# కాదంబరి పాత్ర

కాదంబరీ వంశమును వర్ణించుచు మహాశ్వేత చంద్రాపీడునితో తాముభయులమూ అప్సరసవల్ల పుట్టినవారమేయని చెప్పెను. వారిలో పదునాలుగు కులములు గలవు. దక్ష ప్రజాపతి కుమార్తెలలో 'ముని', 'అరిష్ట' అను ఇద్దరు కన్యలకు గంధర్వులతో సంపర్కము కలుగుట వలన అందు రెండు కులములు సంభవించెను. ముని తనయులలో పదునారవవాడు చిత్రరథుడు సర్వశ్రేష్ఠుడు. అతని ఏకైక పుత్రిక కాదంబరి. అతడు స్వయము అఖండలునకు మిత్రమై ప్రభావశాలియై గంధర్వులందరికిని అధిపతి యయ్యెను.[1] భారతవర్షమున కనతి దూరమునందు ఉత్తర దిశలో కింపురుష వర్షమునందు హేమకూటమను వర్షపర్వత మతని నివాసము. చైత్రరథమను ఉద్యానము నతి మనోహరమైన దానిని నిర్మించినది, అచ్ఛోద సరోవరమును త్రవ్వించినది, సిద్ధాయతనమును నిర్మించినది ఇతడే.

'ముని' చెల్లెలు 'అరిష్ట'. ఆమె కుమారుడగు హంసునకు గూడా హేమకూటమే అధివాసము. అప్సరసల కులమునందే రెండవ గౌరీదేవివలె 'గౌరి' అను అప్సరస పుట్టెను. ఆమెను హంసుడు వివాహమాడగా, వారివలన మహాశ్వేత పుట్టెను. కావున కాదంబరీ మహాశ్వేత లుభయులును పార్వతీదేవి పుత్రికలతో సమానులు. పుట్టిన దాదిగా ఒక కంచములో తిని ఒక మంచములో పరుండి, సహపాంసుక్రీడవలన కాదంబరీ మహాశ్వేతలు ద్విధాభిన్న మయిన ఏక హృదయమువలె నుండిరి.

'కాదంబరి'ని కవి కన్నులతో పాఠకులు దర్శించక ముందే ఆమె ఆత్మ గుణములు మైత్రీబంధములును పరిచయమగును. ఆమె 'నాహం కథంచిదపి సశోకాయాం మహాశ్వేతాయాం పాణింగ్రాహయిష్యామి' (నేను మహాశ్వేత దుఃఖములో నుండగా వివాహమాడను)' అని ప్రతిజ్ఞ చేయును. తన కోరికకు వ్యతి

---

1. 'గంధర్వాణాం చిత్ర రథః' – భగవద్గీత (10-26).

రేకముగా తల్లిదండ్రులు బలవంతము చేసినచో ఆత్మత్యాగము చేయుదునని పలికిన కాదంబరిని చూచి పఠితలు 'ఓహో! స్నేహధర్మమనిన నిట్టిదా'యని ఆశ్చర్య చకితులగుదురు.

కాదంబరి ప్రతిజ్ఞను విన్న మహాశ్వేత 'నేను బ్రతికి యుండవలె నన్నచో పెద్దలమాట విని తదనుగుణముగా నడుచుకొను'మని ప్రతి సందేశము పంపెను. వారిరువురి ప్రగాఢమైత్రి సుఖమునే కాక దుఃఖమును కూడా పంచుకొను తీరు 'స్నిగ్ధజన సంవిభక్తం హి నామ దుఃఖం సహ్యావేదనం భవతి' అన్న కాళిదాస మహాకవి వాక్యమును స్మరింపజేయును.

కాదంబరి మహాశ్వేతతో నిష్ఠురములాడుచు తనను మహాశ్వేత ఈ విధముగా పరీక్షించుచుండెనాయని విస్మయమంది 'దివసకరాస్తమయవిధురాసు నలినీషు సహవాసపరిచయాచ్చక్రవాకయువతిరపి పతిసమాగమసుఖానిత్యజతి కిముతనార్యః' (సూర్యాస్తమయము వలన కమలయునకు పతివియోగము సంభవించగనే చక్రవాక పక్షిగూడ తనకు తామరపై గల మైత్రిని పురస్కరించుకొని ప్రియ సమాగమమును త్యజించు ననగా స్త్రీలు తమ మిత్రులకొరకు ఇంత పాటి త్యాగమును చేయరాదా?) అని యనును. మహాకవులు తాము ప్రతిపాదించ దలుచుకొన్న ప్రతి ఆదర్శమున కున్నూ, ప్రకృతియందు ఒకానొక సాదృశ్యమును వెదకికొనగలరు కదా ?

కాదంబరీ చంద్రాపీడుల శృంగార హేల కాదంబరీ తాంబూల సమర్పణముతో ఆరంభమగును తాంబూలముతో సహా ఆమె తన హృదయమును కూడా అతనికి సమర్పించెను. ఆమెను చూడగానే శేషేంద్రియములు గూడా తనకు కన్నులుగా మారిన బాగుండెడివని చంద్రాపీడుడు భావించును. ఇది కవికృత కాదంబరీ సౌందర్య మీమాంస

చంద్రాపీడుని యందు కాదంబరి మనస్సు లగ్నముకాగా ఆమె హృదయమునందు క్షీరసాగర మథనము జరిగి ధర్మ మీమాంస కలుగును. ఇందులో కవి ఆమె మహాశ్వేత స్నేహధర్మమును నిలబెట్టుటకై చేసిన ప్రతిజ్ఞకు అకారణముగా చొరరాని చోట్ల నిరవకాశముగా ఉన్నదనుకొన్న చోట్లగూడ ప్రవేశించు ప్రేమకు విసంవాదమును కల్పించును. ఇది అతి సున్నితమయిన స్తుతి మైత్రని ఘర్షణ. ఇక్కడ కాదంబరి కామార్త కాదు.

అప్పుడప్పుడే ప్రేమ మొలకెత్తుచున్న ముద్దరాలు. అందుకే ఆమె తల్లి దండ్రులు 'కాలమేతావంతం మనస్యేవన్నై తదావ యోరాసీద్యథా జామాతృసహితా వత్సాద్రష్టవ్యా ఇతి' (ఇంతకాలము మాకు అల్లుని వెతకవలెనను ఆలోచనయే కలుగలేదు). కాదంబరికి వివాహ యోగ్యమయిన కాలము సమీపించినట్లు తల్లి దండ్రులు గ్రహించకుండుట సహజము· వారిదృష్టిలో వారిబిడ్డ చాలా చిన్నది గనే కనిపించును.

'నా అదృష్టము కొలది ఈ చంద్రాపీడు డిక్కడకు దాపురించెను. నేనిదివరకు చేసిన ప్రతిజ్ఞ మాటేమిటి?' అని కాదంబరి మథన పడెను. ఆమె కింకాను అప్పటికి తన పరిసరములు లీనములై చంద్రాపీడ మయములుగా కని పించలేదు. తాను లోకాపవాద భీతి లేక ఈ విధముగా పెద్దలకును, తోటి వారికిని వెరవక ప్రవర్తించితినే అన్న లజ్జా భావము మాత్రము గాఢముగా ఉన్నది.

కాదంబరి ప్రథమ ప్రణయ సూచకముగా తనకు పంపిన శేషహారము, దుకూలద్వయము, స్రక్చందనాదులను గ్రహించిన చంద్రాపీడుడు 'అతిదక్షి ణాయాః ఖలుదేవ్యాః కాదంబర్యా నిర్దాక్షిణ్యమపి (న్యాపి) గుణా నకంచి న్న దాసీ--కుర్వంతి.' (కాదంబరి చాల దయగలది. ఆమె నిర్దాక్షిణ్యముగా ప్రవర్తించినను తన గుణములతో ఇతరులను దాసులుగా జేయును). అని అనును. అంతేగాక 'కే వయమాత్మనః కే వావయం గ్రహణాగ్రహణస్య వా గతా ఖల్వియమస్తం కథా (కావలెనని, వలదని అనుటకు మేమెవరము? ఆ కథ ముగిసింది) అని తన సర్వస్వమును కాదంబరీ ప్రణయ మందిర దేహలియందు అతడు సమర్పించును.

కాదంబరిలోని గుణ రత్న త్రయము నిరభిమానత, అభిరూపత, అతి గంభీరత. ఇవి చంద్రాపీడునకు స్ఫురించిన సత్యములు.

కాంబరిని సౌందర్యాధిదేవతగా. మథురలోని శిల్పముగా, ప్రాతః కాల మలయమారుతముగా, శిరీషకుసుమ పేశలముగా కవి తన లేఖినితో స్పృశించి, స్పృశించక సృష్టించెను.

కాదంబరీ చంద్రాపీడుల ప్రణయమునకు గూడా మూలబంధము మైత్రియే. మైత్రి పేమగా మారుట ఇచ్చట చూడవచ్చును. దశలవారీగా వారి ప్రేమ బంధము గట్టిబడుట కూడా చూడనగును.

కాదంబరి పత్రలేఖతో తన యెదలో చంద్రాపీడుని ఎడల ఏర్పడిన భావము నీ విధముగా వ్యక్తము చేయును : 'అకన్యకోచితే వా చాపలే చేతః ప్రవర్తయిష్యామి. సాహం న సంకల్పితా పిత్రా, న దత్తా మాత్రా, నానుమోదితా గురుభిః—— కాతరా చానాథేవ బలాదవలిప్తేన గురుగర్హణీయతాం నీతా కుమారేణ చంద్రాపీడేన' (నాలోని ఈ చాపల్యము కన్యల కుచితము కాదు. తల్లిదండ్రుల ప్రమేయము లేకుండా జరిగినదిది. పిరికి దాననై అనాథవలె పెద్దలు గర్హించు స్థితికి చంద్రాపీడునివలన చేరితిని). ఒక హద్దులో ఉండి ప్రవహించు ప్రణయ వాహినియే గాని హద్దులు దాటి ఉప్పొంగు బ్రహ్మపుత్రా నది ఈ మాటలో మనకు కనిపిచందు. ఇంతేకాక ఆమె అన్వయము, అభిమానము, గాంభీర్యము, శాలీనత ఈ మాటల వెనుక నిమిడియున్నవి.

పత్రలేఖ కాదంబరి నూరడించుచు ''యదా ఖలు కన్యకాం గురురివ పంచశరః సంకల్పయతి, మాతేవానుమోదతే పితేవ దదాతి సఖీవోత్కంఠాం జనయతి'' (పంచశరుడే తండ్రివలె, తల్లివలె, గురువువలె సఖివలె కన్యకకు ఉచితమగు ప్రేమ పాఠములు నేర్పును; తన సమ్మతిని తెలుపును) అని చెప్పి **శాస్త్ర విహిత** మయిన స్వయం వర విధిని సమర్థించును.

కాదంబరి పత్రలేఖ ద్వారా పంపించిన సందేశమునందలి ప్రేమ నిష్పత్తి అసదృశము. ఆమె చంద్రాపీడునితో 'అతడు తన ప్రియుడని చెప్పుట పునరుక్త మగుననియు, నేను తన ప్రియురాలనని చెప్పుట జడ ప్రశ్న అనియు, నీ యందు నాకు గాఢానురాగము కలదనుట వెలయాలి పలుకులగుననియు, నీవు లేక నేను జీవించలేననుట అనుభవ విరోధమనియు, నన్ను మన్మథుడు పీడించుచుండెననుట నాదోషములను నేనే లెక్కించుట అనియు, మన్మథుడు నన్ను నీకు దానము చేసెనని చెప్పుట ఉపసర్పణోపాయమగుననియు, నీవు తప్పక రమ్మని చెప్పుట సౌభాగ్య గర్వము, నేనే వత్తుననుట స్త్రీ చాపల్యము, ఈ నీ దాసి అనన్యరక్తయని చెప్పుట భక్తిని ప్రదర్శించుకొనుట, తిరస్కరింతు వేమో యని సందేశమును పంపకుండుట అజ్ఞానము' అని పలు విధముల తన ఉత్కంఠను వ్యక్తము చేయును.*

---

* ఇట్టి శైలిని దిఙ్నాగ విరచితమయిన ''కుందమాల' యను నాటకము లోనూ చూడవచ్చును. చూ. ''అహో దృష్ట ఇతి పరితోషః చిరప్రవాస ఇతి మన్యుః పరిక్షామ ఇత్యుద్వేగః. నిరనుక్రోశ ఇత్యభిమానః. (పక్క పేజీచూడుము)

చంద్రాపీకుని ప్రాణ త్యాగానంతరము తొలుత అనుమరణ వ్యవసిత యగు కాదంబరి 'అస్మిన్ సమయే జీవిత మేవ మరణం మరణం పునర్జీవితం' అని సంగ్రహముగా తన నిశ్చయమును తెలుపును - ఈ సమయమునందు నా మరణము జీవితముతో సమానము. జీవించి యున్నచో నేను మృతురాలనే.

భారతీయ సాహిత్యమునందు విగత జీవులైన వారిని, శప్తులైన భర్తలను రక్షించుకొన్న సాధ్వీమణు లెందరో కలరు. సావిత్రి, సుమతి వంటివారి కోవకు కాదంబరి కూడా చేరును. చంద్రాపీడుని శరీరమును తన కర స్పర్శతో ఆప్యాయమానము చేసి శూద్రక భూమికను చాలించి అతడు తిరిగి వచ్చువరకు నిలిపిన స్త్రీ కాదంబరి.

చంద్రాపీడుడు పునర్జీవితుడగువరకు కాదంబరి స్థితి 'క్లేశః ఫలేన హి పునర్నవతాం విధత్తే' అను సుభాషితమును గుర్తింప జేయును. కావుననే విలాసవతీ తారాపీడులు ఆమెకు చంద్రాపీడుని శరీరమునప్పగించి దూరముగా నుందురు.

---

చిరపరిచిత ఇత్యనురాగః, దర్శనీయ ఇత్యుత్కంఠా, స్వామీతి బహుమానః, కుశలవయోస్తాత ఇతి కుటుంబినీసద్భావః అపరాధం ప్రవేశితాస్మీతి లజ్జా- కుం. మూడవ అంకము.

(సీతాదేవిని లోకాపవాద భీతిచే రామచంద్రుడు వదలి పెట్టెను. వాల్మీకి ఆశ్రమ ప్రాంతమును సందర్శించుటకు రాముడు రాగా పొదలమాటున నిలబడి ఉన్న సీత తన జీవితేశ్వరుని చూచి అన్న మాటలవి; "నా భర్తను చూచితినని పరితోషము. చాలా కాలము నన్ను వదలి దూరముగా నుండెనన్న కోపము, కృశించిపోయెనని ఉద్వేగము, దయాహీనుడని రోషము, చిరపరిచితుడని అనురాగము, అందగాడని అతనిని మరి మరి చూడవలెనను ఉత్కంఠ, నాకు స్వామి అని గౌరవము, కుశలవుల తండ్రియని ఇల్లాలిగా అతనిపై సద్భావము, నాపై అపరాధమును మోపెనేయని లజ్జాభావము కలుగుచున్నవి" ఒక సన్నివేశములో ఒక వ్యక్తిని గూర్చి ఇన్ని అభిప్రాయములను వ్యక్తము చేయుట కవి నైపుణ్యమును జీవితము నవగాహనము చేసికొన్న తీరును చూపును.)

ఇంద్రాయుధ రూపమును వదలిన కపింజలుడు మహాశ్వేతతో జరిగిన వృత్తాంతమును వివరించగా అప్పుడు కాదంబరి మహాశ్వేతను సమీపించి 'ప్రియ సఖీ! నీతో తుల్య దుఃఖిత నైన నాకు ఇంక కష్టము లేదు. ఈ వేళ నేను నీఎదుట తల ఎత్తి నిలువగలను. నీ ప్రియ సఖిని చెప్పకొనుటకు నాకింక సిగ్గు అనిపించుటలేదు. జీవన్మరణములు రెండునూ నాకు ఇక సమానములే. అవి రెండును దుఃఖదాయకములు గావు. నా కర్తవ్యము నింక నీవే ఉపదేశించవలెను' అని అనును. ఇచ్చట మహాశ్వేత కాదంబరికి దేశిక. ఆమెకీ మార్గమునందు ఇది వరకే అనుభవమున్నది. ఇట్టి కష్ట దశలో వారి మైత్రికి గల అధిష్ఠాన సామ్యమును కవి చాలా జాగరూకతతో నిర్వహించెను.

తాను స్త్రీ సహజమైన శోకావేగముతో చంద్రాపీడుడు మరణించినప్పుడే ఏడువలేదనియు ఇప్పుడతడు పునరుజ్జీవితుడగుననుట నిస్సంశయమైనప్పుడు తన తల్లి దండ్రులను కలిసికొని దుఃఖమును పట్టలేక ఏడ్చుట తన అభిమతము కాదనియు కాదంబరి మదలేఖకు చెప్పను. దీనివలన శోకాభిత ప్త వ్యక్తికి అశ్రు పాతము బాలిశమగు సాధనమని ధీరులు ఏడ్చుట తగదనియు బాణభట్టుని భావ మని పాఠకులకు అవగాహన మగును. అశ్రుపాతము ఒక ప్రదర్శనము వంటిది అనియు అసమర్థులే అట్టి ప్రదర్శనలను జరిపి తోటివారి సహానుభూతిని సంపాదింతురనియు అతని భావమై యుండును. మహాశ్వేత నూరడించు చంద్రాపీడుని ఉపశమ వాక్యములలో కూడా ఇదే అర్థ మిమిడి యున్నది. చంద్రాపీడు డిక లేడని తెలిసి విలపించు విలాసవతి నూరడించుచు ఆమె భర్త ''కిమర్థమయ మాత్మా వత్సస్యకృతే సకల లోక సాధారణేన అమునా వైక్లబ్యోపగమేన తుచ్ఛతాం నీయతే'' అని పలికి తిరిగి ''కేవలం గలయేవ స్ఫుటతి రటతో న హృదయం, నిరర్థకం ప్రలపితమేవ నిర్యాతి వదనాన్న జీవితం నిరాసంగం నయన జలమేవ పతతి న శరీరం'' అని చెప్పను. ఏడ్చుట తుచ్ఛమైనదని ఏడ్చువారి గొంతు బొంగురు పోవునే కాని హృదయము పగిలి పోదనియు నిరర్థకములగు మాటలే అట్టివాని నోటినుండి వెలువడును కాని ప్రాణము పోదనియు కన్నీరే క్రింద పడును కాని శరీరము పడదు అని తాత్పర్యము. తారాపీడుని ఈ ఉపశమ వాక్యములు భూషణభట్టు లేఖిని నుండి వెలువడినవి. ఈతడు తన తండ్రి సంతరించిన కావ్యము యొక్క ఆత్మను దర్శించినవాడు కావుననే అతని భావముల నన్నిం

టిని తాను కూడా స్వానుభవముతో ప్రత్యక్షము చేసికొని తిరిగి భంగ్యంతర మున చెప్పెను. ఈ శోక మీమాంస దానికొక నిదర్శనము మాత్రమే.

శోక వేగమునుండి తేరుకొనిన విలాసవతి కాదంబరి నభినందించుచు ''క్వ సా మే వత్సస్య జీవితనిబంధనం వధూః'' అని మూర్ఛిల్లిన కాదంబరిలో చైతన్యమును తేనెంచి "సమాశ్వసిహి మాతః త్వయా వినాఽద్య ప్రభృతి కేన సంధారితం వత్సస్య మే చంద్రాపీడస్య శరీరం? మాతః త్వమమృతమయీవ జాతాసి. యేనవత్సస్య పునర్వదనమాలోకితం'' (ఓ అమ్మా! నీవమృతమయివి. నీ కరస్పర్శ కారణముగా మా కొడుకు ముఖమును ఇప్పుడు చూడగలిగితిమి) అని అనును. లోకములో అత్తగారికి కోడలిమీద ఏదో ఒక విధమయిన కినుక ఉండి తీరును. కొడుకు ప్రాణములను (ఇక్కడ శరీరమును) నిలిపినప్పుడు మాత్రము వారికి కోడలిపై ఎక్కడలేని మమత కలుగును. వారి దృష్టికప్పుడా కోడండ్రు పుత్ర భిక్ష పెట్టిన దేవతలుగా కనిపించుదురు. ఇక్కడ కాదంబరికి సామాన్యు లకు దుర్లభమైన అత్తవారి అభినందనలు గూడ లభించినవి. కథలోని ప్రతి పాత్రకును ఈమె వారి జీవితముకన్న గరీయసి అయి కథలోని నాయికగా యథార్థ నాయికగా తన స్థానమును నిలబెట్టుకొనెను. తారాపీడుడు గూడా కోడలి యందు మామగారికి గల సహజ వాత్సల్యముతో, ''వయం నిష్ప్రయోజనా ద్రష్టారయేవ కేవలం కిమస్మాభిరిహ స్థితైర్గతైర్వా, యస్యాః కరస్పర్శేన ఆప్యా యిత మేత దవినాశి సైవ వధూః పార్శ్వేఽస్య తిష్ఠతు'' (మేము ప్రేక్షకులము మాత్రమే. ఇక్కడ నిలిచినా వెళ్ళిపోయినా మావలన ప్రయోజనములేదు. అమృత స్పర్శకలిగిన మావధువు మాత్ర మిచ్చట యున్న చాలును) అని అనెను. ప్రత్యుజ్జీ వితుడైన చంద్రాపీడుడు కూడా కాదంబరితో 'త్వం ఖలు అమృత సంభవా దప్సరసాం కులాదుత్పన్నా' (నీ వమృత సంభవమైన అప్సరసల కులము నుండి పుట్టిన దానవు) అని అనెను.

ఈ విధముగా కాదంబరి యందలి మానవాతీత శక్తివలన చంద్రాపీడుని శరీర రక్షణ జరిగెను. లేకపోయినచో ఇది సంభవము కాదు. అప్సరసలలో, గంధర్వులలోను మానవ సహజములైన పాతివ్రత్యము గుణ గరిష్ఠతలను కాదం బరి పాత్రయందు బాణుడు సృష్టించి చంద్రాపీడుని శరీరమునకువలె కాదంబరి పాత్రకును అమరత్వమును కల్పించెను.

4)

# మహాశ్వేత[1]

కాదంబరిపాత్రలన్నింటిలో పాఠకులనెక్కువగా ఆకర్షించునది మహాశ్వేత పాత్ర. మహాశ్వేతకు సంబంధించిన ప్రతివ్యక్తినిఆమెచుట్టుపట్ల పరిసరాలను మహాకవి పాలరాతితో చెక్కినట్లు కనిపించును, 'సర్వశుక్లా సరస్వతీ' అన్నసూక్తి మహాశ్వేతకువర్తించును. ''పార్వతీ పతి తెలుపు, పాలసంద్రము తెలుపు, కామధేనువు తెలుపు. కంచు తెలుపు'' అన్న పాత పద్యము సర్వశ్వేత మహాశ్వేతకు వర్తించును. ఆమె ఆశ్రమనిర్మాణము అచ్ఛోద సరోవర ప్రాంతమున జరిగినది. ఆరాధ్య దైవము పార్వతీపతి. తల్లిదండ్రులు, గౌరీహంసులు. ప్రాణప్రియుడు, శ్వేతకేతు మహర్షికొడుకు పుండరీకుడు. కావున శ్వేతవర్ణములో ఉండు సాత్త్వికగుణము, సౌమ్యత, సంయమము ఈమె యందున్నవి. కష్టాలను సహించి కాలయాపన చేయుచు, ఇంద్రియ గ్రామాన్ని చిక్క బట్టుకుని తపస్సులో మనస్సును సంలగ్నము చేసికొనగల్గుట గూడా ఈ మహాశ్వేతాత్వమును సమర్థించును. మహాశ్వేత ఆశ్రమ వర్ణనములో గూడా కవి ఈ మెలకువనే చూపించును.

అచ్ఛోదసరోవర వర్ణనారంభములోనే కవి -

''కైలాసమివ ద్రవతా మాపన్నం, తుషారగిరిమివ విలీనమ్, చంద్రాతపమివ రసతాము పేతమ్, హరాట్టహాసమివ జలీభూతమ్'' అని శ్వేత వర్ణనమునే ఆవిర్భవింపజేయును.

మహాశ్వేతను వర్ణించుచు కవి–

''దేహప్రభావితానేన సగిరికాననం దంతమయమివ తం ప్రదేశమ్ కుర్వతీమ్'' అను ఆమె అచ్ఛదేహప్రభను ప్రకాశింపజేయును.

---

[1]మహాశ్వేత కథను యధాతధముగా సుమన సాఖ్యాయికలో క్షేమేంద్ర కవి వ్రాసెను. 180-251 శ్లోకములు బృహత్కథామంజరి, శక్తి యశోనామ షోడశ లంబకః

''ధవలగుణేనేవ కేవలే నోత్పాదితాం. ఇయత్తామివ ధవలిమ్నః యౌవనే నాపి స్వకాలోప సర్పిణా నిర్వికారేణ అసితేనేవ శిష్యేణోపాస్యమానాం, ఇందు మండలేనేవ టంకోత్కీర్ణేన శంఖమయేన భిక్షాకపాలేన అధిష్ఠితాం.''

(ఆమె తన దేహ ప్రభలతో గిరికానన ప్రదేశమును ధవళముగా చేసెను. కేవలము ధవలగుణము చేతనే ఈమె సృష్టింపబడెను. స్వకాలమునందు ప్రవేశించిన యౌవనము వినీతుడగు శిష్యునివలె ఈమెనుపాసించెను. శంఖ మయమగు నీమె చేతిలోని భిక్షా కపాలము గూడా చంద్రమండలమునుండి కోసిన ఒక ముక్కతో తయారు చేయబడినట్లుండెను).

తన సమక్షమునందు మన్మథునకు ప్రతిరూపము పుండరీకుడు విగత జీవుడై చంద్రలోకమునకు సశరీరముగా ఎగిరిపోగా విగతచేతన అయి మహాశ్వేత ప్రియసమాగమ వ్రతమును ప్రారంభించి తపస్విని జీవనమును గడిపెను. ఈ వ్రత నియమమును భంగ్యంతరమున బాణభట్టు సూర్యాస్తమయ వర్ణనము నందు కమలిని చేయు దినపతి సమాగమ వ్రతములో వర్ణించెను. ఈ వర్ణనము కథాముఖము లోనిది. ''అచిర ప్రోషితే సవితరి శోకవిధురా, కమల ముకుళకమండలు ధారిణీ హంససిత దుకూలపరిధానా. మృణాళ ధవళ యజ్ఞోప వీతినీ మధుకరమండలాక్షమాలావలయం ఉద్వహంతీ కమలినీ రవిసమాగమ వ్రతమివ అచరత్ '' (సూర్యుడస్తమించగనె తిరిగి అతనితో సమాగమమును పొందుటకొఱకు కమలిని శోక విధుర అయి తామర మొగ్గయనెడు కమండలువును ధరించి, హంసలనెడు తెల్లని దుకూలమును కట్టుకొని, మృణాలమనెడు (తామరతూడు) తెల్లని యజ్ఞోపవీతముతో తుమ్మెదల జపమాలను వహించెను.) ఈ వర్ణనము మహాశ్వేతా వర్ణనముతో పూర్తిగా కుదురును. ఇచ్చటి రూపకములు కూడా అతి మనోహరములు. ఇట్లు మహాశ్వేత 'స్వయం విశీర్ణ ద్రుమ పర్ణ వృత్తి'యై గడుపుచున్న జీవనము మన్మథ దాహనంతరము శివుని ప్రసన్నుని చేసికొనుటకు వ్రతమును, తపస్సును చేయు పార్వతిని తలపించును.

''అవాప్యతే వా కథమన్యథా ద్వయం
తథావిధం ప్రేమ పతిశ్చ తాదృశః'' (కు–5)

(ఇట్లు తపస్సు చేయకున్నచో అంతటి ఉదాత్తమగు ప్రేమ సఫలమగుటెట్లు ? అట్టి పతి లభించుటెట్లు ?)

ఈ దృఢ నిశ్చయముతోనే మహర్షులను కూడా తన తపస్సుతో ఆశ్చర్యచకితులను కావించిన పార్వతి కాళిదాస మహాకవి అమర సృష్టి మహాశ్వేత పాత్రయందు పార్వతియే అడుగడుగున కనిపించును.

చంద్రాపీడుడు మహాశ్వేతను ప్రశ్నించు తీరు కూడా ఇదే భావమును బలపరచును.

"కిమర్థంవా అస్మిన్ కుసుమ సుకుమారే వయసి వ్రతగ్రహణం, క్వేదం వయః క్వేయమాకృతిః, క్వచాయం లావణ్యాతిశయః, క్వేయమింద్రియాణా ముపశాంతిః. తదద్భుతమివ మేప్రతిభాతి" (కుసుమసుకుమారమగు ఈ వయస్సులో ఈ వ్రత గ్రహణ మెందులకు ? నీ వయస్సెక్కడ ? లావణ్యాతిశయం బెక్కడ ? ఇంద్రియనిగ్రహముతో ఈ వ్రతనియమమెక్కడ?) ఇచ్చట శివ పార్వతుల సంభాషణము స్ఫురించును.

శివుడు పార్వతితో—

"కిమిత్యపాస్యా భరణాని యౌవనే

ధృతం త్వయా వార్ధకశోభి వల్కలం" (కు-V)

(యౌవనమునందు వార్ధకమునందు మాత్రమే శోభించు ఈ వల్కలమును ఏల ధరించితివి ?) అని ప్రశ్నించుట ఈ కోవకు చెందినదే. కాని శివబ్రహ్మచారి అంతటితో ఆగక "వదప్రదోషే వినికీర్ణతారకా విభావరీ యద్యరుణాయకల్పతే" ——— "ఉమాం స పశ్యన్ ఋజునైవ చక్షుషా", "అథోపయన్తారమలం సమాధినా", ---- "అహోస్థిరః కోఽపి తవేప్సితో యువా" అని పార్వతిని ప్రశ్నించినప్పుడు ఆ ప్రశ్నల వెనుక శృంగార ధ్వని పాఠకులకు స్ఫురించును. కాని చంద్రాపీడుడు మహాశ్వేతను ప్రశ్నించిన తీరు తత్పాత్రోచితముగా, సూటిగా, క్లుప్తముగా అతని వాక్సంయతిని తెలియజేయును. ఆమె ఆశ్రమమును చంద్రాపీడుడు ప్రవేశించినతీరు గూడ ఇదే శాలీనతకు నిదర్శనము. అతనితో మహాశ్వేత తన వృత్తాంతమును పూసగుచ్చినట్లు చెప్పినప్పుడు కూడా కవి ఇట్టి ఔచిత్యమునే పాటించెను. ఒక యువతి ఆగంతుకుడైన మరియొక యువకునితో తన కథను స్వభావోక్త్యా చెప్పుట కథాశిల్పమునందు చాలా పెద్ద మెలకువ కాగా అది మహాశ్వేతా పాత్ర పోషణమునకు కూడా సహాయకారి యాయెను.

మహాశ్వేత "అలంకారమివ బ్రహ్మచర్యస్య" అన్న విధముగా ధ్యాన ముద్రయందున్న పుండరీకుని పార్వతి పశుపతిని సమీపించినట్లు సమీపించెను. అందుకే ఉత్తరార్ధమునందు కపింజలుడు మహాశ్వేతతో సాంత్వన వచనములు పలుకుచు-

"తపసో హి సమ్యక్కృతస్య నాస్త్యసాధ్యంనామ కించిత్. దేవ్యా హి గౌర్యా తపసః ప్రభావాత్ అతిదురాసదం యావదాసాదితం స్మరారేరపి దేహార్ధ పదం". (తపస్సున కసాధ్య మేదియును లేదు కదా! గౌరీదేవి తపః ప్రభావమున శంకరుని అర్ధాంగి పదమును పొందలేదా?) ఇచ్చట బాణభట్టునిపై కాళిదాస మహాకవి ప్రభావము స్పష్టమగుచున్నది.

మహాశ్వేత శీలమునకు అగ్నిపరీక్షవంటిది వైశంపాయనుని అచ్ఛోద సరోవరప్రాప్తి. శప్తుడైన వైశంపాయనుడు చిలుకగా మారుట మహాశ్వేత పవిత్ర ఆచ్ఛాచ్ఛ శీలమునకు తార్కాణము. విధివంచిత అగుటవలన, పోగొట్టు కున్న రత్నమును పొందుటకు, పునః సమాగమ వ్రతమును కొనసాగించినను మహాశ్వేత ఆరాధించినది పుండరీకుని మూర్తినేగాని వైశంపాయనునిగాదు. శరీరము మారినను, ఆత్మ మారినను, అట్టి రూపము, పరాకాయ ప్రవేశము చేసిన వాని రూపమువలె పతివ్రతలకు అంగీకారయోగ్యము కానేరదు. మనము విను పునర్జన్మ వృత్తాంతములలో ఒక ముసలమ్మను అయిదేండ్ల పిల్లవాడు "నీవు నా భార్యవు" అని సంబోధించుటలో ఉన్న రసాభాసమే వైశంపాయనుడు మహాశ్వేత నుద్దేశించి ఆడిన నర్మోక్తులలోనూ భాసించును. నిప్పువంటిది మహాశ్వేత. ఆమెను పొందగోరిన వైశంపాయనునికి జరుగవలసిన శిక్షయే జరిగినది.

రాజపుత్రి మహాశ్వేత పాత్రను కవి సత్వ గుణమును కరిగించి పోసి చిత్రించి చదువరుల కామె ఒక తాపసిగా మాత్రమే, శ్రోత్రియ స్త్రీగా మాత్రమే కనిపించునట్లు చేయును పుండరీకుని కామోద యోగ్యయగు నప్పటికి మహాశ్వేతలో క్షత్రియత్వము మిగులలేదు.

సాటిలేని మేటిసృష్టి, ప్రేమ, స్నేహము, సంయమము, శీలము, భక్తి, గాంభీర్యము, సౌందర్యము, లావణ్యము, పేశలత్వము, మార్దవము రంగరించు కొన్న మహాశ్వేత......

మహాశ్వేతను ప్రత్యుత్థానము చేయు సమయములో కాదంబరి నడవడిక-
'భవంతి సామ్యేఽపి నివిష్ట చేతసాం
వపుర్విశేషేష్వతి గౌరవాః క్రియాః' (కు. V)

(అందరి ఎడల సమభావముతో ప్రవర్తించు వారికైననూ అతిథి విశేషమును చూచిన విశిష్టాదరము చూపించవలెనని అనిపించును) అన్న కాళిదాసు సూక్తిని తలపించును.

కాదంబరి స్వయముగా మహాశ్వేత పాదములను కడిగి తన ఉత్తరీయాంశుకముతో తుడిచి తనకామె ఎడలగల గౌరవభావమును వ్యక్తము చేసెను. మహాశ్వేత గడిపిన పవిత్ర జీవనమే ఆమెకు సమానులలో నుత్తమ శ్లోకత్వమును కల్పించెను. ప్రియసమాగమునకు వ్యవధానము ఎక్కువ అగుకొలది సతులలో పవిత్రత సౌశీల్యము అధికముగా ప్రకాశించును.

పత్రలేఖ :- ఈమె చంద్రాపీడుని తాంబూల కరంకవాహిని. పత్రలేఖ అనగా స్తనముల మీద గీసిన మకరికా పత్రలేఖ యను అర్థమును బాణుడే ఒక చోట సూచించును.[1] పేరు అందముగనే ఉన్నది. చంద్రాపీడుడు గురుకులవాసము నుండి సమావర్తుడు కాగానే అతని తల్లి విలాసవతి ఈమె నతనికి ఉపాయనముగా పంపించెను. తారాపీడ మహారాజు ఒకప్పుడు కులూత దేశపు రాజును జయించెను. అతని దుహిత పత్రలేఖ. బందీ జనముతో పాటు ఆమె కూడా అంతఃపురము నందలి పరిచారికలలో మహారాజు చేర్చెను. ఈమెను 'విగతనాథ' అని 'రాజదుహిత' అని దయతో విలాసవతి అపత్య నిర్విశేషముగా ఆదరించి చంద్రాపీడునికి 'బాలేవ లాలనీయా, స్వచిత్తవృత్తి రివ చాపలేభ్యో నివారణీయా, శిష్యేవ ద్రష్టవ్యా, సుహృదివ సర్వవిశ్రంభేషు అంతరీకరణీయా' (ఈమెను బాలిక వలె లాలించవలెను. నీ చిత్తవృత్తినివలె చాపల్యమునుండి నివారించుము, అంతేవాసినిని వలె గారవింపుము. స్నేహితునకు వలె నీ రహస్యముల నన్నింటిని ఈమెకు తెలుపుము) అని సందేశమును పంపెను. పత్రలేఖా చంద్రాపీడుల అన్యోన్య స్నేహభావము, ఆమె చంద్రాపీడునకు ప్రసాదభూమియగుట ఈ సందేశము వలన వ్యక్తమగును. కథాగమనమునందు ఈమె నిర్వహించ వలసిన పాత్ర సున్నితమయినది.

---

1. కా. పుట 475.

ఈ పాత్రను ప్రవేశపెట్టుచు కవి ఆమె ఆహార్యవర్ణనమును కూడా పాఠకుల కన్నులకు కట్టునట్లు చేసెను. ఆమె ఇంద్రగోపముల వంటి ఎఱ్ఱని రంగు గల మేలి ముసుగును ధరించి అప్పుడే నూరిన మనఃశిలవంటి వర్ణము గల తన దేహ లావణ్య ప్రవాహముతో పరిసరములను ముంచెత్తుచుండెనట.[1] కాదంబరి చేత ఆమె సౌందర్యమును వర్ణింపజేయుచు ఒక్క మాటలో 'అహో! మానుషీషు పక్షపాతః ప్రజాపతేః' అని అనిపించును.

చంద్రాపీడునకు దూతియై అతని హృదయము నెరిగి కాదంబరి ఎడల మెలకువతో స్నేహరసనిర్భరభావముతో మెలగగలిగిన స్త్రీ పత్రలేఖ ఒక్కతెయే. అతని వెంట ఇంద్రాయుధముమీద ప్రయాణము చేయగల్గి అతనికి విస్రంభస్థానమై కాదంబరీ సందేశమును తీసికొని ఉజ్జయినికి తిరిగిరాగానే చంద్రాపీడుడు కాదంబరియందు తనకుకల ప్రీతిని కూడా కలుపుకొని ద్విగుణీకృతాదరముతో పత్రలేఖను కౌగిలించుకొనెను. వారిరువురి మధ్య అరమరలు లేవు. గ్రామ్య శృంగారమున కిచ్చట అవకాశము లేదు. వీరి ఉభయులది శరీర సంబంధముతో ప్రమేయము లేని అచ్ఛమగు స్నేహబంధము. బహుశః ఆనాటి రాజకుమారులకు అంతఃపుర మర్యాదలను నేర్పించుటకు ఉన్నతవంశమునకు చెందిన ప్రతిభాశాలినులైన ఇట్టి స్త్రీలను నియమించెడి వారేమో తెలియదు. సర్వసాధారణముగా సంస్కృత నాటకమునందు రాజునకు నర్మసచివుడుగా నుండి తన వెకిలితనముతో, హాస్యముతో సామాజికులకు వినోదమును కల్గించు విదూషకుని పాత్రతో పోల్చి చూచినప్పుడు పత్రలేఖవంటి పాత్ర ఎడ చాలా గౌరవము, పాఠకుల దృష్టి యందేర్పడును. ఈమెను గురించి చదివినప్పుడు ఈమె అతి గంభీర ఆకృతియై తన వ్యక్తిగత సుఖదుఃఖములకు అతీత అయి, స్వామి సేవయే జీవిత పరమార్థముగా ఎంచినది అని స్పష్టమగును. చంద్రాపీడుని ప్రాణత్యాగానంతరము ఇంద్రాయుధముతో బాటు తాను కూడా అచ్ఛోద సరోవరము నందు మునగిపోయిన పత్రలేఖ జాడ అప్పటిలో ఎవ్వరికిని తెలియ లేదు. కథాంతమునందు పత్రలేఖయే చంద్రపత్ని రోహిణీదేవి యని చంద్రాపీడ శశాంకుని సహచారిణిగా అతని ననుసరించుటకు ఆమె భూలోకమునందవతరించినదని దిగ్విజయ యాత్రలో కూడా ఈమె తన స్వామిని అనుసరించెనని

1. కా. పుట 168.

శృంగార భావ ప్రేరణ లేని చంద్రాపీడుని రెండవ ప్రాణ మీమెయని తెలియుచున్నది.

ఒక దశలో కాదంబరి కూడా కూడా పత్ర లేఖయే తనకు తన తల్లి దండ్రులకన్న మహాశ్వేతకన్న చివరకు తన ప్రాణములకన్న వల్లభ యని చెప్పి తనకు పత్రలేఖపైగల ప్రీత్యతిశయమును వ్యక్తము చేయును. చివరిసారిగా ఈమెను కాదంబరి వద్దకు కేయూరకుని వెంట పంపించునపుడు చంద్రాపీడుడు ఆమెపై తనకుగల ప్రేమను మొత్తము హృదయమునందాపుకొనలేక వెలి బుచ్చును. అతడు పత్రలేఖతో హేమకూటమునకు పోవు దారిలో తన విరహ పీడ పత్రలేఖను బాధించరాదనియు, శరీర సంస్కారము నందామె అశ్రద్ధ వహించరాదనియు, వేళకు భోజనమును చేయవలయుననియు, తెలియని బాటలో పయనించరాదనియు, తెలియనిచోట స్థలమును పరీక్షించకుండ నిలువరాదనియు, విడిది చేయరాదనియు, క్రొత్తవారితో రహస్యములు చర్చించరాదనియు, శరీర రక్షణయందప్రమత్తురాలై యుండవలయుననియు చెప్పి అంతటితో ఆగక 'పత్ర లేఖే కిం కరోమి? త్వత్తోఽపి మే దేవీప్రాణాః వల్లభతరాః, ఏనైవమేకాకినీ తేషాం సంధారణాయ విసర్జితాసి, అపి చ మమ జీవనయ తవహస్తే వర్తతే' (పత్రలేఖా, నేనేమి చేయుదును ? నీ కన్న నాకు కాదంబరీ ప్రాణములు వల్లభ తరములు. అందుకే వానిని నిలుపుటకు నిన్నిట్లేకాకినిగా పంపుచుంటిని. ఇప్పుడు నా జీవితము కూడా నీ చేతులలోనే కలదు.)[1] అని చెప్పును. పత్రలేఖ నిర్వర్తించిన విధి ఇదియే. చంద్రాపీడునకు కాదంబరి యందు ప్రేమను స్థిర పరచుచూ పత్రలేఖ కాదంబరి వద్దకు తీసికొని పోయిన సందేశము కథా కథన దృష్ట్యా అతి ప్రధానము. పత్రలేఖముఖతః చంద్రాపీడునికి తనయందుగల ప్రేమ భావమును కాదంబరి తెలిసికొనుటతో నాయికా నాయకుల ప్రేమ పర స్పర నిష్ఠమగును. ఆ తరువాత చంద్రాపీడుడు శాపాంతమువరకు కాదంబరిని కలిసికొన జాలడు. కాదంబరి కూడ చంద్రాపీడుని మృత దేహమునే దర్శించును. చంద్రాపీడుడు శూద్రకుడుగా అవాంతర జన్మము నెత్తి శాపాంతము వరకు వేచి ఉండుటకు ఆ అవధికాలమునందు కాదంబరి అతని దేహమును

1. కా. పుట 537.

సంరక్షించి వాడని వీడని ప్రేమ బంధమును నిలుపుకొనుటకు, జన్మ జన్మాంత రముల యందు వారి అనురాగలత వికసించుటకు ఈ పత్రలేఖా సందేశము నిమిత్తముగా పనికి వచ్చును. చంద్రాపీడుని సందేశము నందజేయుటతో ఈమె పాత్ర యొక్క ప్రయోజనము ముగిసిపోయెను కావున కవి ఈమెను అచ్ఛోదమునందు ముంచివేసెను.

## కపింజలుడు

కపింజలుడు పుండరీకుని నెచ్చెలి, అంతరంగ రక్షకుడు (Conscience keeper). ఈ పాత్ర కాదంబరిలో చాలా బలమైనది. పుండరీకుని ద్వారా మహాశ్వేతకు; పుండరీకుని రూపాంతరుడైన వైశంపాయనుని ద్వారా చంద్రాపీడునకు అత్యంత సన్నిహితుడై, హితాభిలాషి అయిన వాడితడు. అప్రియములు, పథ్యములు అయిన ఉపదేశ వాక్యములతో తపోవృత్తి నవలంబించిన పుండరీకునిలోని కామ వికారమును గర్హించిన వాడితడు. కపింజలుడు పుండరీకునకు, తరువాత ఉత్తరార్థ కథలో మహాశ్వేతకు చేసిన ఉపదేశము సమయోచితములై శుకనాసోపదేశమునకు సంగ్రహ రూపములుగా కనిపించును. మంచి స్నేహితున కుండవలసిన గుణములు ఇవి:

> ''అఘము వలన మరల్చు-హితార్థ కలితుజేయు-
> విడువడాపన్ను-గుహ్యంబుదాచు'' (ఏ. లక్ష్మణకవి)
> ఇవన్ని గుణములు కపింజలునిలో సమీకృతములై ఉన్నవి.

మహాశ్వేతనుచూచి, ఆమె కోరిన పారిజాత మంజరిని అవతంసముగా ఆమెకు బహూకరించు వేళలోనే సాత్విక భావోద్రేకమువలన పుండరీకుని చేతి నుండి అక్షమాల జారిపోగా కపింజలుడతని మందలించుచు 'సాధువులు ధైర్య ధనులు. వికార పరిస్థితులలో యః కశ్చన ప్రాకృతునివలె విక్లవమును పొందు నీ ఆత్మను అదుపులో పెట్టలేకుంటివి. నీ ధైర్యము, బ్రహ్మచర్యము, ఇంద్రియ వశిత్వము, నీవు పొందిన గురూపదేశములు, చదివిన చదువు, సాధించిన విద్యా

గత, తపోనిరతి ఎక్కడికి పోయినవి? నీ సంస్కారమంతా నిరర్థకమేనా?'' అని అంటాడు. ఆతరువాత క్రమముగా పుండరీకుని స్థితి విషమించినదని గ్రహించి కూడా చివరిసారి అతనిని మందలించే దృష్ట్యా ''ఓ మిత్రమా! నీవు అనుభవించే పరితాపము. ధర్మశాస్త్ర విహితమా? గురూపదిష్టమా? ఒక విధ మైన తపస్సు స్వరూపమా? వ్రతమా? నియమమా? మోక్షప్రాప్తికి మార్గమా?'' అని ప్రశ్నించెను. ఇంకను ''మదనా విష్టుడయినవాడు పిచ్చివానివలె ధర్మము నాచరించుచుంటినని తలచి, విషవృక్షమును సాదుచేసి పెంచును. ఖడ్గమును (నిస్త్రింశలత) కువలయమాలఅనుకొని కౌగిలించు కొనును. ఇంద్రియముల నదుపులో పెట్టుకొనలేని నీజ్ఞాన మెందులకు'' అని ఉపదేశించినను ఫలితము శూన్యముకాగా, చివరకు పుండరీకుడు మరణావస్థను సమీపించుట గ్రహించి కపింజలుడు ''సతతమతిగర్హితేన కృత్యేనాపి రక్షణీయాన్మన్యంతే సుహృద సూన్సాధవః'' (గర్హితమయిన పనిచేసి అయినా మిత్రుని ప్రాణములను రక్షించ వలెనని సాధుజనము చెప్పుదురు కదా) అని భావించి మహాశ్వేత వద్దకు స్వయ ముగా పుండరీక ప్రాణరక్షణ కొఱకు దూతగా బయలుదేరును. స్నేహధర్మాన్ని కపింజలుడు చక్కగా నిలిపెను.

కపింజలుని సుహృద్భావమును ప్రశంసించుచూ మహాశ్వేత ''ఇతడు చెప్పిన మాటలు నిజములయితే, పుండరీకు డట్టి దశలోనే ఉన్నట్లయితే, కపింజ లుడు చేసిన మహోపకారమునకు కొలమాన మేది? "కో వానేనాపరః సమానో బంధుః, కథం వా కపింజలస్య స్వప్నే౽పి వితథా భారతీ. ప్రశాంతాకృతేరస్మా ద్వదనాన్నిర్గచ్ఛతి" (కపింజలునితో సమానుడైన ఇతడు చెప్పినమాటకు కలలోగూడా తిరుగుండదు కదా!) అని అనును. అందుకే పుండరీకుని శరీర ముతో చాటు చంద్రలోకమునకు ఇతడు ఎగిరి పోవును.

మహాశ్వేత నూరడించుచూ ఆమెసఖి తరలిక కపింజలుడు తాను జీవించి యుండగా తిరిగి ఆమెను చూడకుండా పోనేరడని, అతడు తిరిగి వచ్చువరకైనను ప్రాణములను నిలుపుకొమ్మని పలికెను.

ఈ కపింజలుడే వైమానికుని చేతశప్తుడయి ఇంద్రాయుధముగా జన్మించును. ఇక్కడ తన మిత్రుడయిన పుండరీకునిలోని చాంచల్యము,

గుఱ్ఱపుదాటు కపింజలునిలో మిత్రవియోగము వలన, స్నేహలతా విచ్ఛేదము వలన ప్రాప్తించి, శాపగ్రస్తుడగుటకు కారణమగును. కామక్రోధాదులను జయించినప్పటికినీ కపింజలుడు తత్సహకారి గుణమైన శోకావేగమును జయించ లేక పోయెను.

చంద్రాపీడుని మరణానంతరము ఇంద్రాయుధ రూపమును త్యజించిన కపింజలుడు మహాశ్వేత నూరడించి, పుండరీకునిభాగ్యమును పండించు ఉపాయము నన్వేషించుచూ శ్వేతకేతుమహర్షి వద్దకు పోవును.

అప్పటినుండి చిలుకరూపములో ఉన్న వైశంపాయనపుండరీకుని వద్దకు వచ్చి అచిరకాలములో అతనికి మంగళమగుట కొఱకు శ్వేతకేతువు ఒక ఆయుష్కర కర్మ జరుపుచుండెననియు, తత్పరిసమాప్తి పర్యంతము జాబాలి ఆశ్రమములోనే చిలుక ఓపిక పట్టి ఉండవలెననియు బోధించును

పుండరీకుడు కపింజలుని ఎడల తన కృతజ్ఞతను తెలియబరచుకొనుటకు చిలుక రూపములో వచ్చి కపింజలుని గుణగణములను వర్ణించెను. ఒగర్చుతూ ఆకాశమార్గములో అతనికొఱకు పరుగెత్తుకొని వచ్చిన కపింజలుని రూపాన్ని కన్నులకు కట్టినట్లు కవి నిరూపించును. చిలుక దృష్టిలో కపింజలుడు ముముక్షువైననూ మిత్రస్నేహ భరితుడు, నిస్సంగుడయిననూ తనతో కలయికను కోరువాడు, నిఃస్పృహుడయిననూ, తన కోరికలను తీర్చగోరువాడు, నిర్మముడయినను తనతో అభిన్నుడనుకొనువాడును, తన కొఱకు క్లేశము ననుభవించువాడు, సమలోష్ట కాంచనుడయిననూ, తన కొరకు దుఃఖించువాడు.

కపింజలుని ప్రశంసకింతకన్న తగిన విశేషణము లుండవేమో!

*ఇంద్రాయుధము:-* పుండరీకుని శరీరమును ఒక తేజము చంద్రలోకమునకు తీసికొనిపోగా కపింజలుడు ఆ తేజస్సు ననుసరించి పరిగెత్తి పోయెను. అచ్చట పుండరీకుడు చంద్రుడు పరస్పరము శపించుకొనుట వలన వారిరువురును మనుష్య యోనియందు పుట్టబోవుచుండగా కపింజలుడు చంద్రలోకము నుండి తిరుగు ప్రయాణము చేయుచూ, గఱ్ఱపు దాటుతో పరుగెత్తుచూ ఒక వైమానికుని నతిక్రమించి పోగా అతడు గుఱ్ఱపుదాటులో ముందుకు పోయిన నీవు

గుఱ్ఱముగనే మారుమని శపించెను. అట్లయిననూ తన మిత్రునకు చేరువుగా ఉండవలెనను కోరికతో ఆకాశమార్గమునుండి క్రిందికి దిగి అచ్ఛోద సరోవరము నందు మునిగి ఇంద్రాయుధాశ్వరూపమును ధరించి కపింజలుడు చంద్రాపీడు ని వాహనముగా తన విధిని నిర్వర్తించును. చంద్రాపీడుడు గురుకులాభ్యాసమును ముగించగనే తారాపీడుడీ అశ్వమునతనికి ఉపాయనముగా సమర్పించెను. ఇక్కడ ఆశ్వమును బాణుడు వర్ణించినతీరు ఉత్తమ జాతి అరబ్బు గుఱ్ఱము మన కన్నుల ఎదుట సాక్షాత్కరింప జేయును. ఇంద్రాయుధమున కాపేరు ఎందుకు వచ్చినదో చెప్పుచూ కవి 'అసిత, పీత, హరిత, పాటలాభిరాఖండల చాపాను కారిణీభిః లేఖాభిః కల్మాషిత శరీరం' (నలుపు, పసుపు, ఆకుపచ్చన, ఎఱుపురంగులతో ఈ అశ్వము ఇంద్రధనుస్సువలె వివిధ వర్ణములతో కూడి యున్నది.)[1] దీనినింకనూ వర్ణించుచు బాణుడు 'ఆ స్తీర్ణ వివిధవర్ణ కంబలమివ కుంజరకలభం, కైలాస తటాఘాత ధాతుధూలిపాటలమివ హర వృషభం, అసుర రుధిర పంకలేఖాలోహితమివ పార్వతీ సింహం' అని చెప్పెను[2] (ఈ అశ్వ మును చూచినచో ఏనుగు గున్నపై రంగు రంగుల కంబలమును కప్పినట్లున్నది. ఈశ్వరుని వాహనమగు వృషభరాజముయొక్క దేహము కైలాస పర్వతము అంచులకు ఒరిసికొనుటచేత అందలి ధాతురాగములచేత ఎఱ్ఱబడినట్లున్నది పార్వతికి వాహనమగు సింహము దేహమునకు ఆమె అసుర సంహారము కావించి నప్పుడు రక్తపుచారలు అంటినట్లున్నదీ అశ్వము.)

దీనిని చూడగనే చంద్రాపీడునకిది సామాన్య అశ్వము కాదని తలంపు కలుగును. 'అసంశయమనేనాఽపి మహాత్మనా కేనాఽపి శాపభాజా భవితవ్యం-ఆవేదయతీవ మదంతః కరణమస్య దివ్యతాం' [3] (ఎవరో మహానుభావుడు శాపమువలన ఈ అశ్వరూపము ధరించి ఉండవచ్చును. ఇది దివ్యాశ్వమని నా అంతఃకరణము చెప్పుచున్నది.)

ఇంద్రాయుధము బతికి ఉన్నంతకాలము ఉత్తమ జాతికి చెందిన అశ్వము మాత్రమే కాని చంద్రాపీడుడు దిగ్విజయ ప్రస్థానము చేసి కిన్నర మిథునము

---

1. కా. పుట 274.

2. కా. పుట, 274, 3. కా. పుట. 278,

ననుసరించు పోయినప్పుడు ఇంద్రాయుధమే చంద్రాపీడుని అచ్ఛోద సరోవరము నుండి మహాశ్వేత ఆశ్రమము వైపునకు మరలించెను. 'నిశ్చలశ్రవణ పుటేన తన్ముఖీ భూతేన ఉద్గ్రీవేణ ఇంద్రాయుధేన ప్రథమ మాకర్ణితం శ్రుతిసుభగం వీణాతంత్రీఝంకారమిశ్రమమానుషం గీతశబ్ద మశ్రుణోత్' (ఇంద్రాయుధము చెవులను రిక్కించి మెడను పైకెత్తి ఆశ్రమమునకు ఉన్ముఖీభూతమై ఇంపైన అమానుషగత శబ్దమును విని, అటు పోవుటకు దారి తీసెను. అదే శబ్దమును చంద్రాపీడుడు కూడా విని ఉత్కంఠతో ఇంద్రాయుధమును అటువైపునకే చోదించెను.) ఇది ఇంద్రాయుధము పూర్వజన్మ సంస్కారమునకు గుర్తు. ఇదే మాటను శాప విముక్తుడయిన కపింజలుడు ఇంద్రాయుధ రూపమును విడిచి పెట్టి తన అసలు రూపముతో అచ్ఛోదమునుండి పైకి లేచి వచ్చి మహాశ్వేతతో చెప్పెను.

ఒక్క మహాకవి తను అల్లిన కథను నడిపించుటకు సచేతనులగు, బుద్ధి సంపన్నులగు, మనుష్య పాత్రలతో సహా కొన్ని పశుపక్ష్యాదులను ఒక్కొక్క ప్పుడు అచేతనములయిన ఆభరణములను గూడా సాధనములుగా ఉపయోగించును. రామాయణ కథ యందు చీమలు పెట్టిన పుట్టతో మొదలుకొని క్రౌంచ మిథున సంహారము, జటాయు పక్షి, ఉడుత, సీతాదేవి ఆభరణములు, రాముని పాదుకలు, అతడు పంపించిన ఉంగరము, దానికి ప్రత్యభిజ్ఞానముగా సీత పంపిన చూడామణి, కాకాసుర వృత్తాంతము మొదలగునవన్నియు ప్రధానమగు ఘట్టములను నిర్వహించుటకు ఉపయోగపడినవే. ఇదే విధముగా బాణుడు కూడా కథ వినువాని ఉత్కంఠను కలిగించుటకై ఇంద్రాయుధాశ్వమువంటి పాత్రలను ప్రవేశపెట్టి వానికి మనుష్య పాత్రతో సంబంధమును కల్పించెను. అయోనిజమగు ఇంద్రాయుధము అదే నీటి యందు మునిగి తన శరీరమును చాలించెను. ఒకవైపు పత్రలేఖ వేరొకవైపు ఇంద్రాయుధము. వీరిరువురు చంద్రాపీడుని నీడవలె అనుసరించినవారు కావున చంద్రాపీడుని ప్రాణ త్యాగానంతరము కవికి వీరివలన ప్రయోజనము లేక వీరిని నీటముంచివేయుటయే కాక ఓకే నాటకమునందు ఒకే పాత్రధారి అవసరముకొలది ముఖము మీది రంగులు మార్చుకొని ఆహార్యమును మార్చి రెండు పాత్రల రూపము లలో ప్రేక్షకులముందు కన్పించి వారు వేరు వీరు, వేరను భ్రమనుకల్పించి నట్లే ఒకప్పుడింద్రాయుధరూపమున చంద్రపీడుని సేవించిన అదే ఆత్మ ఆ

ప్రయోజనము నివృత్తము కాగనే తిరిగి కపింజల రూపమున ఆవిర్భవించి కొంతసేపు మహాశ్వేత నూరడించుచూ, మరికొంతసేపు కాదంబరితో ఉపశమన వాక్యములు పలికి ఆమెకు కర్తవ్యమునునిర్దేశించుచూ మరికొంతసేపు శ్వేతకేతుఋషి ఆదేశానుసారము చిలుకగా మారిన పుండరీక వైశంపాయనుని ఎడల తనస్నేహ ధర్మమును నిర్వర్తించును.తన స్వార్థము ఇసుమంతయునులేనిదీ కపింజలాభిన్న మగు ఇంద్రాయుధపాత్ర. పూర్వకాలమున రాజు మరణించగనే అతనిఆయుధము లను, ధన, కనక, వస్తు, వాహనములను పరిజనమును, భార్యను యజమానితోసహా దహనము చేయుచుండిరట. ఈజిప్టుదేశములోని పిరమిడ్లలో రాజు శవము వెంట అతనికి ప్రియములయిన వస్తువులను, బానిసలను అతడు సూర్యలోకమునకు ప్రయాణముచేయుట కుపకరించు ఓడను ఉంచి, వెలలేని బంగారమునుంచి పిరమిడ్ల తలుపులను బిగించివేయువారట. ఈ పత్రలేఖాయింద్రాయుధముల అవాంతర ప్రాణ త్యాగముకూడా అట్టి సాంఘిక అచారవు ఛాయయేమో తెలియదు.

—०००—

# శుకనాసుడు

బుద్ధియందు బృహస్పతిని తలపించువాడు తారాపీడుని మంత్రి శుకనా సుడు. ఈ రాజు, మంత్రి పరస్పరము అన్నదమ్ములవలె కలసిమెలిసి ఉండుట, ఒకరి సమస్యను వేరొకరు కలిసి చర్చించుట, శుకనాసునకు కష్టము వచ్చినపుడు తారాపీడుడు ఓదార్చుట వీరి ఆదర్శమైత్రిని తెలియజేయును.

ఇతనిని వర్ణించుచూ కవి ఆదర్శమంత్రికి ఉండవలసిన లక్షణములను ధిషణా బలమును చూపించుచూ అతని నిట్లు వర్ణించెను; ''నిఖిలశాస్త్ర కలావగాహ గంభీరబుద్ధిః, నీతిశాస్త్ర ప్రయోగకుశలః భువనరాజ్య భార నౌకర్ణధారః మహ త్స్వపి కార్యసంకటేషు అవిషణ్ణధీః-, ధామ ధైర్యస్య స్థానం స్థితేః, సేతుః సత్యస్య గురుర్గుణానాం, ఆచార్య ఆచార్యాణాం, ధాతా ధర్మస్య శేషాహిరివ మహీభార ధారణక్షమః సలిల నిధిరివ మహాసత్త్వః'' (నిఖిలశాస్త్ర కలావగా హన గంభీర బుద్ధి, రాజనీతి శాస్త్ర ప్రయోగ కుశలుడు, భువనరాజ్య భారమ నెడు నావకు కర్ణధారుడు, కష్టములలో గూడా చెదరని బుద్ధిగలవాడు; సత్యము, ధర్మము, సహనములకు నిధి, ఆదిశేషునివలె మహాభారమును వహించగల్గిన వాడు, బలవంతుడు, సముద్రునివలె మహాసత్త్వ సంపన్నుడు, వేదవేదాంగా ధ్యాయి, శుక్ర, బృహస్పతి, వసిష్ఠ, విశ్వామిత్రుల వంటి మంత్రి సత్తముల కోవలోనివాడు.)

ఇతడు తన ప్రభువు శ్రేయస్సునే తన శ్రేయస్సుగా భావించి చంద్రా పీడుని పుత్ర నిర్విశేషముగా చూచి అమూల్యమగు శుకనాసోపదేశమును చేసెను. అందుకే తారాపీడుడు అతనికి రాజ్య భారమును పూర్తిగా అప్పగించెను.

శుకనాసుడు చంద్రాపీడుని విద్యాభ్యాసము ముగిసిన వెనుక చేసిన ఉప దేశము వ్యక్తిగతముగా వారిరువురకును గల సన్నిహిత సంబంధమును వెలి బుచ్చును. విశ్వామిత్ర మహర్షి రామచంద్రుని గారవించి ఉపదేశామృతము నొసగినట్లు శుకనాసుడు చంద్రాపీడునిలోని దివ్యాంశను గమనించి అతనిని సన్మార్గ ప్రవర్తకుని చేయనుద్యమించెను.

*శుకనాసోపదేశము:-* ఇది కాదంబరి కంతటికిని మకుటాయమానమై బాణభట్టుని లోకజ్ఞతను వెలిబుచ్చును. అతనికి ప్రియమగు మహాభారతము ఉపదేశవేదము, సుభాషిత భాండాగారము కాబట్టి తత్ప్రభావమున ఈ ఉపదేశామృతమును కాదంబరిలో చొప్పించెను. ఇందు శాస్త్రజ్ఞానముతో బాటు లోకజ్ఞానమును రంగరించి పోసి పంచతంత్రమును, కిరాతార్జునీయమునందలి ప్రథమ సర్గత్రయమునందలి పిండితార్థమును తలపింపజేయును.

ఇందు గురుకుల సమావర్తనము తరువాత రాజ కుమారు డెదుర్కొను సమస్యలు చర్చించబడినవి. రాజాశ్రయమును కోరువారు తమ స్వార్థమునకై రాజుయందున్న యౌవనము, ధనసంపత్తి, ప్రభుత్వము, అసహిష్ణుత వంటి బలహీనతలను వినియోగించుటవలన రాజు వ్యక్తిత్వము గాజు పెంకువలె తునాతునకలై పోవును. కనుక దానిని కాపాడుటకు దేశికత్వమును వహించిన శుకనాసుడు ఉపదేశమును చేసెను. ఇందు మహాభారతాదులలో లేని కొత్త నీతి పాఠము లేవియును లేకపోయినను బాణుని శైలి యను మూసలో పోయుటవలన సరికొత్త ఉపమానములతో వానికి నవ్యత్వ మొచ్చినది. గద్య రూపమునందుండుట వలన, దూరాన్వయములు, క్లిష్ట సమాసములు లేనందున హృదయ స్పర్శి సులభగ్రాహ్య మయినది ఈ ఉపదేశము.

అమలములైన గురువచనములు యౌవన దశలో నున్న బుద్ధిహీనునకు చెవిలో పడినప్పుడు స్వచ్ఛమైన నీటివలె శూలమును (పోటును) కల్గించును.[1] కాబట్టి ఉపదేశము కూడా సత్పాత్రమునకే చేయవలెను. చంద్రాపీడుడు అభవ్యుడు కాదు. అప్పుడే గురుకులము నుండి తిరిగి వచ్చినవాడు. కాబట్టి విషయ రసమునా స్వాదించలేదు. అతనికి చేసిన ఉపదేశము శంఖము నందు పోసిన నీటివలె పవిత్రమై సఫలమయ్యెను. ఏనుగునకు వేసిన శుభాభరణము వలె శోభను కల్గించెను.

ఉపదేశమును చేయవలెనను బాధ్యతను శుకనాసుడే వహించుటకును కారణమున్నది. రాజుల కుపదేశించువారు చాలా తక్కువ (విరలా హి తేషా

---

1. కా. పుట 223.

ముప దేష్టారః)[1] ప్రజలతని వచనమును ప్రతివచనమువలెనే అనుష్ఠింతురు, అని శుకనాసుడు పలికినప్పుడు విభీషణుడు రావణ సభలో అన్న మాటలు స్ఫురించును. [2]

లోకములో తాము చేయు దుష్టకార్యములను తెలివితేటలతో సమర్థించు కొనువారు ఛేకులై ఇతరుల నప మార్గమునందు దింపుదురు. వారు ద్యూతమును వినోదమని, వేటను శ్రమ యని, పానమును విలాసమని, తన భార్యను వదలి వేయుటను ఇంద్రియ నిగ్రహమని, ఇతరుల భార్య ననుసరించుటను వైదగ్ధ్య మని, పరాభవమును సహించుటను క్షమాశక్తియని, ఎదుటివారి నవమానించుట మహాసత్త్వత యని వ్యాఖ్యానమును చేయుదురు. వీరు తామే భూమిపై నివసించు దేవతలమని గర్వపడుచు, తమలో లేని గుణగణములను ఉన్నట్లు అను చరులచేత ప్రచారము చేయింతురు. తాము చర్మము కప్పుకొనియున్న ముక్కంటుల మనియు, తమ దర్శనమే ఇతరులకు గొప్పయని, కన్ను తెరచి చూచుట ఉపకార మని, ఆజ్ఞాపించుటయే వరప్రదానమని, తామెవరిని స్మరించితే వారిజన్మ పావనమని, మాట్లాడుటయే బహుమతి ప్రదానమని భావించుచు దేవ, ద్విజ, గురు జనములను పూజింపక కాలయాపనము చేయుదురు. [3] ఇట్టివారి నుండి దూరముగ ఉండవలెనని చంద్రాపీడునకు శుకనాసు డుపదేశించెను.

చంద్రాపీడుడు మృతకళేబరమునుండి ప్రత్యుత్థానము నొందునను కాదంబర్యాదుల వచనమును సమర్థించుచు ఇతడు 'ముద్రాబంధాత్ ధ్యానాత్ వా విషప్రసుప్తస్య ఉత్థాపనేకీదృశీ యుక్తిః'[4] (మంత్రబద్ధుడుగాని విషమూర్ఛి తుడుగాని తేరుకొనుటయందు ఏ యుక్తి కలదో అదియే) అని చెప్పును. చని పోయిన చంద్రాపీడుడు పునరుజ్జీవితుడగుట ఏదో ఒక కాకమ్మ పిట్టమ్మ కథవలె

---

1. కా. పు. 224.
2. "సులభాః పురుషా రాజన్ సతతం ప్రియవాదినః
   అప్రియస్య చ పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభాః"- రా.యు.కా.
3. కా. పు. 283, 284, 85.
4. కా. పుట. 661.

ఉన్నను దానిని శుకనాసుడు శాస్త్రీయముగా పురాణేతిహాస కథల దృష్టాంతముతో సమర్థించుటవలన కాదంబరి సాధారణ జానపద గాథల స్థాయినుండి పైకి పెరిగినది. కథలో ఒక సంఘటన జరిగెనని చెప్పుటయే గాక ఎందుకు జరిగి యుండవచ్చునోయన్న మీమాంసవలన ఈ గ్రంథమునకు ఉత్తమ సాహిత్య స్థాయి వచ్చినది. ఈ స్థాయిని కల్పించుట యందు శుకనాసుని పాత్ర సృష్టి అత్యంతోపకారము. చంద్రాపీడుడు తప్పక బ్రతికి వచ్చుననుటలో తనకు సందేహము లేదని చెప్పుచూ ఇతడు 'న ఖలు వైదికానామవైదికానాంకర్మణాం అసాధ్యం నామ కించిత్'[1] అని ముగించును. ఈతని మాటలు విన్న తారాపీడుడు శుకనాసుని బోధలు ఇతరులకు స్ఫురించవని పలికి తనకతనిపైనున్న గౌరవమును మొత్తము సంగ్రహించి చెప్పెను.

## వైశంపాయనుని పాత్ర

పుండరీకునకు, శుకమునకు మధ్య అవాంతర జన్మ వైశంపాయనునిది. కథ దృష్ట్యా మధ్యలో వచ్చి వచ్చినంతసేపటిలో రాలిపోవు ఆకు వంటిది ఇతని జీవితము. పుండరీకుడు తాను మరణించినప్పుడు తన మనస్తాపమునకు కారణభూతుడైన చంద్రుని తనవలె కష్టములను జన్మజన్మలందునూ అనుభవింపుమని శపించగా, చంద్రుడు నీవు కూడా నాతో బాటే జన్మించుమని పుండరీకునకు ప్రతిశాప మొసగెను. తత్పర్యవసానమే వైశంపాయనుని జన్మ.

కవి చంద్రాపీడ వైశంపాయనుల మైత్రిని వర్ణించుచూ 'సహపాంసుక్రీడనతయా, సహసంవృద్ధతయా చ సర్వవిశ్రంభ స్థానం ద్వితీయ మివ హృదయం (చంద్రాపీడస్య) వైశంపాయనః పరం మిత్రమాసీత్' (చంద్రాపీడ వైశంపాయనులు ఇద్దరునూ పరస్పరము కలిసి చిన్నతనములో క్రీడించి పెరిగినందున చంద్రాపీడునకు రెండవ ప్రాణము వంటివాడు వైశంపాయనుడు) అని చెప్పెను. వైశంపాయనుడు తన ఏలికను సూర్యుని దివసమనుసరించినట్లు ఎల్లప్పుడునూ అనుసరించెను.

1. కా. పుట. ౭౭౩.

ఇతడు విద్యాభ్యాసమునందు కూడా చంద్రాపీడునితోసహా మహా ప్రాణత (సాహసికశక్తి)లో తప్ప మిగిలిన విద్యలన్నిటిలో, లలితకళలలో, శాస్త్రములలో సమానమైన జ్ఞానమును సంపాదించి తన మిత్రముతో కలిసి దిగ్విజయ ప్రస్థానము చేసెను. వైశంపాయనునిలో 'ఇదం బ్రాహ్మ మిదం క్షాత్రం' అని ఉభయశక్తులు సమీకృతములై ఉండెను.

చంద్రాపీడునకు కాదంబరిని కలసికొను ఉపాయము నన్వేషించుచూ, మరల తల్లిదండ్రుల అనుమతి పొందుట ఎట్లో అని విచారించుచూ 'వైశం పాయనోఽ ప్యసన్నిహిత ఏవ మే' అని చింతించును. ఈ విధముగా చింతించు చున్న సమయములో వైశంపాయనుడు స్కంధావారముతో తిరిగి వచ్చుచున్నా డన్న వార్త వినగానే ఆనందముతో "కేయూరక; కరతలవర్తినీం సిద్ధిమవ ధారయ ప్రాప్తో వైశంపాయనః" అని అనెను.

స్కంధావారములో వైశంపాయనుని జాడ తెలియరాని చంద్రాపీడుడు బెదిరిన లేడి పిల్లవలె, యూథమునుండి తప్పిపోయిన ఏనుగు గున్నవలె, ధేన వును గానక చెవులు రిక్కించి పరుగెత్తు లేగదూడవలె కింకర్తవ్యతా మూఢుడై కటకమధ్య దేశమును ఒక్క ఉదుటున పరుగెత్తి చేరుకొనెనట. ఈ మాట వెనుక వైశంపాయనుడు లేనిదే చంద్రాపీడుడు కూడా లేడను రాబోవు ఆపదను కవి ధ్వనింపజేయును.

అచ్ఛోద సరోవరమును వదలి వెళ్ళనిచ్ఛగించని వైశంపాయనునితో అతని సైన్యము "మీరు చంద్రాపీడుని దర్శించక ఎట్లుందురు? 'కిమన్యశ్చ ంద్రాపీడః అన్యోవా భవాన్'' అని తర్జించెను. చంద్రాపీడ వైశంపాయను ద్విధావిభక్తమైన ఒకే హృదయమువలె నుండిరి.

అచ్ఛోద సరోవరమును సమీపించిన వైశంపాయనుని స్థితి

"రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి యత్సుఖితోఽపి జంతుః
తచ్చేతసా స్మరతి నూనమబోధపూర్వం
భావస్థిరాణి జననాంతర సౌహృదాని''

(సుఖముగానున్న మనుష్యునకు కూడా ఒక్కొక్కప్పుడు రమ్యప్రదేశములను దర్శించునప్పుడు, మధుర ధ్వనులను విన్నప్పుడు అనిర్వచనీయమైన ఆవేగము కల్గును. అట్టి ఉద్విగ్న మానసముతో జీవి ఇదివరకెన్నడునూ తెలియని, తెలియ రాని విషయమును స్మరించును. సాధారణముగా మానవుడు తెలిసిన విషయమునే స్మరించును కాని తెలియని విషయమును స్మరించుటకు కారణము జననాంతర మైత్రీ భావమే) అను శాకుంతల శ్లోకములోని వర్ణనమునకు చక్కగా అతుకును. వైశంపాయనుని మాటలు "స్మరన్నివ కిమపి మనోనాన్యత్ర ప్రవర్తతే పశ్యం తీవ కిమపి మమ దృష్టిరన్యతో వలతి ... కీలితేవ చాస్మిన్నేవస్థానే తనుః" (ఏదో విషయమును స్మరించినట్లు నా మనస్సు ఈ ప్రదేశమునందే లగ్నమై మరొక విషయము మీదకు మరలుటలేదు. దేనినో చూచుచున్నట్లు నా దృష్టి ఇతర స్థానములమీదినుండి మరలి ఇచ్చట లగ్నమగుచున్నది. నా శరీరము నిక్కడనే ఎవరో మేకులు వేసి బిగించినట్లునట్లున్నది) ఇదే భావమును బలపర చును.

అచ్ఛోద సరోవర ప్రాంతమునందు వైశంపాయనుని తనువు కీలితము కాగా అతని అనుచరులు శరీరస్థితి కొరకు ఆహారమును సేవింపుడని అర్థించగా, 'ఈ నా ప్రాణములు నావికావు. నా మిత్రమగు చంద్రాపీడునకు తన జీవితము మీద కన్న వీని మీద తీపి ఎక్కువ. ఒకవేళ అవి నన్ను బలముగా వదలి పెట్టినను వానిని ఆపుట నా ధర్మము. అవి ఉత్క్రమించనప్పుడు నేనెందు కట్టి ప్రయత్నము చేయుదును? నా కొసము ప్రతీక్ష చేయునది చంద్రాపీడుడే గాని మృత్యువు కాదు' అని ముగించును. ఈ మాటల వెనుకనున్న నాటకీయత, వ్యంగ్యభావము సహృదయైక వేద్యము.

వైశంపాయనుడు తిరిగి రాకపోగానే శుకనాసున కతనిపై కోపము కార్చిచ్చువలె విజృంభించెను. పాలు త్రాగిన రొమ్మును గ్రుద్దు స్వార్థపరునివంటి వాడు వైశంపాయనుడు, అవివేకి, స్వామిద్రోహియని అతనిని శుకనాసుడు దూషించెను. అదే కోపావేగములో తారాపీడ దేవుడు వైశంపాయనునికి చెప్పించిన చదువంతయూ చిలుకకు నేర్పిన కలకంఠ పలుకులేననియు, వాని అంతరార్థము నతడు గ్రహింప నేరడయ్యెననియు, ఇంత ప్రేమతో చిలుకను పోషించినను స్వామిభక్తి, కృతజ్ఞతా స్నేహములు దానికయినను ఉండి యుండెడి వనియు దూషించెను. ఇట్టివాడు ఏదో ఒక తిర్యగ్యోని యందు పడి

మడిసి పోవలెనని శపించిన శుకనాసుడు తన బ్రాహ్మణ సహజమైన తొందర పాటు నంతయు ఆవిష్కరించుకొని రాబోవు సంఘటనలను సూచించెను.

వైశంపాయనుడు స్కంధావారముతో కలిసి తిరిగి రాని కారణ మేమై ననూ, శుకనాసుడు నిజమును గ్రహించకముందే, జరిగిన విషయమును తెలిసి కొనకముందే అతనిని దూషించుట 'పల్కు దారుణాఖండల శస్త్రతుల్యము (బ్రాహ్మణునకు)' అను మాటను నిలబెట్టెను. ఇంతేగాక ఇక్కడ వరాకుడైన ముదుసలి తండ్రి హృదయమును కూడా పాఠకులు చూడగలరు. అతనిని మైత్రిగా మందలించుచూ తారాపీడు డనిన మాటలు దివ్యముగా నున్నవి. అతడు 'సర్వ పరిత్యాగంకృత్వా స్థిత ఇత్యేతదపి కారణమవిజ్ఞాయ కిమేవం దోషపక్షే నిక్షిపామః. కాదాచిత్ గుణీభవత్యేవం అయమవినయనిష్పన్నో దోష ఏవ' అని అనెను. (వైశంపాయనుడు సర్వస్వ పరిత్యాగము నెందుకు చేసెనో తెలియక పూర్వాపర వివేచనలేక అతనిని దోష పక్షమునందు నిక్షేపించుట న్యాయము కాదు. ఒక వేళ ఇతనిలోని దోషమే గుణమగునేమో ఎవరి కెరుక?) క్షత్రియుల రాజ్యకర్మ క్షమత్వము ఇట్టి పూర్వాపర వివేచనయందే కలదు.

చంద్రాపీడుడు వైశంపాయనుని వెదకుటకు పోనెంచి "జన్మనః ప్రభృతి కదామయా గతం, స్థితం, క్రీడితం, హసితం, పీతం, అశితం, సుప్తం, ప్రబుద్ధం, ఉచ్ఛ్వసితం వా వినావైశంపాయనేన" (పుట్టినది మొదలు నేను వైశంపాయనుని విడిచి ఎక్కడకు పోయితిని, ఎక్కడ నిలిచితిని, క్రీడించితిని, నవ్వితిని, పానముచేసినిని, భుజించితిని, నిద్రించితిని, మేల్కొంటిని, గాలిని పీల్చితిని,) అని తనకు వైశంపాయనుని ఎడల గల ప్రగాఢ మైత్రీ బంధమును తెలియ జేయును. అతడు ఈ సందర్భమునందే మనోరమ వద్ద సెలవు తీసికొని పోవు టకు వెళ్ళగా మనోరమ 'త్వఖలుమే త్వయి తస్మింశ్చ విశేషః వత్స ఏకేనా పి హి యువయో రావాంపుత్రవత్యౌ ద్వే అపి తన్నగంతవ్యం' (నీకూ వైశంపాయనునకూ భేదములేదు. నీ వొక్కడవే ఉన్నను నేను విలాసవతీదేవి ఉభయులము పుత్రవతులమే అగుదుము. ఓ వత్సా ! నీవు పోవలదు) అని ఆడిన మాటలు ఒకవైపు ఆమె మాతృ హృదయమును ఆవిష్కరించుచూ, వేరొకవైపు మిత్రుల స్నేహబంధమును తెలియజేయును. ఆమెకు విలాసవతి చెప్పిన సమాధానము ఇంపుగా నున్నది. మనోరమ దృష్టిలో వైశంపాయన

చంద్రాపీడులకు భేదము లేదు. కాని చంద్రాపీడుడు ఎవరి ముఖమును చూచి వైశంపాయనుని చూచిన తృప్తి ననుభవించవలెను? 'వైశంపాయన విరహితమై దుఃఖ దీనమైన చంద్రాపీడుని ముఖమును చూచుటకన్న అతనిని పంపివేయు టయే ఉచితము' విలాసవతి చెప్పిన ఈ సమాధానము యుక్తి యుక్తముగా నున్నది.

చంద్రాపీడుని వంటి మిత్రమును పొందిన వైశంపాయనుని భాగ్యమే భాగ్యము. అతడు కనిపించిన మేఘనాధునితో వైశంపాయనుని గూర్చి ప్రశ్నల వర్షమును కురిపించుచూ 'స్మరతి వా అస్మాకం, పృష్టోఽసి వా కించిన్మ దీయం ఉపలబ్ధో వాభిప్రాయః, దాస్యతి వా దర్శనం (వైశంపాయనుడు నన్ను స్మరించెనా ? నన్ను గూర్చి ప్రశ్నించెనా? అతని అభిప్రాయము ఏమైననూ తెలిసెనా ? అతని దర్శనము నాకగునా !) అని చిన్న పిల్లవానివలె అమాయ కముగా అడిగెను ఇంకను ''గ్రహిష్యతి వా అస్మదనునయం కింకుర్వన్ దివసమాస్తే కిం వా అస్య వినోద స్తిష్ఠతః (నా ఓదార్పు మాటలను అతడు చెవిన పెట్టునా ? దినమంతయు అతడేమి చేయుచుండును? అక్కడ ఏ వినోదము ననుభవించుచు అతడు నిలిచి యుండవచ్చును?) అను ప్రశ్న పరంపర వెలువడెను.

వైశంపాయనుని పాత్ర చక్కని చిక్కని మైత్రీబంధమునకు, ఎడతెగని ప్రేమబంధమునకు, ఆశాబంధమునకు ప్రతీక. ఇతడు శాపగ్రస్తుడై చిలుకగా మారిపోగానే సీసపుతునక నీటిలో మునిగినట్లు ఈతని పాత్ర అదృశ్యమై పోవును. దీని ప్రాధాన్యము తరువాత లేదు బాల్యావస్థ యౌవనమునకు నాంది అయినను యువకునకు బాల్యదశతో సంబంధము లేకపోయినట్లు వైశంపాయనుని దేహాంతర ప్రాప్తితో ప్రస్తుత కథ మూల కథలో కలిసిపోగానే ఈతని పాత్ర అస్తమించును.

చంద్రాపీడుడు కాదంబరీ మహాశ్వేతలను వీడ్కొని హేమకూటము నుండి బయలుదేరి కతిపయ గంధర్వ రాజకుమారులతో కలిసివచ్చి అచ్ఛోదతీరము నందు వెలసియున్న స్కంధావారమును చేరుకొని పత్రలేఖా వైశంపాయనులతో ''మహాశ్వేత ఇట్లుండును, కాదంబరి వైనమిట్టిది[1]'' అని వారి ప్రసంగమును తెచ్చినప్పుడు ఆ పరిసరముల ప్రభావము వలన వైశంపాయనుడు ఉత్కంఠితు డైనట్లు కవి వర్ణించలేదు. అది యట్లుండగా స్కంధావారముతో అతడు

1. కా. పుట 429.

ఉజ్జయినికి బయలుదేరునప్పుడు వైశంపాయనుడే 'అతి పుణ్యం హి అచ్ఛోదాఖ్యం సరః పురాణేషు శ్రూయతే, తస్మిన్ స్నాత్వా ప్రణమ్యచాస్యైవ తీరభాజి సిద్ధాయతనే భగవంతం భవానీపతిం మహేశ్వరం శశాంక శకల శేఖరం వ్రజామః'[1] (అచ్ఛోదము అతి పవిత్రమని పురాణములందు చెప్పుదురు. అందు గ్రుంకులిడి సిద్ధాయతనమునందలి భవానీ పతిని సేవించి పోయెదము.) అని పలికి ముందుకు కదలి అక్కడ ఉన్న ఒక లతా మండపమును చూచి స్తంభించి పోయెను. అప్పటినుండి అతని హృదయము ఏదో తెలియని ఉత్కంఠ ననుభవించెను.

ఇందు పూర్వాపరములు సంగతములుగా లేవు. చంద్రాపీడునితో కలిసి ఉన్నప్పుడు వైశంపాయనునకులేని ఉత్కంఠ అదే పరిసరములందు ఒంటరిగా తిరిగినప్పుడు కెందుకు కలిగెను? లతా మండపము పుండరీకుడు ప్రాణములు విడిచిన చోటైనచో అంతకుముందు వైశంపాయనున కది ఏల అగుపించలేదు?

---

1. కా. పు. 553, 554, 555,

# తారాపీడుడు

ఉజ్జయినికి రాజు తారాపీడుడు. బాణుడితనిని పాఠకులకు పరిచయము చేయుచు 'నల నహుష యయాతి ధుంధుమార భరత భగీరథ దశరథ ప్రతిమః' (నల నహుష యయాతి ధుంధుమార భరత భగీరథ దశరథులను పోలినవాడు) అని ఆరంభించెను. ఇతడు భుజ బలోపార్జిత భూమండలుడు. శక్తిత్రయమును (ఉత్సాహ, ప్రభు, మంత్రశక్తులను) సాధించినవాడు, నీతిశాస్త్రాభిన్న బుద్ధి, ధర్మదేవత అవతారము, ప్రజాపీడలను పరిహరించినవాడు. బాణుడు ఒకవైపు ఇతనిని ధర్మ స్వరూపుడని వర్ణించి అదే లేఖినితో రాజవిలాస ప్రకారముల నన్నింటిని విపులీకరించి పాఠకులకు లజ్జవంటి భావమును కలిగించును. ఇట్టి రాజవర్ణనము సంప్రదాయ బద్ధమైనదే. తారాపీడుని విలాసమయ జీవనమునందు విలాసవతికి ప్రత్యేక స్థానముమాత్రమున్నది. అదే ఆ కాలపు రాజుల ధర్మము.[1]

బాణుడతనిని సమర్థించుచూ అనిన మాట లివి :-

'ప్రముదితప్రజస్య హి పరిసమాప్తసకలమహీప్రయోజనస్య నరపతేః విషయోపభోగ లీలాభూషణమ్, ఇతరస్యతు విడంనా. ప్రజానురాగహేతోశ్చ అంతరాంతరా దర్శనమ్ దదౌ. సింహాసనం చ నిమిత్తేష్వారురోహ'[2] (ఇతని ఏలుబడిలో ప్రజలు సుఖముగా నుండిరి. కావున భూమండలమునందు చేయదగిన కర్తవ్యమును పరిసమాప్తిచేసిన రాజుకు విషయోపభోగములు భూషణములు. ఇతరులకు అపహాస్యకరములు. అప్పుడప్పుడు, ప్రజలమీద ప్రేమకొలది, అతడు దర్శన మిచ్చెడివాడు. విశేష దినములయందు సింహాసన మెక్కుచుండెను-పేరోలగము సాగించుచుండెను).

రాజునకుండవలసిన భోగభాగ్యములు, ప్రభుత్వము, రాజ్య పరిపాలనము, సచివులతో సంప్రదింపులు, అంతఃపుర జీవనము,అందరి మర్యాదలు, వీటన్నిటిని

---

1. కా కా. పుట. 92,93.  2. కా.కా. పుట. 101

తారాపీడుని జీవనము ద్వారానే కవి మనకు ఉత్తర దేశము నేలిన చిట్టచివరి హైందవ చక్రవర్తి ఐశ్వర్యమును వర్ణించి చెప్పెను.

కుటుంబ జీవనమునందు కూడ తారాపీడుడు సమర్థుడగు యజమానినని నిరూపించుకొనెను. పిల్లలు లేరని కుమిలిపోవు విలాసవతిని ఇతడనునయించుట, చంద్రాపీడుని సరియయిన మార్గమునందు నడిపించి విద్యాబుద్ధులు గరపి, దిగ్విజయ ప్రస్థానమునకే పంపించుట, కోడలితో కలసి కొడుకింటికి ఎప్పుడు వచ్చునోయని తహతహలాడుట, కాదంబరి చేతిలోనే తన కొడుకు జీవిత రహస్య మిమిడియున్నదని తెలిసికొని ఆమె చంద్రాపీడునికి చేయుచున్న పరిచర్యను ఆమోదించి తాను విలాసవతితోసహా ప్రక్కకు జరుగుట, చంద్రపీడుని శరీరమునే ప్రతి దినమును చూచుటకు అచ్ఛోద సరోవర తీరమునందే వానప్రస్థుడై తానింక సాధించవలసినదేమియులేదని శేషజీవితమును గడపుట, వైశంపాయనునిపై కోపగించుకొన్న శుకనాసుని మందలించుటవంటి తారాపీడుని ప్రవర్తన కాలానుగుణముగా అవసరము వచ్చినప్పుడు అధికారమును వినియోగించుచూ, యువతకు తమ శక్తిని నిరూపించుకొనుటకు అవకాశమిచ్చుచూ సకాలములో రాజ్యపాలనమును విరమించి విశ్రాంతి తీసికొనుచుంతెనని తెలియజేయును.

సమర్థుడు, ప్రజారంజకుడని నిరూపించుకొన్న ప్రతి రాజు ప్రతి బింబమును తారాపీడునిలో చూడవచ్చును.

## మనోరమా విలాసవతులు :

వీరుభయులును తమ భర్తల వలెనే సన్నిహిత సఖులై జీవనమును గడపిరి. వీరిని బాణుడు మాతృప్రేమను చిత్రించుటకే సృష్టించెను. విలాసవతి మాతృత్వమును పొందుటకు నోమిన నోములు, పడిన తపన అందులకు తార్కాణము. గురుకులమునుండి చంద్రా పీడుడుతిరిగిరాగానే విలాసవతి తానే అతనికి స్వయముగా అవతరణ మంగళమును చేసి, తలను మూర్కొని, కౌగిలించుకొని, దూరముగా జరిగిపోవుచున్న అతనిని లాగికొని తన ఒడిలో కూర్చుండ బెట్టుకొనెనట-గురుకులవాస క్లిష్టమయిన అతని శరీరమును తడిమి చూచి 'వత్స! కఠినహృదయస్తే పితాయేనేయమాకృతిరీదృశీ త్రిభువన లాలనీయా క్లేశమతి

మహాంతమియంత కాలం లంభితా ! కథమసి సోఢవానతిదీర్ఘామిమాం గురుజన యంత్రణాం' (నాయనా ! నీ తండ్రి ఎంతటి కఠిన హృదయుడు? నీవంటి సుకుమారున కిట్టి నిబంధనలు పెట్టి ఇంతకాలము నిన్ను కష్ట పెట్టెను. ఇంతటి గురుజనయంత్రణ నెట్లు సహించితివి?) అని అనెను. ఇందు అమృతమొలుకు మాతృహృదయ పూర్ణ కుంభము సాక్షాత్కరించును.

మనోరమా విలాసవతు లిరువురును వైశంపాయన చంద్రాపీడుల నుభయులను తమ పిల్లలుగానే భావించిరి. మృత్యు ముఖుడై అచ్ఛోదమునకు ప్రయాణమైపోవు చంద్రాపీడుని వీరుభయులును తల్లడిల్లు పేద గుండెలతోనే సాగనంపిరి. చంద్రాపీడుని శరీరమును అప్యాయమానము చేయుచున్న కాదం బరిని విలాసవతి ఆదరించిన తీరుకూడా అట్టిదే. కొడుకు కొరకు అవతరించిన సంజీవనౌషధము కదా కాదంబరి? విలాసవతి ఆమెను ఆదరించకుండుటెట్లు ?

బాణుడు కన్న తల్లి ప్రేమను పొందలేక పోయినను పెంపుడు తల్లి ప్రేమను బాగుగా ననుభవించెను. వీరి పాత్రలయందు అతడా ప్రేమను చూచు కొని యుండెనేమో !

## కేయూరకుడు

కేయూరకుడు కాదంబరి వీణా వాహకుడు, వార్తాహరుడు, నర్మసచివుని వంటివాడు- అనగా అత్యంతాంతరంగికులలోని వాడని అర్థము. కుమారీ పురాంతఃపురమునందు ఇతనికి ప్రవేశ ముండుటకు కూడా అదే కారణము. కాదంబరి వద్దనుండి మహాశ్వేతకు సందేశము తెచ్చిన ఈతనిని కవి ఇట్లే వర్ణించెను.

చంద్రాపీడుడు మహాశ్వేతతో సంభాషించుచున్నప్పుడు రాజకుల సంపర్కచతురుడు షోడశ వర్షదేశీయుడు అగు కేయూరకుడు కాదంబరీ కథా రంగమున ప్రవేశించెను. అతని నేత్రములు కర్ణాంతాయతములు. ప్రత్యూషః కాలమునందు అతడు తన కన్నుల కాంతులతో దిక్కులను ధవళితము చేయు చున్నట్లు, కుముద వనములను దర్శింపజేయుచున్నట్లు, దినమునంతయు పుండరీక మయముగా చేయుచున్నట్లు అతని చూపులుండెను,

బాణుడు ఎడనెడ శ్వేతవర్ణమును శూద్రకుడు ధరించిన క్షౌమయుగళమును వర్ణించినపుడు, మహాశ్వేతను వర్ణించినపుడును, ఇతర వర్ణనమునందును పేర్కొనుటవలన అతనికా వర్ణనమునందుగల మక్కువ స్పష్టమగుచున్నది.

కేయూరకుడు మదభిన్నమగుగజమువలె మెలమెల్లగా అడుగులు వేయుచు వచ్చెను. అతని ఊరు దండద్వయమునకు గంధపుపూత పూసి దానిపైని కుంకుమ రాగమునలది యుండిరి. అతడు ఉత్తరీయమును ధరించలేదు. అత డనుచరుడనుటకు ఇది చిహ్నము. నడుమునకు కట్టిన బంగారు గొలుసు చుట్టును ఉన్న బంగారు పల్లవములు కదలాడుచుండెను. విశాల వక్షఃస్థలము, బల్లపరచినట్లు పలుచని ఉదరము, సువిభక్తమగు మధ్యము, కండలు తిరిగిన బాహువులు, ఎడమచేతికి మాణిక్యవలయము, ఒకే చెవికి పెట్టుకొన్న కర్ణాభరణమునందలి మణుల ప్రభలు, భుజముమీద యింద్ర ధనుస్సుసు పరచినట్లుపడి అర్ధకపు పైపంచను వేసుకొనెనా యన్నట్లుండెను. మామిడి చిగురుటాకువంటి అతని అధరము తాంబూల రాగాంధకారమై యుండెను.[1]

ఇతనిని చంద్రాపీడుని చరణ సంవాహకునిగా, అనుచరునిగా కాదంబరి నియమించెను. కాని ఇతనితో పోల్చినపుడు కాదంబరి సఖి మదలేఖ మాటకారి, నిపుణ. వీరిరువురును కాదంబరికి అంతరంగికులే. అందువలననే కేయూరకుడు కాదంబరి వర్తమానమును తీసికొని స్కంధావారమునందు విడిసియున్న చంద్రాపీడునికి అల్లంత దూరము నుండి తన తల భూమిని స్పృశించునట్లు పాదాభివందనము చేయుటకు ముందున కురికెను. కేయూరకుని చంద్రాపీడుడు తొలుత అపాంగములతో, ఆపైన హృదయముతో, దాని మీదట రోమోద్గమముతో, తరువాత భుజములతో ఆలింగనముచేసికొని, సంభావించి, రహస్యముగా కాదంబరిని గూర్చిన కుశల ప్రశ్నల నడిగెను.

కేయూరకుడు కాదంబర్యవస్థాంతరమును ఆమె ప్రతికదలికను వర్ణించిన తీరుకూడ అతని ప్రాధాన్యమునే నిరూపించును. కాని ఈ వర్ణనముతో పత్రలేఖ చేసిన కాదంబర్యవస్థావర్ణనమును పోల్చిచూచినపుడు పత్రలేఖ విశిష్ట వ్యక్తిత్వము, ఆమె సూక్ష్మ నిశిత పరిశీలన, ఆమెవెంట కాదంబరి తన సందేశమును

---

1. కా.కా. పుట. 274,272,273

పంపినతీరు చాలగొప్ప స్తరమునకు చెందినవని తోచకపోదు. పత్రలేఖవెంట హేమకూటమునుండి ఉజ్జయినికిని, ఉజ్జయిని నుండి హేమకూటమునకును తిరుగుచున్న కేయూరకుని పాత్ర చంద్రాపీడుని ప్రాణత్యాగముతో అంతమొందును.[1]

*తరలిక:-* మహాశ్వేతకు తాంబూల కరంక వాహిని తరలిక. ఈమె మహాశ్వేతను ఎల్లప్పుడును నీడవలె అనుసరించి ఆమె కష్టసుఖములను పంచుకొన్నది. మహాశ్వేతా పుండరీకుల ప్రణయ సందర్భమున పుండరీకుని అవాంతరమృతి యెడల మహాశ్వేతకు పరితాపము కలిగినపుడు తరలిక ఆమెకు అండదండగా నుండెను. మహాశ్వేత వ్రతదీక్షను వహించి యోగినీ జీవితమును గడుపునప్పుడు కూడ ప్రతిచోట ఆమె వెనుక తరలిక పాఠకులకు దర్శనమొసగుచునే యుండును.

*మేఘనాథుడు:-* కాదంబరికి కేయూరకు డెంతో చంద్రాపీడునకు మేఘనాథుడును అంతియే. ఈతడు యువరాజునకు ఆంతరంగిక పరిచారకుడు.

1. కా. కా. పుట 315.

# బాణుని శైలి

ప్రసిద్ధ కావ్యశాస్త్ర వేత్తలు, ఆలంకారికులు బాణభట్టు కాదంబరీ రచనలో పాంచాలీరీతిని అవలంబించెనని యందురు. ఈ రీతి వైదర్భివలె అతి పేశలము కాక, గౌడీరీతివలె నారికేళపాక కఠినముకాక, సమాసభూయిష్ఠమై, శ్లేషశ్లిష్టమై, బిగువైన అల్లికతో పాఠకుని మనస్సును ఉర్రూత లూగించుచుండును. బాణుడు పుట్టుకచే మగధదేశీయుడై తనవారగు గౌడులకు సహజమైన అక్షర డంబరమును, స్థానేశ్వర రాజాశ్రయమునందు పెరిగి కావ్య రచన చేసినందులకు ఔత్తరాహుల కిష్టమయిన శ్లేషను, దాక్షిణాత్యులు ఆదరించి తనియించిన ఉత్ప్రేక్షను సమానముగా లాలించి అచ్చటచ్చట భావావేశము కలిగినప్పుడు ఒక మాటను సూటిగా క్లుప్తముగా చెప్పదలచుకున్నప్పుడు ప్రతీచ్యులవలె అర్థమాత్రమున అభిధావృత్తితో ఉట్టంకించుచు చిట్టి చిట్టి వాక్యములను రచించుచు యావద్భారత రచయితలకు ప్రతినిధి అయ్యెను. ఈతని శైలి భారతీయులందరికిని ఉపాదేయమయ్యెను. కాళిదాసెవ్వరో ఏ దేశమువాడో తెలియక ప్రతి ప్రాంతము వారును అతడు తమవాడే అనుకొని కథల నల్లగా బాణుడెవ్వరో కచ్చితముగా తెలిసినను ప్రతి సహృదయుడును అంతరాంతరములయందు ఇతడు తనవాడే యనుకొనును. ఇది మహాకవి చదువరులపై ప్రయోగించు మంత్రదండము. ఇక్కడ దేశ కాల పాత్రల వ్యవధానము అంతరించి కవితో చదువరి తాదాత్మ్యమును-పొంది అతడు సాధించిన రససిద్ధిని తాననుభవించి లీనుడై తల మునుకలగును. భగవద్దత్తములయిన గాలి, నీరు, అగ్ని, నదులు, సముద్రములు మనిషికి ఉచితముగా లభించినట్లే ఈ కావ్యామృతానందము కూడా పఠితలకు ఉచితముగా లభించునదియే. దీనిని పొందలేనివాడే దౌర్భాగ్యుడు. హతవిధి. పొందగలిగిన వానికి తేనెకన్న కలకండ పలుకులకన్న చెరుకు రసముకన్న ఈ మహాకవి పలుకులు తీయగా నుండి తాత్కాలికముగ నైనను ఆహార నిద్రలను మరపించి ''కాదంబరీ రసజ్ఞానాం ఆహారోపినరోచితే'' అని అనిపించును. కాదంబరి కథ విన్నవారిది పాడియావు, కథ విననివానిది బోడియావు.

పాశ్చాత్య విమర్శకులు బాణుని శైలి దుర్గమమగు భారతీయ అరణ్యము వంటిదనియు, ఇందు చొచ్చుకొని పోవుటకు మార్గము చేసికొనుటకు తోవలో ఎన్నో చెట్లను ఖండించుకొనుచు పోవలెననియు అప్పటికిని అతి క్లిష్టమయిన అలంకారముల రూపమున ఏదో క్రూరమృగము పైబడినట్లు భయభ్రాంతులు కలుగునని వర్ణించినను ఆ అభిప్రాయమును భారతీయ విమర్శక హృదయము ఆమోదించలేదు. బాణుని తరువాత కాలములో వచ్చిన సంస్కృత సాహిత్యము, దేశభాషా సాహిత్యములు కాదంబరీ రసప్లావితములయ్యెను. వీనితో ప్రమేయము లేక నిష్పాక్షిక దృష్టితో ఈ గ్రంథమును చదువుట కారంభించిన ప్రతి భారతీయునకును ఇందలి అత్యద్భుత సన్నివేశములు కొబ్బరినీటి వంటి స్వచ్ఛమైన భాష భావనా వైభవము సంప్రదాయ శుద్ధి, అన్నింటికీ మించిన అవ్యక్త కావ్యానందము భాసించి బాణభట్టు మేధాశక్తిముందు నమోవాకములు సమర్పించవలెనని అనిపించును. పాశ్చాత్యుల విమర్శ కేవలము అక్షరడంబరముననే పరిమితమయిన కావ్యశిల్పము కలవారి రచనలకు చెల్లును. బాణుని కావ్యాత్మను దర్శించిన వారెవ్వరును అతనినావిధముగా విమర్శింప నేరరు. పైగా ఉత్ప్రేక్ష, పరిసంఖ్య శ్లేషాద్యలంకారములతోబాటు బాణుని రచనయందు స్వభావోక్తిమయ వర్ణనములు, సుభాషితములు, ఉపదేశములు, కథనరీతి చాలా చోట్ల పాఠకుల అలసటను పోగొట్టును. ఇక్కడ పులులు గాని సింహములు కాని, అరణ్యములు కాని కన్పించవు, కొన్నిచోట్ల క్లిష్టమయిన అతని రచనను చూచి కాదంబరీ శైలిని గర్హించుట న్యాయముకాదు.

భారతీయులీతని శైలిని ఇట్లు పొగడిరి;-

'రుచిర స్వర వర్ణ పదా రస భావవతీ జగన్మనోహరతి,
తత్కింతరుణీ, న హి న హి వాణీ బాణస్య మధుర శీలస్య'

బాణుని ధర్మదాసుడు 'విదగ్ధముఖమండలము'నందు పైన చెప్పిన విధమున స్తుతించెను. (అందమైన స్వరము, వర్ణము, పదమును కలిగి రసభావవతియైనది తరుణికాదట. మధురశీలుడైన బాణుని వాణియట.) అట్లే గోవర్ధనాచార్యుడు.-

'జాతాశిఖండినీ ప్రాక్ యథా శిఖండీ తథావగచ్ఛామి,
ప్రాగల్భ్యమధిక మాప్తుం వాణీబాణో బభూ వేతి'

(వాణియే పర్ణవ్యత్యయమువలన బాణుడయ్యెను.) సుబంధువు, బాణభట్టు, కవిరాజు అను నీ ముగ్గురును వక్రోక్తి (చమత్కారోక్తి) నిపుణులని

రాఘవ పాండవీయకారుడు చెప్పగా జయదేవుడు పతితల హృదయమునే వసతిగా కల్పించుకొన్న పంచబాణుడని బాణుని స్తుతించెను మధ్యయుగ సాహిత్యశైలికి బాటలు వేసిన బాణభట్టుని కవి పండితలోకము ముక్త కంఠముతో స్తుతించెను. గద్యమునకు సాహిత్య స్థాయిని కాకమ్మ పిట్టమ్మ కథకు కథాచూడామణి పదమును కల్పించిన వాడితడు. ఇదే నైపుణ్యముతో తన కొడుకునందలి సాహిత్య పిపాసను గ్రహించి అతనిని తీర్చిదిద్ది తనయంతటి వాడిని చేసికొని భూషణభట్టు చేతకూడాస్తుతినీ రాజనమును పట్టించుకున్న ధన్యజీవి బాణుడు.[1] భూషణభట్టు తనలోగల రచనా సామర్థ్యమునకు తన తండ్రి ప్రభావమే కారణమని చంద్ర కిరణములచే చంద్రకాంతమణి ద్రవించినట్లు తన హృదయముకూడా తండ్రి వచనముల ప్రభావముచే ద్రవించెననియు, చిన్న చిన్న ఏరులు గంగలో కలిసి తన్మయములై సముద్రము వరకు పయనించగల యోగ్యతను సంపా

1. కా : ఉత్తర భాగము : భూషణభట్టుని అవతారికా శ్లోకము 4—
   (i) అర్యం యమర్చతి గృహేగృహయేవ లోకః పుణ్యైః కృతస్య యత ఏవ మమాత్మ లాభః
   సృష్టైవ యేన చ కథేయ మనన్యశక్యా వాగీశ్వరం పితరమేవ తమానతోస్మి—(3)
   (ii) యాతే దివం పితరి తద్వచసైవ సార్ధం విచ్ఛేదమాప భువి యస్తు కథాప్రబంధః
   దుఃఖం సతాం తదసమాప్తి కృతం విలోక్య ప్రారబ్ధం ఏవ సమయా న కవిత్వ దర్పాత్—(4)
   (iii) గద్యే కృతే ఽపి గురుణా తు తథాక్షరాణి యన్నిర్గతాని పితురేవ సమే ఽను భావః
   ఏక ప్లవామృత రసాస్పద చంద్రపాద సంపర్క ఏవ హి మృగాంకమణేః ద్రవాయ—(5)
   (iv) గంగాం ప్రవిశ్య భువి తన్మయ తాము పేత్య స్పృతాః సముద్రమితరా అపి యాంతి నద్యః
   ఆ సింధుగామిని పితుర్వచన ప్రవాహే క్షిప్తాకథాను ఘటనాయ మయాపివాణీ—(6)
   (v) కాదంబరీ రసభరేణ సమస్త ఏవ మత్తో న కించిదపి చేతయతే జనో ఽ యం
   భీతోఽస్మియన్న రసవర్ణవివర్జితేన తచ్ఛేషమాత్మవచసాప్యను సందధానః —(7)

దించుకున్నట్లే తన వాణి కూడా పితుర్వచన ప్రవాహమునందు కలిసి కృతార్థ మగుచున్నదనియు, కొలదిపాటి భయముతోనే తాను ఈ రచన కుపక్రమించితి ననియు, కాదంబరీ రసభరముచే తన చిత్తము మత్తెక్కి వేరేదియును తోచక ఈ పనికి ఉపక్రమించెననియు, మంచి బీజములను సారంతమయినభూమియందు నాటినట్లు తన తండ్రి కథా బీజములను వెదజల్లగా తత్ఫలములను తనయుడగు తాను పొందుచుండెననియు చెప్పి వేయినోళ్ళ బాణుని రసమయ శైలిని తన కవితా ధారతో స్తుతించెను. [1]

బాణుని రచనలో శబ్దార్థములు పరస్పరము భుజములు రాచుకొని పోటీ పడెననుట స్పష్టము. కథాముఖమును మాత్రమే చదివిన వారికి కూడా ఇతడు శబ్దబ్రహ్మను సాక్షాత్కరింపజేసుకొనెననియు సంకల్పమాత్ర వశవర్తియగు శబ్దము వెనుక ఇతని భావనాతరంగములు అలుగులుపారు స్రీటివలె, సెలయేటి వలె మధుర ధ్వనిని చేయుననియు తెలియును. ప్రతి శబ్దమును చెవియొగ్గి విని

1. (i) బీజాని గర్భిత ఫలాని వికాశభాంజి వప్త్రైవ యాన్యుచిత కర్మబలాత్కృతాని
ఉత్కృష్ట భూమి వితతాని చ యాంతి పుష్టిం తాన్యేవ తస్య తనయేన తు సంహృతాని. —8. ఉ. భా.

(ii) బాణుని శైలిని ఇతరులు ఇంకను ఈ విధముగా స్తుతించిరి.

(1) శశ్వద్బాణ ద్వితీయేన నమదాకారధారిణా...
ధనుషేవ గుణాఢ్యేన నిశ్శేషో రంజితో జనః —నలచంపువు 1.14.

(2) యుక్తం కాదంబరీం శ్రుత్వా కవయో మౌనమాశ్రితాః
బాణధ్వనావనధ్యాయో భవతీతి స్మృతిర్యతః—కీర్తికౌముదీ 1.15.

(3) శ్లేషేకేచన శబ్ద గుంఫవిషయే కేచిద్రసే చాపరేఽ —
లంకారే కతిచిత్ సదర్థవిషయే చాన్యే కథావర్ణనే
ఆ సర్వత్ర గభీరధీర కవితావింధ్యాటవీ చాతురీ
సంచారీ కవికుంభి కుంభభిదురో బాణస్తు పంచాననః —
శ్రీ చంద్రదేవుడు
—శ్రీ యం. ఆర్. కాలే ఉపోద్ఘాతమునుండి ఉద్ధృతము- పుట 36.

ఒక ధ్వనికి వేరొక ధ్వనికి గల భేదమును ఉత్తమ సంగీత కళాకారునివలె సాధించి ఇతడు రచన చేసెననియు ఇతని శైలి గద్యబంధములోను పరివృత్త్యసహిష్ణువు అనియు స్వనము అను స్థానమున రణితము, ధ్వని అను పదములను కూర్చినచో కాదంబరి శయ్యలోని అందము చెడిపోవుననియు అనిపించును. పద్యరచన యందు ఈతడు కుంఠిత ప్రజ్ఞుడు. శ్లేష, విరోధాభాసము, పరిసంఖ్య, శ్లేషానుప్రాణితోపమ మున్నగు అలంకారముల యందు ఈతడు సిద్ధహస్తుడు. రూపకము, ఉత్ప్రేక్ష ఇతనికి ప్రాణానికి ప్రాణములు. గాథాసప్తశతీకారులగు ప్రాకృత కవుల తరువాత ఉత్ప్రేక్ష కింతటి ప్రశస్తిని కల్పించినవారు లేనే లేరు. ఈతని రచనలయందు సతిసప్తమీ ప్రయోగములు సుదీర్ఘ సమాసములు షష్ఠీ విభక్తియొక్క అనంత ప్రయోగములు విస్తారములు. ఇంతటి క్లిష్ట రచనను చేసినను శబ్దచిత్ర బంధములు, ఒంటికాలి నడకలు (ఒకే అక్షరముతో వాక్య నిర్మాణము), అతడే ఉగ్గడించిన అక్షరచ్యుతక, మాత్రాచ్యుతక బిందుమతీ ప్రహేలికాదులను ఇతడు స్పృశించలేదు. అందువలననే ఈ రచనకు ఇంతటి రస పుష్టి కలిగినది. సుదీర్ఘములయిన ఈతని వర్ణనములు కథలోని ఒక మూలనుండి వేరొక మూలకు విస్తరించి కథా కథనమును కుంఠిత మొనర్చినను వర్ణనావైశిష్ట్యముతో ఇతడు పాఠకుల నాకట్టుకొనును.

'బాణోచ్ఛిష్టం ఉత్ప్రేక్షామయం, కథామయం వర్ణనమయంచ జగత్' అని చెప్పవచ్చును.

బాణుని కథామృతరసప్లావితము లయిన మనస్సులకు ఈ కథలోని ఎన్నో విషయములు బయలుపడును. ఎన్ని కోణముల నుండి దీనిని చదివిన అన్ని విషయములు బయలుపడును. ఒక వ్యక్తి ఒకసారి, ఒక సందర్భములో చదివి దీనిని గురించి చెప్పగలిగినది పరిమితము మాత్రమే. భాష దృష్ట్యా, శైలి దృష్ట్యా కూడా ఈ రచన విశిష్టము. ఉత్తరదేశపు ప్రాకృత భాషల పలుకుబడుల ప్రభావము, ఆతడే ఉగ్గడించిన కాళిదాసాదుల ప్రభావము అతనిపై పడినది. బృహత్కథను చదివి బాణుడెంత జీర్ణించుకొనెనో, పతంజలి మహర్షి చెప్పిన వాసవదత్తా, భైమరథీ, సుమనోత్తరలను ఎంతవరకు తనవిగా చేసుకొనెనో, ఇతిహాస మకుటమైన భారతమువలన ఎంత ప్రేరేపింపబడెనో, మధురస

గుళికలయిన సాతవాహన సప్తశతి గాథలనుండి ఎన్నిటిని గ్రహించెనో గణ నీయమైన కృషి చేసిన గాని బయల్పడని విషయములు.

బాణుడు గద్యమెట్లుండవలెనో తానేస్వయముగా చెప్పుకొనుచు 'ఉత్కృష్ట కవి గద్యమివ వివిధ వర్ణశ్రేణి ప్రతి పాద్య మానాభినవార్థ సంచయమ్' (వివిధ వర్ణములతో గద్యరచనయందు అర్థమెల్లప్పుడును కొత్త కొత్త పుంతలు తొక్క వలెను) అని గద్యరచన యనగా తన మనస్సులోనున్న ప్రమాణ దండమును చూపించును. ఇదేభావమును హర్ష చరితమునందలి అవతారికా శ్లోకముతో పేర్కొనెను.

'నవోఽర్థో జాతి రగ్రామ్యా శ్లేషోఽక్లిష్టః స్ఫుటోరసః,
వికటాక్షర బంధస్తు కృత్స్న మే కత్ర దుష్కరం'[1]

(కొత్త అర్థమును స్ఫురింప జేయుట, అగ్రామ్యవర్ణన ఫణితి, అక్లిష్టమగు శ్లేషలు, స్ఫుటమైన రసాభివ్యక్తి, భావమును ప్రతిధ్వనించు వికటోదార పద బంధములు— ఇవన్నియును ఒకేచోట కలసియుండి నవనవోన్మేష శాలిని యగు కవి ప్రతిభ ఉండుట దుష్కరము). దుష్కరమైన ఈ కావ్యశిల్పమును బాణుడు తన కథలో సాధించెననుట నిర్వివాదాంశము.

కథారచన మెట్లుండ వలెనో బాణుడే చెప్పుచు కాదంబరిలోనే—
'హరంతి కం నోజ్జ్వల దీపకోపమైః
నవైః పదార్థైరుపపాదితాః కథాః,
నిరంతర శ్లేష ఘనాస్సుజాతయో
మహాస్రజశ్చంపక కుడ్మలై రివ'[2]

అనును. (కొత్త కొత్త భావములతో, నిరంతర శ్లేషఘనము లైన మంచి వర్ణన ములతో దీపకోపమాద్యలంకారములతో కథ, దీపములవలె మెఱయు సంపెంగ మొగ్గలతో కలిపి ఒత్తుగా గుచ్చిన జాజిపూవుల దండవలె ఎంతో అందమైనదట)

---

1. హ. చ. శ్లో-8.
2. కా. అవ. శ్లో-9.

అట్లే రసము, శయ్య కథకు ప్రాణములని ఇతడు చెప్పెను. ఒక దీప కాలంకారము విషయము తప్ప తక్కిన అన్నింటిలోను బాణుడు తన ప్రతిజ్ఞను నిలుపుకొనెను[1]. అది అయినను అక్కడ సంపెంగ మొగ్గను దీప కళికతో పోల్చుటయే కవి ప్రయోజనము. ఈ శ్లోకముతోనే కవి మున్ముందు ప్రయోగించు శబ్దానుప్రాణితోపమలు ఆరంభమగును. ఇట్టి ఉపమలు కవులు చేసిన సాము గరడీలనే చూపించును. ఇందు ఉపమానోపమేయముల సాధారణ ధర్మము భావబద్ధము కాక శ్లిష్టము లైన పదముల సాధర్మ్యమును అన్వయించుటలోనే దాని కర్తవ్యము పరిసమాప్తమగును. అయితే ఇంతకు దీటైన సహజోపమలను చెప్పుటలో కూడ బాణుడు దిట్టయే. చంద్రబింబమును ఇతడు నిద్రామంగళ కలశమని చెప్పుట, ఇతని సహజోపమ వర్ణనమునకు గొప్ప తార్కాణము.

బాణుని శైలికి రెండు మచ్చుతునకలను గ్రహించి చూతము:—

1) అథచలతి మహీపతా వన్యోన్య మతిరభస సంచలన చాలితాంగద పత్రభంగమకరకోటిపాటితాంశుకపటానాం, ఆ క్షే ప దో లా య మా న కం ఠ దామ్నామ్, అం స స్థ లో ల్ల సి త కుంకుమపటవాసధూలిపింజరితదిశామ్, ఆలోల మాలతీ కుసుమ శేఖరోత్పతదలి కదంబకానామ్, అర్ధావలంబిభిః కర్ణోత్పలైశ్చుంబ్యమానగండస్థలానామ్, గమన ప్రణామలాలసానామ్ అహమహమికయా వక్షఃస్థల ప్రేంఖలిత హారలతానామ్ ఆసీదతి మహాన్ సంభ్రమో మహీపతీనామ్.[2]

యస్య చ మదకలకరికుంభపీఠపాటనమాచరతో లగ్నస్థూలముక్తాఫలేన దృఢముష్టినిపీడనాన్నిష్ఠ్యూత ధారా జలబిందు దంతురేణేవ కృపాణేనాకృష్యమాణా, సుభటోరః కపాట విఘటితకవచసహస్రాంధకార-మధ్యవర్తినీ, కరికరట తటగలిత మదజలాసార దుర్దినా స్వభిసారికేవ సమరనిశాసు సమీప మసకృదాజగామ రాజలక్ష్మీః [3]

మొదటిది శూద్రక మహారాజు ఆస్థానమండపములో సభను చాలించి కదలగనే అతనిని కొంచెము దూరమైనను అనుసరించ వలెనని బయలుదేరిన

1. కా. అవ. శ్లో-8.
2. కా. కా. పుట 28, 29.
3. కా. కా. పుట. 18.

సామంతరాజుల సంభ్రమమును వర్ణించును. ఇందొకే సంభ్రమ క్రియకు రాజుల అనేక హావభావ విశేషములు జతపరుపబడినవి. రెండవది శూద్రకునిని రాజ్య లక్ష్మి అభిసారికా రూపములో వరించుట. ఇందన్వయము దూరము, క్లిష్టము. 'మదగజముల గండస్థలములను శూద్రకుడు కృపాణధారుడై భేదించగా అందంటుకొనిన ముక్తాఫలములు కత్తి పిడిని గట్టిగా పిడికిట పట్టుట వలన కారిన చెమట బిందువులవలెనుండగా, అట్టి కృపాణధార రాజ్యలక్ష్మి నాకర్షించగా, భటుల కవచములు చీలి యుద్ధరంగము లోపడి ఆ ప్రాంగణమును అంధకారితము చేయగా గజముల మదజల వర్షము మధ్య సమరనిశలలో ఆ రాజ్యలక్ష్మి అభిసారిక అయి శూద్రకుని వరించెనట.

ఇదే లేఖినితో బాణుడు శుకశిశువు చేత 'నాస్తి జీవితాదన్యదభిమతతర మిహజగతి సర్వజంతూనాం...' అని చెప్పినపుడు, చంద్రాపీడుడు 'దేవి, కింబ్రవీమి ? బహుభాషిణే న శ్రద్ధదాతి లోకః స్మర్తవ్యోస్మి పరిజనకథాసు' [1] అని అన్నప్పుడు జాబాలి మహామునిని దర్శించిన శుకశిశువు 'పుణ్యాని హి నామ గ్రహణాన్యపి మహాత్మనాం కిం పునర్దర్శనాని' అన్నప్పుడు ఇంత లలితముగా రచించగల ఈ కవియా అంతక్లిష్ట పదగుంభనము చేసినదన్న ప్రశ్న చదువరులకు మెఱుపువలె స్ఫురించును.

ఈ శైలిని విశ్లేషించి చూచినపుడు వర్ణనలు చేయునప్పుడితడు తన శిల్పమును, చమత్కారమును చూపించుననియు, సంభాషణ వార్తాలాపములు జరిపించునపుడు హృదయమునకు నాటుకొనునట్లొక రసమును గాని, భావమును గాని ఆవిష్కరించుననియు, కేవలము స్వభావోక్తిని, వైదర్భీరీతిని ఆశ్రయించి ఆ వార్తాలాపములను సంస్కృతము కొలదిగా వచ్చినవారికినీ అర్థమగునట్లు రచించుననియు, వాక్యమెంత చిన్నది అయితే దానివెనుక అంతటి భావావేశమును చూడవచ్చుననియు తోచును - ఈ రెండు విధముల వాక్యముల మేలు కలయికయే కాదంబరీ రచనా విన్యాసములోని గొప్పదనము. ఈ లఘు వ్యాకములే లేకున్న కాదంబరిలో ఇన్ని సుభాషితములు, అతియుక్తులు ఉండెడివికావు.

---

1. కా.కా. పుట: 314.

## ఉదాహరణ కావ్యము

తెలుగు సాహిత్యములోను, సంస్కృతములోను ఉదాహరణ కావ్య సంప్రదాయము వెలసినది.

ఒక వ్యక్తిని వర్ణించునపుడు ప్రథమావిభక్తినుండి సప్తమీవిభక్తి వరకు ప్రతి విభక్తిలోను వరుసక్రమమును పాటించుటయే ఉదాహరణ కావ్యము. బహుశః ఈ స్వరూపమును తొలిసారి చెప్పినవాడుకూడ బాణుడేనేమో !

ఈ క్రింది తారాపీడుని వర్ణనము ఈ విషయమునే సమర్థించును:-

'యస్తమః ప్రసరమయేన వపుషా పాప బహులేన చాలితమామూలతో ధర్మం దశాననేనేవ కైలాసం పశుపతి రివావష్టభ్య పునరపిస్థిరీచకార,

'యంచ రతి ప్రలాపజనిత దయార్ద్ర హృదయ హరనిర్మితమపరం మకరకేతు మమం స్తలోకః......

'యేనచానేక రత్నాంశు పల్లవితే వ్యాలంబిముక్తా ఫలజాలకే......
'యస్మైచ మన్యేసురపతిరపి స్పృహయాంచకార......
'యస్మాచ్చ ధవలీకృత భువన తలాః......నిర్జగాను గుణగణః
'యస్యచ......ముఖరిత భువన మభ్రామ్యత కీర్త్యా......
'యస్మింశ్చ గిరీణాం విపక్షతా'[1]......

ఇది బాణుని శైలిలోని ఒక విశిష్టత. దీనినే తరువాతి సంస్కృత కవులు దేశ భాషలలోని కవులు అనుకరించిరి. వైష్ణవాళ్వారులలో ఒకరయిన కులశేఖరులు తమ ముకుందమాలా స్తోత్రములో ఈ ఉదాహరణ కావ్యశైలిని అనుకరించిరి

'కృష్ణో రక్షతు నో జగత్త్రియగురుః కృష్ణం నమస్యామ్యహం
కృష్ణేనామ రశత్రవో విని హతాః కృష్ణాయతస్మైనమః,
కృష్ణాదేవ సముత్థితం జగదిదం కృష్ణస్య దాసోఽస్మ్యహం
కృష్ణేతిష్ఠతి జీవలోక మఖిలం హేకృష్ణ రక్షస్వమామ్'

అష్టాదశ వర్ణనములు:- కాదంబరి కథలో బాణుడు ఉజ్జయినీ నగర

1. కా.కా. పుట: 94.

మును, కైలాస శైలమును, ప్రావృట్కాలమును, చంద్రోదయ సూర్యోదయములను, మహాశ్వేతాశ్రమోపకంఠమునందలి ఉద్యాన వనమును, చంద్రాపీడ కుమారోదయ వర్ణనమును, కాదంబరీ చంద్రాపీడుల విప్రలంభమును, వివాహమును, చంద్రాపీడుని దిగ్విజయ యాత్రను, మృగయను వర్ణించెను. ఇందు జల క్రీడా వర్ణనము, సముద్ర వర్ణనము మాత్రము లేవు. మహాశ్వేతా కాదంబరీ వర్ణనములలోను, శుకనాసోపదేశముతోను కవి అతనికతడే సాటి యనిపించుకొనును. సరోవరాదులలో, సూర్యోదయ చంద్రోదయ నిశాముఖాదుల వర్ణనములో, చండికాద్రవిడధార్మికుల వర్ణనములలోను, అటవీ వర్ణనములోను, పాత్ర చిత్రణమునను అతని ప్రతిభ కన్పించును. పత్రలేఖ వెంట తన సందేశము పంపించు కాదంబరి యొక్క వర్ణ చిత్రము అమోఘము.

## శ్లేషానుప్రాణితోపమ :

కాళిదాస భారవి మహాకవుల కాలము వరకును ఉపమ అనగా, ఉపమానోపమేయములకు మధ్యనున్న సమాన ధర్మమును ప్రతిభావించుట. ముఖము చంద్రునివలె నున్నదనుటలో చంద్రునిలోని చల్లదనమునకు కాంతికి సంబంధించిన అనుభావము ముఖమును చూచినప్పుడును కలుగుట. ఇట్టి ఉపమానములు వ్యాస వాల్మీకి కాళిదాసాదులలో కోకొల్లలు కాగా, బాణుడు శ్లేషయందు తనకు గల మక్కువతో ఆ సమాన ధర్మమును అర్థతః కాక శ్లేషతోనే అన్వయించెను. కాదంబరి అవతారికా శ్లోకములలోనే అట్టి ఉదాహరణములు కలవు.[1] వింధ్యాటవీ వర్ణనములో కవి 'కర్ణీసుత కథేవ సన్నిహిత విపులాచలాశశోపగతాచ..., అమృత మథనవేలేవ శ్రీద్రుమోపశోభితా వారుణీ పరిగతాచ, ప్రావృడివ ఘనశ్యామలానేకశతహ్రదాలంకృతాచ, చంద్రమూర్తిరివసతత మృక్షసార్థానుగతా హరిణాధ్యాసితాచ,... జానకీవ ప్రసూత కుశలవా నిశాచరప్రతిగృహీతాచ ... బాలగ్రీవేవ వ్యాఘ్రనఖపంక్తిమండితా గండకాభరణాచ...' అని చెప్పెను. (వింధ్యాటవి కర్ణీసుత కథవలె దగ్గరనే పెద్ద కొండను కలిగి, కుందేళ్ళతో సమృద్ధమయినదట. కర్ణీసుత కథలో ఆతని మంత్రి అనుచరులు అయిన విపులఅచలశశనామధేయులుండుటయే ఈఉపమకు మూలము. పైగా వింధ్య పర్వతమునకు అడవిలోని కుందేళ్ళకు పొత్తు ఏమిటో తెలియదు.

1. కా. క. అవ. పుట. 8, 9, 15.

అమృత మథన వేళ శ్రీదేవితో, కల్పద్రుమముతో, వారుణి (సుర)తో శోభిల్లి నట్లు వింధ్యాటవి శ్రీద్రుమములయిన అశ్వత్థ బిల్వాదులతో దూర్వాగ్రాసముతో కూడి యున్నదట. వర్ష ఋతువు ఘనములచే నల్లనిదయి పెక్కు మెఱుపుతీగ లతో మెరసినట్లు ఈ అడవి దట్టముగా పెరిగిన శ్యామలాశ్వత్థములతో, నూర్ల కొలది కొలనులతో శోభిల్లునట. చంద్రమూర్తి ఋక్ష సార్థముతో అనగా నక్షత్ర ములతో కూడియున్న హరిణానుగతుడు. అట్లే వింధ్యాటవిలో గూడ ఋక్ష సార్థము అనగా ఎలుగుబంట్ల గుంపులు జింకలు కలవు. సీతాదేవి కుశలవులను ప్రసవించి నిశాచరులచే పట్టుబడగా ఈ అడవి కుశలవులను అనగా గడ్డి పోచ లను ప్రసవించి రాక్షసులకావాస స్థానమయ్యెను. చిన్న పిల్లల మెడ పులి గోర్లతో గండకాభరణములతో ప్రకాశించినట్లే ఈ అడవి కూడ పులుల గోర్లతో, ఖడ్గ మృగములతో ఒప్పుచుండెనట.) ఈ వర్ణనములో అభంగశ్లేష సభంగ శ్లేషలలో బాణుడు భావదారిద్ర్యము లేకుండుటచే రెండ్రెండు విశేషములను 'ప్రసూత కుశలవా నిశాచర పరిగృహీతాచ' వంటివానిని ఉపయోగించెను.

## పరిసంఖ్యాలంకారములు :-

కథాముఖము ఎత్తుగడలోనే కవి 'యస్మింశ్చ రాజని జితజగతి, పరిపాల యతిమహీం, చిత్రకర్మసువర్ణసంకరాః, రతేషు కేశగ్రహాః, కావ్యేషు దృఢబంధాః, శాస్త్రేషు చింతా...శార్యేక్షేషు శూన్యగృహాః, ప్రజానామాసన్.' (ఆ రాజు పరిపాలనలో వర్ణసంకరము చిత్రకర్మలలోనే, సంఘములో కాదు అనునది గమ్యార్థము. అట్లే రతిలో కేశగ్రహములు ముష్టియుద్ధములలో కాదు. కావ్యములలో దృఢ ఖడ్గాది బంధములు మనుష్యులకు కాదు. శాస్త్రార్థములలో చింతనము మనుష్యులలో గాదు. అట్టచెమ్మలలో శూన్యగృహములు ఉండెనట)

సాధారణముగా ఈ పరిసంఖ్యను రాజుల ఆదర్శ పరిపాలనమును వర్ణించునపుడే వాడినందున ఇందు చెప్పు విషయములన్నియును సహజములుగా నున్నవి.

## శబ్దముల వివేచనము :-

బాణుని చెవి ఎంత సున్నితమయిన ధ్వనికైనను ఒగ్గి ఒక ధ్వనికి వేరొక ధ్వనికి మధ్యనున్న భేదమును గ్రహించగలదనుటకు రెండు ఉత్తమ ఉదాహరణల నివ్వ వచ్చును

శబరుల వేట ప్రారంభముకాగానే 'అనులేపనార్ద్రి మృదంగ ధ్వని దీర్ఘ మయిన' *సింహనాదముతో*, "జలధర రసితానుకారి" (మేఘ-గర్జనము) అగు గజయూథపతుల *కంఠగర్జితముతో*, వేటకుక్కలు వెంబడి తరిమి అంగములను నాకివేయగా జింకలుచేయు కరుణ *కూజితముతో*, యూథపతులు చనిపోగా చెవులు టిక్కించి వినుచు ఆగి ఆగి ముందుకుపోవు ఆడ ఏనుగుల *ఛీత్కారముతో*, అప్పుడే ప్రసవించి భయముతో పరిగెత్తుచు తమ పిల్లలను పోగొట్టుకొన్న ఖడ్గమృగముల *ఆక్రందనముతో* చెట్ల మీదినుండి క్రిందపడ్డ పక్షుల *కోలాహలముతో*, భూమిని కంపింపజేయు వేటగాండ్ర *చరణశబ్దముతో*, కర్ణాంతాకృష్టములై వదలిపెట్టబడిన బాణములు భూమిపై పడుచుండగా పక్షుల కలకలముతో గూడిన *ధనుర్నినాదముతో*, గాలి తాకిడికే అల్లనల్లనాడు ఖడ్గధారలు బట్టల పీపులపైబడి చేసిన *రణితముతో* *కుక్కురధ్వానితో* ఆ అరణ్యము ప్రచలితమయ్యెనట.

అట్లే రాజు ఆస్థానమండపము నుండి లేవగనే చామరగ్రాహిణుల నూపుర *రవమునకు* భవన కలహంస లాకర్షింపబడెనట. వార విలాసినీ జనము సంచరించగా, వారి వడ్డాణములకు వ్రేలాడిన రత్నమాలికలు ఒకటితో ఒకటి ఒరసికొని *ఝుంకారము* చేసెనట. నూపురమున కాకర్షింపబడిన కలహంసలు మెట్లను ధవలితము చేసి కోలాహలము చేసెనట. కంచుమ్రోగినట్లు గృహ సారస కూజితము దీర్ఘమయ్యెనట. సరభసముగ నడచుచు భూమిని కంపింపజేయు సామంతరాజుల కాలిధ్వని మిన్ను ముట్టెనట. ప్రతీహారులు చేత వేత్రదండమును పట్టుకొని 'ఆలోకయతాలోకయత' (చూడుడు చూడుడు) అని అరవగనే వారి చప్పుళ్ళు భవన ప్రాసాద కుంజమునందు ప్రతిధ్వనించి ఇంకా *దీర్ఘ*ము లయిన వట. రాజునకు ముందు సంభ్రమముతో బోర్లబడి సామంతరాజులు నమస్కరింపగా మణి శలాకల వలన విషమములయిన వారి కిరీటకోటులు (చివరలు) మణికుట్టిమము మీద రాచుకొని *స్వనము* చేసెనట. వారు నమస్కరించువేళ పక్కకు తొలగిపోయిన మణికర్ణపూరములు భూమి మీద పడి *రణ రణ* నినాదము చేసెనట. 'జయ', 'జీవ' అని పలుకు మంగళపాఠకుల *కలకలము* దిగంతములకు వ్యాపించెనట. ఇంతటి సంరంభమునకు భయపడి పూలను విడిచి తుమ్మెదలు *హుంకారము* చేసెనట. రాజుల భుజకీర్తుల మణులు రత్న స్తంభములకు రాచుకొని *రణితము* చేసెనట. ఇది బాణునికి క్రియల ప్రయోగముపై నున్న ప్రభుత.

## శూద్రక వర్ణనము :-

మన సంప్రదాయములో మనుష్యుని వర్ణించునపుడు కాలిగోరునుండి శిరము వరకును, దేవతను వర్ణించునపుడు శిరస్సులోని పాపటరేఖతో మొదలుపెట్టుకొని పాదయుగవర్ణనముతోను ముగించుట కలదు. శూద్రకుని వర్ణనము ఆపాదమస్తకము. సౌందర్యలహరిలో శంకరాచార్యులవారు 'ఆశిరః పాదము' పార్వతి సౌందర్యమును వర్ణించుచూ 'నమోవాకం బ్రూమో నయనరమణీయాయ పదయోః' అని ముగింతురు. ఇందుకు భిన్నముగా అన్నమయ్య వేంకటేశ్వరుని ఆపాద మస్తకవర్ణము చేయుట గూడా సహృదయులెరిగిన విషయమే.

విద్యాభ్యాసానంతరము పురప్రవేశము చేయు చంద్రాపీడుని చూచిన పౌర వనితల సాత్త్విక భావములు పౌరు లతనిపై కురిపించు లాజవర్షాదులు అశ్వఘోషదుకాళిదాసాదుల కావ్యపరంపర ననుసరించి చేసినవే. ప్రతి గోపిక కృష్ణుడు పరమాత్ముడని తన ప్రియుడని భావించి సర్వమును విస్మరించి తద్భావనా భావిత అయినట్లే ప్రతి ప్రౌఢపౌరాంగన చంద్రాపీడుని జగన్మోహనాకృతిని చూచి తనను తాను మరచిపోయినట్లు కవి వర్ణించెను.

## ముక్తపదగ్రస్తము :

ఒక వాక్యము ఏ పదముతో అంతమగునో అదే పదముతో మరియొక వాక్యము నారంభించు పద్ధతిని ముక్తపదగ్రస్త మందురు. ఇది అంత్యాక్షరి కన్న విశుద్ధ విశిష్ట ప్రక్రియ. బాణుని ముక్తపదగ్రస్త బంధమును దర్శించుకొందము,

'తస్యాంచ ప్రమదవన వేదికాయాం మణిస్థూణావష్టంభాస్థితాముహూర్త మివకుద్యేన సహదీర్ఘకాల మవధార్య కిమపి వ్యాహర్తుమిచ్ఛన్తీ నిశ్చల ధృత తారకేణ నిష్పంద పక్ష్మణా చక్షుషా ముఖంమే సుచిరం వ్యాలోకయత్, విలోకయంత్యేవ చ కృతసంకల్పా మదనాగ్నిం ప్రవేష్టుమిచ్ఛన్తీ సస్నావివ స్వేదాంభసాऽऽతని, స్వేదాంభసాऽऽత సేవ తరకీకృతాసమకంపత, కంపితాంగీచ పతన భియేవాగృహ్యత విషాదేన.

కాదంబరి పత్రలేఖతో తన ప్రియునికి సందేశమును పంపుట కుద్యుక్తయై ప్రమదవన వేదికయందు మణిస్తంభము నానుకొని స్థిత అయ్యెను (నిలిచెను.) అట్లునిలిచి ఏదో ఒక మాట చెప్పదలుచుకొని కనురెప్పలల్లార్పక కనుపాపకదధ

ల్చక కొంతసేపు పత్రలేఖ ముఖమును చూచును, చూచుచునే మదనాగ్నిని ప్రవేశింప గోరియో అన్నట్లు స్వేదాంభస్స్రోతమునందు స్నానము చేసిన దాయెను. స్రోతస్సు (ప్రవాహము) యొక్క వేగమునకా అన్నట్లు కంపింప దొడగెను. కంపితాంగియై పడిపోవుదునన్న భయముతో గాబోలు విషాదమునవలంబించెను.

ఈ ముక్తపదగ్రస్తమునందు వ్రీడావతి అగు నాయిక ఎన్నెన్ని సాత్త్విక భావముల ననుభవించునో క్రమముగా నుపనిబద్ధమై యున్నది.

## విరోధ, తదాభాసములు :-

వింధ్యాటవీ వర్ణనమునందుకవి 'అపరిమిత బహళపత్ర సంచయాపి సప్తవర్ణ భూషితా, క్రూరసత్వాఽపి మునిజన సేవితా పుష్పవత్యపి పవిత్రా' అని చెప్పెను (ఈ అడవిలో ఎన్నో పత్రసంచయములున్నను ఇదిమాత్రము సప్తవర్ణవృక్ష భూషిత, ఇందు క్రూరజంతువులున్నను మునిజనులు సైతమీ ప్రాంతమునందు నివసింతురు. ఇది పుష్పవతి అయినను (పుష్పములు గలది, రజస్వల) పవిత్రమయినది)

ఇందు సప్తపర్ణ, పుష్పవతి, క్రూరసత్త్వ శబ్దములకు అభంగశ్లేషవలన కవి విరోధాభాసాలంకారమును సాధించెను. ఈ అలంకారము బాణుని పాండిత్య విభవమునకొక మచ్చుతునక మాత్రమే. 'మహాద్వారమపి దుష్ప్రవేశం అవంతీ విషయగతమపి మగధజనాధిష్ఠితం, స్ఫీతమపి భ్రమన్నగ్నలోకం' అని రాజకులమును వర్ణించు తీరులో గూడా విరోధమే స్ఫుటమగుచున్నది. (రాజకులమునకు మహా ద్వారమున్నను అది దుష్ప్రవేశము. అది అవంతీ దేశమున నున్నను మగధ జనము-వందిమాగధులచేత నిండియున్నది. సమృద్ధమయినను నగ్నజనముచే నిండి యున్నది.

బాణుని ఉత్ప్రేక్ష యొక్క అందచందములను రూపకముల రామణీయకమును అతని ప్రకృతి వర్ణనమునందు చూడవచ్చును.

ఇతని శైలిలో మరియొక విశిష్టత లలిత లలితములైన పదములను పునరుక్తముచేసి ఒక అవ్యక్తమైన మాధుర్యమును కల్పించుట. శుకశిశువు తన కథను శూద్రకునితో చెప్పుచు ఇట్లనెను ;

'చంచు పుటేన దత్వా దత్వా——క్షపయంతిస్మ తస్మిన్ వనస్పతౌ అతివాహ్య అతివాహ్యరజనీం ---- ప్రతిదినముత్థాయ చోత్థాయ' [1]—

ఇంతటి కాదంబరీ మహా సాగరములో పాఠకులకు స్పష్టముగా గోచరించు ఒక లోపము ఏమగా, ఒక్కొక్కప్పుడతని వర్ణనములు సందర్భమును పాటించవు. చంద్రాపీడుని తిరుగు ప్రయాణమునందు వర్ణించిన చండికాయతన ద్రవిడ ధార్మికవృత్తాంతములు ఇట్టివే. ఇట్టి వర్ణనములు సమకాలీన సంస్కృత వాఙ్మయములో కోకొల్లలు. ఒక్క వాక్యమునందు మాత్రము అన్వయము కుదురుటలేదు. ఆ వాక్యమిది-

'ఇత్యేవం చింతయత్యేవమయి-తస్మాత్ సరసో నాతిదూరవర్తిని తపోవనే జాబాలిర్నామ మహా తపాముని: ప్రతివసతిస్మ, (నేనిట్లు చింతించుచుండగా ఆ సరోవరమునకు అనతిదూరమునందు జాబాలియను మహాముని నివసించెను.) ఈ వాక్యము 'నేనిట్లాలోచించుచుండగా ఆ సరోవరమున కనతి దూరములోనే నివసించుచున్న జాబాలి కుమారుడు హారీతుడు అచ్చటికి వచ్చెను' అని ఉండవలెను. ఇచ్చట గ్రంథ పాతమేదైనా సంభవించినదేమో! ఈ వాక్యము నందలి సతి సప్తమీప్రయోగము వాక్యనిర్మాణమున పొసగుట లేదు.

1. కా. క. పుట. 48.

# ప్రకృతి వర్ణనము

ప్రకృతి మాత అపార కృపారస భూయిష్ఠ. నేల మీద నున్న మనిషి మొదలుకొని ఎనుబది నాలుగు కోట్ల జీవరాసులు జీవించుట ఈమె దయవల్లనే కదా ! అనాగరకదశలోనున్న మనిషియే చెట్లను చేమలను, రాళ్ళను రప్పలను, జంతువులను పక్షులను తన ఉనికికి కారణముగా గుర్తించి పూజించగా ఇక సంస్కృత బుద్ధులయిన వారు ప్రకృతిలోని ప్రతి కదలికను, మారు ప్రతి రంగును, కాలమును, కరువును, ఋతువులను, రేయింబవళ్ళను, భూమ్యాకాశములను, సూర్యచంద్రులను, నీటిని, అగ్నిని, వాయువును, రోదసిని, అంతః ప్రకృతిని, బాహ్య ప్రకృతిని చూచి నిరూపించి ఆశ్చర్య చకితులై వర్ణించి తల్లి ఒడిలో తలదాచుకొను పిల్లవాండ్రవలె గారాబము చేసి, గారాబమును పొంది, వీరే దేవతలు, వీరినే పూజించవలెను, వీరికి కోపము వచ్చినచో జన నష్టము జరుగును అని భావించిరి. వేదకాలమునాటి కవిత్వమంతయు ప్రకృతిమాత కెత్తిన నీరాజనమే. ఆనాటినుండి ఋషిప్రోక్తములయిన మహాభారత రామాయణాదుల కాలమునుండి క్షణక్షణము సరికొత్తగా కనిపించు ఈ ప్రకృతిని వర్ణించి రససిద్ధులయిన కవీశ్వరులందరును తన వాక్కును ధన్యము చేసికొనిరి. వారిలో కాళిదాస మహాకవి తర్వాత పఠిత హృదయమును తనిపించి తల లూపింప చేసినవాడు భట్టబాణుడు.

ఈతని వర్ణనములలో శబ్దసౌష్ఠవమేకాక తదతీతమైన మహత్తర భావనా శక్తి, అలౌకికమైన కవితాధార పాఠకులను ఏదో తెలియని లోకములలోనికి తీసికొనిపోయి ఒక రసజ్ఞ విమర్శకునిచేత 'బాణోచ్ఛిష్టం జగత్సర్వం' అని అనిపించి, 'కాదంబరీ రసజ్ఞానాం ఆహారోఽపి నరోచతే' అన్న ప్రశంసను చేయించినది.

అదే సూర్యోదయ సూర్యాస్తయములను వర్ష ఋతువును మధ్యాహ్న కాలమును 'కాదంబరి'లో పెక్కుచోట్ల వర్ణించినప్పటికిని ఆ వర్ణనములకు పునరుక్తి దోషమంటదు. అయా, ప్రకరణానుసారము అదే ప్రకృతి వర్ణన ఆ స్థలమునందు పొదుగబడినట్లు కన్పించును,

'ఏకదాతు నాతి దూరోదితే నవనలినదల సంపుట భిది ఈష దున్ముక్త పాట లిమ్ని భగవతి సహస్రమరీచి మాలిని, అని శూద్రక వర్ణనము చేయు సందర్భమునందు కవి సూర్యోదయమును వర్ణించుటతో ఈతని ప్రకృతి వర్ణనము ఆరంభమగును. ప్రసంగవశమున బాణునకు చాలా ఇష్టమైన 'సతిస ప్తమీ' ప్రయోగమును కూడా పై వర్ణనములో చూడవచ్చును. ఈతని శైలియందలి విశిష్టతలో ఈ ప్రయోగము కూడా ఒకటి.

భూత వృత్తమును వర్తమానముతో కలిపి ప్రకృతిని వర్ణించుట ఈ కవికి చాలా ఇష్టము. పంచవటీ వర్ణనము చేయునప్పుడు అచ్చట అగస్త్యుడు, సీతా రాములు నివసించిరన్న కథలు విస్తరించి ఉన్నందున వారి కథలనన్నింటినీ ఈ వర్ణనమునందు కవి ఇమిడ్చెను.

కాళిదాస మహాకవి ప్రకృతిలోని సౌందర్యమును, కళ్యాణ గుణమును మాత్రమే దర్శించెను. భవభూతి భయానక రుద్రమూర్తి అయిన ప్రకృతిమాతను చూచి గజగజ లాడెను. బాణుని లేఖినికి ఇరువైపులను పదునున్నది. ఈతడు నిశ్చలముగా నున్న ప్రకృతికన్న ఓజోవంతముగా ఒక పనిలో వ్యగ్రమై సంచలించుచు, పరుగిడుచు, కంపించుచు, ఘూర్ణిల్లుచు, ఊరడిల్లుచు ఉన్న ప్రకృతినే ఎక్కువ అందముగా వర్ణించెను. ఇంతటి పటిమగల బాణుడు సముద్రమును వర్ణించక పోవుటకు అతడు మధ్యదేశీయుడగుటయే కారణము. శబర సేనాపతిని 'అపత్య మివ వింధ్యస్య' అని ఒక్క మాటలో ఎంతో భావమును ఇమిడ్చి చెప్పిన వాడు. ఇతడు సముద్రమును ఇంకెంత గొప్పగా వర్ణించువాడో తెలియదు. అసలు సముద్ర వర్ణనము భారతీయ కవులలో ఏ కొందరికో మాత్రమే సొత్తయినది.

కథాముఖమునందు రాజస్థాన వర్ణనము తర్వాత బాణుడు ప్రకృతి వర్ణనమునందే లీనుడగును. ఈ దృష్ట్యా కథాముఖ మమోఘము. వింధ్యాటవి, అగస్త్యాశ్రమము, పంపా సరోవరము, శాల్మలీ వృక్షము, దాని మీద నివసించు చిలుకల జీవితము, వేటవలన అవలోడితమైన కాననము. జాబాలి ఆశ్రమ వర్ణనము చిట్ట చివరకు సూర్యాస్తమయములతో ఈ కథాముఖము ముగియును. ఈ వర్ణనములందు ఏ ఒక్క పదము కూడా వ్యర్థమైనది కాదు.

కథాముఖాంతము నందలి సూర్యాస్తమయ నిశాముఖ వర్ణనములలో బాణుడు తనకు తానే సాటియని నిరూపించుకొనెను:— 'అనేన చ సమయేన పరిణతో దివసః' అని ఆరంభించి జాబాలిముని ఆశ్రమ ప్రాంగణమునందు

ఇనుడస్తమించుచు సంధ్యాకాంతతో మేలమాడిన తీరును కవి ఇచ్చట ప్రపంచించెను. స్నానవిధిని ముగించి జలములనుండి పైకిలేచిన మునిజనము సమర్పించిన అర్ఘ్యమునందలి రక్త చందనము నలదికొనియా యనునట్లు సూర్యబింబ మెర్రబడెను. సూర్యబింబమునందు దృష్టిని కేంద్రీకరించి ఊష్మపులగు (ఎండను త్రాగువారు) ఋషులు తపస్సుచేయగా కాబోలు ఎండ తగ్గిపోయినది. పావురాయి కాలిరంగు గల సూర్యుడు అప్పుడే ఉదయించుచున్న సప్తర్షి మండలమును కాలితో తాకకుండుటకు కాబోలు తన పాదములను (కిరణములను) సంహరించుకొనెను. అపరాహ్ణమునందలి సూర్యమండలముచుట్టును కిరణములు ప్రసరించుచుండగా ఆ దృశ్యము మధుధారలొలుకు మధుమథనుని నాభినలినము వలె కనిపించెను. క్రమక్రమముగా ధరణి తలము నుండి, తామర కొలనుల నుండి సూర్యకిరణములు పైకి లేచి పక్షులవలె చెట్ల కొమ్మలను శిఖరములను చేరుకొనెను. చెట్ల మీద ప్రాలి ఉన్న సూర్య కిరణములు మును లారవేసుకొన్న నారచీరల వలె నుండెను. సహస్ర దీధితి అస్తమించగనే సంధ్య పగడపు తీగ వలె ఆకాశమునం దల్లుకొనెను. ఈ సమయమునందు ఆశ్రమవాసులు ధ్యానమగ్నులైరి. వేరొక చోట హోమధేమవును పిదుకుచుండగా పాలధారల ధ్వని మనోహరమయ్యెను. అగ్నిహోత్రవేది యందు పరచబడిన పచ్చని కుశలు పువ్వులు ఆశ్రమము ముంగిట దిగ్దేవతా బలిగా సమర్పించిన అన్నపు మెతుకులు కనిపించెను. పగలంతయు ఎచ్చటెచ్చటనో తిరిగి తిరిగి అలసిపోయి ఎఱ్ఱని తారకలతో (కంటిపాపలతో) ఆశ్రమమును చేరుకొను తపోవన ధేనువుతో సంధ్యా కాలమును ఆశ్రమవాసులుత్ప్రేక్షించిరి పశ్చిమ సముద్రమునందు సూర్యగోళము పడగనే తత్పతన వేగము వలన కాబోలు పైకి లేచిన నీటి బందువులో యన్నట్లు ఆకాశమునందు నక్షత్రములు ప్రకాశించెను. క్షణకాలములో సిద్ధ కన్యకలు సమర్పించిన బలికుసుమములతోనా యన్నట్లు ఆకాశము నక్షత్రములతో నిండిపోయెను. ఉన్ముఖులైన తపోధనులు ప్రణామాంజలి సలిలములను విడువగా ఆ నీటితో కాబోలు ఆకాశమునందలి సంధ్యారాగము కడిగి వేయబడెను'. ఈ వర్ణనమునందలి ఉత్ప్రేక్షాశక్తి బాణునికి మాత్రమే సాధ్య మయినది.

నిశావర్ణనము ఇట్లున్నది :- 'సంధ్యాకాలానంతరము తద్వినాశదుఃఖితయో అన్నట్లు రాత్రి కృష్ణాజినము వంటి చీకటి ముసుగును కప్పెను. మునిజన హృదయములలో తక్క ఎల్ల ఎడలను అంధకారమే వ్యాపించెను. సూర్య చంద్రులు ఒకరి జాడ ఒకరు తెలియక సంచరించిరి. మిత్రులు కావున సూర్య

డస్తమించెనని తెలియగనే వైరాగ్యముతో చంద్రుడు ఆకాశమునందు ఒక మున్యాశ్రమమును నిర్మించెను. చంద్రుడే స్వయముగా ధౌత దుకూల వల్కల ధవలాంబరుడై (ఆకాశమును తెల్లబరచి, తెల్లని వస్త్రములను ధరించి) తారకల అంతఃపురమును వెంటబెట్టుకొని ఆకాశపు టంచులలో నిలిచిన అంధకారపు పొర యనెడు చీకటి చెట్లతో, సప్తఋషి మండలముతో, అరుంధతీ సంచారము వలన పవిత్రుడై దగ్గరనున్న ఆషాఢము కలవాడై (ఆషాఢ దండము, నక్షత్రము) ఆలక్ష్యమాణ మూలుడై (నక్షత్రము పేరు, 'మూల') ఒకచో అందమైన తార మృగముండగా ('మృగశిరస్సు' అనెడు నక్షత్రము, ఆశ్రమ మృగము) ఆశ్రమ జీవనము నారంభించెను. చంద్రుని మండలము నుండి పుచ్చపువ్వు వంటి వెన్నల శివుని శిరస్సు నుండి ప్రవహించు గంగవలె సముద్రమును నింపివేసెను. చంద్ర సరోవరమునందు చంద్రిక యనెడు జలమును పానము చేయవలెననెడు లోభ మున కాలోలు కిందికి దిగిన జింక పాపము అమృతమనెడు పంకములో ఇరు క్కొని పోయెను (ఇచ్చటి రూపకము మనోహరమైనది).

ఈ నిశా వర్ణనముతో తారాపీడుని అంతఃపురము నందు ప్రొద్దుగుంకిన తీరును పోల్చిచూచినపుడు కవికున్న లోకజ్ఞత వ్యక్తమగును అంతఃపురమునందలి నిశాసమయములందున 'దిశాకాంతల ముఖము కృష్ణాగురు పంకములతో దిద్దిన మకరికా పత్రములవలె తిమిరరేఖ లల్లుకొనెను. నిశావిలాసిని అవతంస పల్లవము వలె (చెవికమ్మ) సంధ్యారాగము గలితమయ్యెను. నెమళ్ళను కట్టివేయు కొయ్యల మీద అంధకారము నిలువగా అక్కడ పక్షులు లేకయే ఉన్నవన్న భ్రాంతి కలుగ జొచ్చెను. గవాక్ష వివరములందు (గూళ్ళలో) ప్రాసాదలక్ష్మి చెవికి చెక్కిన కలువ పూలవలె పావురములు కనిపించెను. అంతఃపురమునందలి ఉయ్యాలల మీది చిరుగంటలు మూగవోయి కాంచనపీఠము నిశ్చలమై శూన్యమై ఉండెను. భవన సహకారములకు (తీయమామిడి) వ్రేళ్ళాడదీసిన పంజరములలోని చిలుకలు గోరువంకలు నిశ్శబ్దముగా ఉండెను. సంగీతశాలయందు కూడా సద్దుమణిగి పోయెను. యువతుల అందెలధ్వనిని అనుకరించు భవన కలహంసలు కూడా కదలక మెదలక యుండెను. అశ్వశాలలో దీపములు వెలుగుచుండెను. ఆ జాములో గస్తీ తిరుగు యామికుని వలె మన్మథు డంతఃపురమునందు ప్రవేశించెను[1]. ఇది అంతఃపుర జీవనమునకు ఆశ్రమ జీవనమునకు గల తారతమ్యము.

---

1. ప్రభాకర వర్ధనుని మరణ సమయమును వర్ణించుచు 'హర్ష చరితము'నందు బాణుడు 'పునిరివా దహ్యాతా శోకాగ్నినా మకరకేతుః' అని చేసిన వర్ణనము ను ఇచ్చట పోల్చవచ్చును.— హ. V. P. 26.

# కాదంబరి - రసచర్చ

ఈ కావ్యము నవసరభరితము. ఇది కథ. అందునను కల్పనయే ప్రధానము కావున ఇందద్భుతరసము ఆంగిరసము. దానికి అంగభూతమైనది కాదంబరీ చంద్రాపీడుల, మహాశ్వేతా పుండరీకుల ఉదాత్త ప్రణయము. ఇచ్చటి శృంగారము కూడా విప్రలంభ శృంగారమే. కాదంబరిని చేరబోవు చంద్రాపీడుడు తన మనస్సునందు ఆమెను వివాహమాడి అనుభవించు వైవాహిక జీవితమును గూర్చి కనిన పగటికలలో మాత్రము సంభోగ శృంగారమును భూషణ భట్టు స్పృశించెను. బాణుడు చిత్రించినన్ని విధముల ప్రేమను వేరెవ్వరును చిత్రించలేదేమో! మిత్రుల ప్రేమ, తల్లి ప్రేమ, పరిజనమునకు యజమానియం దుండు భక్తి, దైవభక్తి ఇదంతయు విశాలమైన శృంగార భావములోని అంతర్భాగమే. శుక శిశువు ప్రాణములతో పోరాడు ఘట్టమును కవి నవసభరిత మొనర్చెను. శూలపాణి సిద్ధాయతనమును, మహాశ్వేతను, తపస్సమాధియందున్న పుండరీకుని వర్ణించునెడల కవి శాంతరసము నొలికించెను. కాదంబరి శృంగార రసాధిదేవత. అట్లే పుండరీకు నభిసరించు మహాశ్వేతయు చక్కని చుక్కగా వర్ణింపబడెను. జరద్ద్రవిడ ధార్మికుని వర్ణనములో ఈషద్ హాస్యముతో కూడిన వ్యంగ్యమును, కొలదిపాటి బీభత్సరసమును కవి స్పృశించెను. బీభత్సరసమునకు పరాకాష్ఠ చండికాయతన వర్ణనమునందున్నది. చంద్రాపీడుని దిగ్విజయ యాత్రలో వీర రసముండ వలసినను అది అంతగా భాసించదు. ఈ రసపోషణ శబర సేనాపతి వర్ణనము ఎడల ఎక్కువగా ఒప్పును. చంద్రాపీడుడు ధీరశాంత మూర్తియే. వైశంపాయనుడు తిరిగి రాలేదన్న వార్తను విన్న శుకనాసుని రౌద్రమూర్తి బ్రాహ్మణా వేశమునకు మాత్రమే చిహ్నము. మనోరమావిలాసవతుల పుత్ర ప్రేమ వాత్సల్య రసనిర్భరము. వింధ్యాటవీ వర్ణనమునందు మృగయా వర్ణనమునందును భయానక రస చ్ఛాయలు కనిపించును.

# బాణుని కథాకథనము - నాటకీయత

కాధంబరి కథాకథనమునందు కవి ప్రవేశ పెట్టిన విధానము అతి మనో హరం. ఇచ్చట కథకులే పాత్రధారులుగా మారుట, కథ చివరి భాగముతోకథనం ఆరంభమయి క్రమముగా వెనుకకు వెళ్ళుట అదికూడా రెండు దశలలో వెళ్ళురు, చిలుక, వైశంపాయనుడు, పుండరీకుడు ఈనాటి అధునాతన కథాకథన పద్ధతికి బాటలు వేసినట్లున్నది. నేడు ముఖ్యముగా చలన చిత్రములలో ప్రవేశపెట్టు ఈ Flash back పద్ధతినేఈ కవి అవలంబించెను. దీని వలన పుటలు క్రమముగా తిరుగుచు పఠితల హృదయములో ఉత్సాహము రేకెత్తును.

ఒకే వర్ణమును కవి రెండుమూడు చోట్ల విభజింపగా చదువరులకు ఎప్పటికప్పుడు ఏదో కొత్త విషముతో పరిచయము చేసికొనుచున్నట్లుండును. చంద్రాపీడుడు కథానాయకుడు. ఇతని విపులముగా వర్ణించుట కవి ఆశయము. అయితే ఒకేసారి చంద్రాపీడ శిశువు వివిధ దశలలో పెరుగుట, గురుకులములో విద్యాభ్యాసము చేయుచు యౌవనమునందు ప్రవేశించుటను పెంచి వర్ణించినచో అది చాలా పొడవగును కనుక, ఈ శిశువు జన్మించకముందే పిల్లలు లేరని కుమిలిపోవు విలాసవతితో "మనకంతటి అదృష్టమెక్కడిది? అయినను నీవు సిద్ధులను సేవింపుము, నోములు, చేయుము!" అని చెప్పి వ్రతములు, "కదా మే తనయ జన్మ మహోత్సవానంద నిర్భరో హరిష్యతి పూర్ణపాత్రం పరిజనః"- "కదా హరిద్రవసన ధారిణీ సుతసనాతోత్సంగా ద్యౌరివోదిత రవి మండలా సబాలాతపా మామానందయిష్యతి దేవీ ?"...అని మొదలుపెట్టి శిశువు పెరిగి పెద్దవాడగు వరకుగల వివిధ దశలను వర్ణించెను. ఆ తరువాత కించిద్వ్యవధానముతో చంద్రాపీడుని విద్యాభ్యాసమును వర్ణించినందున పాఠకుల ఔత్సుక్యము అక్షతమయి ఉన్నది. అట్లే విరహాతురయగు కాదంబరి స్థితిని కూడ వివిధ దశలలో కవి వర్ణించెను. తొలుత ప్రేమ ఇదమిత్థమని తెలియని కాదంబరి, చంద్రాపీడుడు హేమకూటమును వదలిపెట్టగనే కేయూరకుడామెస్థితిని చంద్రాపీడునకు వివరించి చెప్పువేళకు ఆమె ప్రేమ మార్గమునందప్పుడే సద్దిగట్టి ప్రయాణము నారంభించినట్లు

పాఠకులకు తెలియును. చంద్రాపీడుడామె దర్శనమునకు పోవునప్పటి కామెకు శైత్యోపచారము లారంభమయ్యెను. ఆమె సగౌరవముగా 'భారత వర్ష మెచ్చట నున్నది? మర్త్యలోకము రమణీయ మయినదా?'' అని ప్రశ్నించి తన ప్రియుని విష యమునందు జిజ్ఞాసువగును. చంద్రాపీడు డుజ్జయినిని చేరుకొన్న తరువాత ఆమె పత్రలేఖవెంట పంపిన సందేశము ఆమె ప్రేమ పతాకాస్థానమునందు కున్నట్లు తెలియజేయును. ఇది ఆమె ప్రేమ లత క్రమ పరిణామము నొందిన వైనము....

ఈ కథ కంతటికి కేంద్ర స్థానము అచ్ఛోద సరోవరము. ఈ ప్రదేశము నకు బాణుడు కల్పించిన ప్రాధాన్యము ఇంతింత యనరాదు. మహాశ్వేత తపస్సునందున్న పుండరీకు నిచ్చట దర్శించెను. పుండరీకుడిచ్చటి లతా గృహము నందు ప్రాణములు విడిచెను, అచ్ఛోదమునుండి యింద్రాయుధముద్భవించి చంద్రాపీడునిచ్చటకు చేర్చెను. ఇచ్చటనే అతనికి మహాశ్వేతతోపరిచయమగును. అతని స్కంధావారము విడిసిన దిచ్చటనే. ఇచ్చటనేవైశంపాయనుడు శప్తుడయి చిలుకగా మారెను. ఆ వార్త విన్న చంద్రాపీడుడిచ్చటనే ప్రాణములు వదలగా, కాదంబరి అతనిని ఇచ్చటికే చేర్చును. పత్రలేఖా యింద్రాయుధములిందే మునిగి పోయిరి, ఇందుండియే కపింజలుడు లేచి వచ్చెను. విలాసవతీ తారాపీడులు, తదను యాయులు ఇచ్చటనే శేషజీవనమును గడపిరి. వీరందరికి ఉజ్జయిని నామమాత్రము స్వపురముగాని, కథయంతయును ఇచ్చటనే జరిగినది. మర్త్యులకు గంధర్వులతో ఏర్పడిన సంపర్కమీకథకు ప్రాణము కాబట్టి మర్త్యలోక గంధర్వలోకపు టంచుల యందున్న అతి మనోహర దృశ్యములుగల ఈ సరోవర ప్రాంతమునందే బాణుడు తన మధుర కథా విన్యాసమును నడిపించెను. ఇచ్చటనే అతడు సృష్టించిన పత్రరథములవంటి ప్రేయసీ ప్రియుల జంటలు తమ సుఖ దుఃఖ ములను అనుభవించిరి.

ప్రతిభావంతుడగు కథకుడు కథ చెప్పినవుడు అందలి పాత్రలను సజీవ ముగా మలచి వానిచేత ఓజోవంతములగు సంభాషణలను చెప్పించును. తన భావములను ఏదో ఒక పాత్రలో ప్రవేశింపజేసి వ్యక్తము చేయుచుండును. 'వాడక్కడికి పోయి వారిలోనున్న నదిలో స్నానముచేసి అడవినిదాటి ముందుకు

సాగెన'ని చెప్పుట కథయగును. కథలోని నాయకుని చేత అతడు చూసిన వ్యక్తిని నఖశిఖవర్ణనము చేసిచెప్పుట కూడా కథా కథనమే యగును. కాని కథ లోని ఇరువురు పాత్రలు తమ అభిప్రాయముల నొకరితో నొకరు చెప్పుకొని, ఒకరి కష్టసుఖములను వేరొకరు పంచుకొని, ఒకరి కొరకు వేరొకరు కార్యరంగ మున ప్రవేశించి సమస్యలను పరిష్కరించుకొని పరస్పరప్రీతిని పెంపొందించి రని, ఒక దశలో వారి కష్టములు అవధులు దాటెనని, అట్టి స్థితిని ఎదుర్కొని వారు సంయమ శక్తితో చివరి విజయము తమదేయన్న ఆశతో నుండిరనియు కథకుడు చెప్పినప్పుడప్రయత్నముగా నాటకీయత తొంగి చూచును. కాదంబరి వర్ణన ప్రధాన కావ్యము. అయినప్పటికిని ఇందొక్కొక్క పాత్ర అతి సమర్థ తతో పోషించబడినది. ఇందు నాటకీయత ఉన్నందుకే కాదంబరీ కళ్యాణాది నాటకములీ కథపై ఆధారపడి వెలువడెను.

కథలోని బీజములను బాణుడక్కడక్కడ చల్లగా, వానికి పతకాస్థానము అచ్ఛోదసరోవరము వద్ద వైశంపాయన చంద్రాపీడు లొకరి వెనుక నొకరు జీవితమును చాలించుటతో ఏర్పడును. ఇక్కడ కథ మరొక మలుపును తిరుగును. చిట్టచివరకు కథలో వెదజల్లిన బీజముల ఫలములను సమీకరించుట జరుగును. సంభాషణ, ఘర్షణ, సమస్య మున్నగు నాటకాంగములన్నియును కాదంబరిలో గలవు. గంగా దేవి రచించిన "మధురావిజయ" కావ్యము వర్ణనప్రధానమైనది. అందు పాత్ర పోషణ బలమైనది కాదు. అట్టి కావ్యములతో పోల్చి చూచినప్పుడు కాదంబరిలోని పాత్రల వైశిష్ట్యము, నాటకీయ ధర్మమును పఠితల హృదయములను ఆకట్టుకొనును.

# జానపద ప్రభావము

కథ చెప్పుట, వినుట ఈ రెండు కూడ నాతి కుశాగ్ర బుద్ధులు నాతి సంస్కృతి సంస్కృతులు అయిన జానపదుల సొత్తు. వారి జీవనములో కథా కథనమునకు శ్రవణమునకు ఉన్న ప్రాధాన్యము నాగరకులలో లేదనుట అతిశయోక్తి కాదు. భారతీయ సాహిత్యములో మహాకావ్య సంప్రదాయము నాగరకుల సొత్తు కాగా వివిధ రసములను భావములను ప్రాకృత భాషాభేదములను అవస్థాంతరములను చూపు దృశ్య కావ్యములు (నాటకములు), నృత్య సంగీతములతో కలిసి సామాన్యజనమును రంజింపజేయు గీతగోవిందాది ఖండకావ్యములు, మేఘదూతాదులు, ఎక్కువ కావ్య శిల్పముతో ప్రమేయము లేని కథానికలు జానపదులకై ఉద్దేశింపబడినవి. వీటన్నింటిపై దేశీ సంప్రదాయపు ముద్ర స్పష్టముగా కనిపించును. మామూలు పేదరాశి పెద్దమ్మకథకు కావ్యశిల్పమును కూడా జోడించితే అది కాదంబరీకథ అగును. కథలో అద్భుత రసమునకు అంగిరసము యొక్క స్థానముండుట కూడా ఈ జానపద ప్రభావమునే బలపరచును. పార్వతీదేవి పరమేశ్వరునితో అద్భుత కథ నొక్కదానిని చెప్పుమనగా పరమశివుడామెకు బృహత్కథను చెప్పెనని అందురు గదా !

అనగనగా శూద్రకు డనే ఒక రాజు; ఇతడు విదిశానగరము నేలెను. అతని ఆస్థానమండపమునకు ఒక చండాల కన్యక మాటలు నేర్చిన చిలుకను ఒక దానిని తెచ్చి రాజునకు బహూకరించెను. చిలుక స్తుతి పాఠమును విని ఆశ్చర్య చకితుడైన రాజు కుమార పాలితుడను మంత్రిని ప్రశ్నించగా, అతడు అగ్నిశాపము వలన గజములకు జిహ్వాపరివృత్తి, శుకములకు అస్ఫుటాలాపత వచ్చెనని చెప్పి రాజును సమాధాన పరిచెను. రాజడుగగా చిలుక తన కథ నిట్లు చెప్పదొడగెను. 'కాకులు దూరని కారడవి వింధ్యాటవి; అక్కడ పంపా సరోవరము; దానివద్ద అగస్త్యాశ్రమము. కొలను తీరములో పెద్ద బూరుగు చెట్టు; దాని మీద చిలుకల కాపురము. ఒకనాడు శబర సైన్యము వచ్చి అడవిని అల్లకల్లోల పరచి వేటాడిపోగా, అందొక ముసలి శబరుడు బూరుగుచెట్టు నెక్కి ఆ

చెట్టు పండ్ల వలెనున్న చిలుకలను పండ్లను తెంపి పారవేసినట్లు చంపి కిందికి పారవేసెను. మన చిలుక మాత్రము తండ్రి చిలుక రెక్కల మధ్య ఇరుక్కొని క్రింద ఎండుటాకుల కుప్పపై పడి బ్రతికిపోయెను. దప్పికతో ప్రాణములు పోవునంతటి అలసటతో హారీతుడను తాపసకుమారుని చేతచిక్కెను. అతడు భూత దయతో చిలుకను ఆశ్రమమునకు చేర్చగా జాబాలి మహాముని దాని ముఖమును చూచి దాని పూర్వజన్మ వృత్తాంతము నంతయు తెలిసికొనెను. చుట్టునూ చేరిన తాపసులు కుతూహలముతో 'ఏమా కథ ?' అని ప్రశ్నించిరి. జాబాలి కథను ప్రారంభించెను :-

సుప్రసిద్ధమైనది ఉజ్జయిని; దానినేలు రాజు తారాపీడుడు. అతనికి పిల్లలు లేరు. అతని భార్య విలాసవతి ఎన్నో నోములు నోమగా ఒకనాడామె ముఖములోనికి పరిపూర్ణ చంద్రబింబము ప్రవేశించినట్లు తారాపీడుడు కలగనెను. దానికర్థము విలాసవతి గర్భమును ధరించినదని పెద్దలు చెప్పిరి. అతనికి చంద్రాపీడుడు పుట్టినప్పుడే మంత్రి శుకనాసునికి వైశంపాయనుడు పుట్టెను. మంత్రికుమారుడు రాజకుమారునితోకలిసి విద్యాభ్యాసమును ముగించగనే శుకనాసుడు లోకధర్మమును యువరాజుకు బోధించెను. తండ్రి అనుమతితో మెరుపు వంటి ఇంద్రాయుధాశ్వము నెక్కి చంద్రాపీడుడు దిగ్విజయ యాత్ర చేయుచు సువర్ణ పురమును చేరుకొని కొంతదూరము దారితప్పి మనుష్య సంచారము లేని దట్టమైన అడవిని దాటి ఒక కిన్నర మిథునము ననుసరించుచు జలాన్వేషియై గంధర్వరాజు చిత్రరథుడు త్రవ్వించిన అచ్ఛోద సరోవరమును చేరుకొని 'నేను తిరుగు మార్గము పట్టుటెట్లు? అశ్వఖురముల ననుసరించి దక్షిణ దిశయందు ప్రయాణించ వలసినదే కదా!' అని విచారపడెను. అప్పుడతనికి అలౌకికమైన వీణానాదము వినిపించెను. ఆ శబ్దము ననుసరించిపోయి మహాశ్వేతను అతడు దర్శించెను. ఆమె తన కరుణగాథ నతనికి వినిపించి, తనసఖియగు కాదంబరిని పరిచయము చేసెను. కాదంబరియందు నాటుకొన్న ప్రేమతో చంద్రాపీడుడు ఉజ్జయినిని చేరెను. అతని వెనుక అచ్ఛోదమును చేరుకొనిన వైశంపాయనుడు ఆ ప్రాంతమును వదలిరాలేక తన జన్మాంతర ప్రేయసి అయిన మహాశ్వేతను గుర్తించి ఆమెపై తనకుగల పట్టరాని ప్రేమను వ్యక్తము చేసెను. మహాశ్వేత మాత్రము అతనిని గుర్తించలేక 'నీవు చిలుకవు కమ్ము' అని శాపము నిచ్చెను. ఈ చిలు

కయే శూద్రకునికి కథచెప్పిన విహంగము. తన మిత్రుని నాశనమును గురించి విన్న చంద్రాపీడుడు ఉన్నచోటనే నేలకూలెను. ఇంద్రాయుధము అచ్ఛోదములో పడి కపింజలుడై లేచి వచ్చెను. అతనివెంట అచ్ఛోదములోపడిన పత్రలేఖ రోహిణీ దేవి కావున తన అవతారమును చాలించి చంద్రలోకమును చేరుకొనెను. మహాశ్వేతా వియోగమును భరించజాలని పుండరీకుడు మరణించుచు తన దుఃస్థితికి కారణమైన చంద్రుని నీవు కూడా జన్మజన్మలలో ప్రియా విరహాగ్నిచేత దగ్ధుడవు కమ్మని శపించగనే శాపగ్రస్తుడగు చంద్రుడే చంద్రాపీడుడుగా జన్మించెను. కాదంబరిని, మహాశ్వేతను కపింజలు డోదార్చి తన మిత్రమగు శుకము వద్దకు పోయెను. కథను చెప్పు చిలుక, కథను విను శూద్రకుడు వైశంపాయన చంద్రాపీడులని చివరకు పాఠకులకు తెలియును. పూర్వజన్మ స్మృతి కలిగిన వెంటనే వీరిరువురును ఎక్కుపెట్టి విడిచిన బాణములవలె బయలుదేరి వారి ప్రియురాండ్రతో కలిసి సుఖముగా నుండిరి. ఇంతటితో కథ కంచికి.

ఈ కథ నడక యావత్తూ జానపద సరణియందే ఉండుట గమనించదగినది. రాజునకును మంత్రికిని ఉండు సహజమైత్రి, చిలుకలో మనిషి ప్రాణముండుట, తద్రక్షణకై లక్ష్మీదేవి తగిన ప్రయత్నమును చేయుట వంటివి జానపదచ్ఛాయలే. అలౌకికములగు యక్ష గంధర్వ విద్యాధరులవంటి పాత్రలు శాపముల వలన వారు తిరిగి పుట్టుట ఒక స్త్రీ తన ప్రియుడు మూడు జన్మలెత్తు వరకు వేచియుండుట కథకు కాళ్లు ముంతకు చెవులుండవను మాటను నిరూపించును. అట్లే ఒక స్త్రీ గుఱ్ఱము నీడ్చుకొనిపోయి సరోవరములోనికి దుముకగా గుఱ్ఱము మనిషిగామారి పైకి లేచి వచ్చుట, చంద్రలోకమునకు మనిషి ఎగిరి పోవుట, చంద్ర కిరణములతో శరీర రక్షణ జరుగుట, చిలుక తన పూర్వజన్మలోని బంధువులను మిత్రులను స్మరించి వారికొరకు ఉత్కంఠ ననుభవించుట, 'అయ్యో, మానవు లెంత భాగ్యవంతులు! వారిలో ఇంత అందమును భగవంతుడు సృష్టించెనే' అని గంధర్వులు అసూయపడుట, జానపదకథాసహజమైన అద్భుత ఇతివృత్తమునే తెలియజేయును. ఇంతేగాక వేటవంటి భయానక దృశ్యముల వర్ణన కథను విను చిన్న పిల్లలలో ఆసక్తిని పెంచి ఎన్నో కొత్త విషయములను తెలిపి వారి ఊహా ప్రపంచములో కొత్త కొత్త రంగులు దిద్దును. 'భేతాళ పంచవింశతి' వంటి కథలను పిల్లల కొరకే వ్రాసినది. ఆ కథలలో

'పొద్దుపోదు, నిద్రరాదు, మౌనధారి మాట్లాడదు, ఓ మంచపు కోడూ! నీవైనా ఒక కథ చెప్పు' అని ఒక పాత్ర అడిగినప్పుడు చెప్పుకథలో ఇట్టి అద్భుత వర్ణనలు అమరి పొందికగా నుండును. అయితే కాదంబరి చిన్న పిల్లల కొరకు వ్రాసిన గ్రంథము కానేకాదు. అయినప్పటికిని కథకుండవలసిన అద్భుత సంఘటనలన్నింటినీ కవి జోడించుటవలన ఎక్కువగా రక్తి కట్టినది.

చోరులకు రాజగు కర్ణీసుతుడు జానపదులకు నాయకుడు. వింధ్యాటవీ వర్ణనమునందు కవి ఇతనిని ప్రస్తావించుట ఇదే ప్రభావమును తెలియజేయును. కాదంబరి ప్రాశస్త్యమునకు ఈ జానపద సంప్రదాయముల బలమే కారణమై యుండును. గద్య సాహిత్యములో దశకుమార చరితముతో ప్రారంభమైన దేశీ సంప్రదాయపుఛాయలు కాదంబరిలో కూడా కనిపించుచున్నవి. వీనన్నింటికీ మూలము జానపదుల సొత్తగు బృహత్కథలో కలదేమో మనకు తెలియదు.

కాదంబరియందు సంప్రదాయ భిన్నములైన కొన్ని వర్ణనలు కూడా జానపద ప్రభావమునే తెలియజేయుచున్నవి. కథా సాహిత్యములో అచ్చటచ్చట ఆర్యాచ్ఛందమునే వాడవలెనని దండి చెప్పెను. ఈ 'ఆర్య' గేయము కావున దానిని దేశీ సాహిత్య స్రష్టలగు ప్రాకృత కవులు ఆదరించి వన్నెకు తెచ్చిరి. ఈ మాత్రాచ్ఛందము అప్రయత్నముగా జనసామాన్యములోనే పుట్టినను పుట్టియుండవచ్చును. కథాముఖమునందు దీని ఉపయోగము జానపద ప్రభావమునకు నిదర్శనము కాగా అవతారికా శ్లోకములలో బాణుడు అక్షర చ్ఛందమును ఉపయోగించుట మరియొక విశిష్టత.

వింధ్యాటవిని కవి 'పుష్పవత్యపి పవిత్రా' అని వర్ణించెను. ఈ పుష్పవతీ వర్ణము శిష్టసాహిత్యమునందెచ్చటను కానరాదు. సరికదా, జానపదుల సొత్తగు 'గాథాసప్తశతి' లో ఈ స్థితిలో నున్న స్త్రీని కవులు వివిధ దశలలో వర్ణించిరి. పుష్పవతీ వర్ణనము జానపదులకు ఏవగింపు కలిగించలేదు.

అట్లే చండికాయతనమును వర్ణించునప్పుడు కూడా కవి జానపద సంప్రదాయమునే పాటించెను. 'గౌడవహో' కారుడగు వాక్పతిరాజు వింధ్యవాసినీ దేవిని వర్ణించిన తీరు అతని సమకాలికుడగు భవభూతి మహాకవి మాలతీ మాధవమునందు చండికాయతనమును వర్ణించిన చందము కూడా ఈ ప్రభావమునే తెలియజేయును.

జాబాలి ఆశ్రమమును వర్ణించు సందర్భమునందు కవి 'రాసభ రోమధూస రాసు తపోవనాగ్నిహోత్ర ధూమలేఖాసు సమున్మిషంతీషు' అని చెప్పెను. తపోవనములో పైకెగసే పొగను గాడిద వెండ్రుకలతో పోల్చుట సంప్రదాయముకాదు సరికదా, అది నీచోపమ. ఇట్టి వర్ణనను శిష్టసాహిత్యము నందు గానము. ఇది కూడా సంప్రదాయమను మెరుపు పొరను ఎరుగని జానపదుల వర్ణన విధానమే.

సూర్యాస్తమయ వర్ణనమునందు బాణుడొకచోట 'కరపుటైరా దివసాంతమా పీతమరవిందమధురసమివ రక్తాతపచ్ఛలేన గగనగమన ఖేదాదివ దివసకరబింబం వవామ' అని అనును. సూర్యుడు దిన మంతయు ఆకాశ సంచారము చేసి డస్సిపోయి కాబోలు సాయంత్రపు నీరెండ నెపమున తాను రోజంతయు ఆకంఠము పానము చేసిన అరవింద మధురసమును వమనము చేసికొనెనట). ఇది కూడా సంప్రదాయ బాహ్యమైన ప్రకృతి వర్ణనయే.

శుకనాసోపదేశమునందు లక్ష్మీదేవి చంచల స్వభావమును వర్ణించుచు 'యథాయథా చేయం చపలా దీప్యతే తథాతథా కజ్జలమలినమేవ దీపశిఖేవ కర్మ కేవలం ఉద్వమతి' అని అనెను. లక్ష్మీదేవి దీప శిఖవలె ఉద్దీపింపజేసినకొలది మాలిన్యమును మసినే కక్కునని చెప్పిన తీరు జ్ఞానమునకునను త్యాగమునకును ప్రతీకగా దీప శిఖను వర్ణించిన సంప్రదాయమునకు విరుద్ధము.[1] ఇదే సందర్భమునందు చంచల యగు లక్ష్మీదేవిని వర్ణించుచు కవి "గంధర్వ నగరలేఖేవ పశ్యత యేవ నశ్యతి" అని చెప్పెను. గంధర్వ నగర మనునది గగనారవిందము వంటిదనియు కంటిభ్రమవలన ఆకాశమునందు ఊహించుకొన్న ఒక నగర మనియు, అట్టి భ్రాంతి కలుగుట అశుభకరమనియు కాదంబరి వాఖ్యాత చెప్పెను ఇట్టి నగరమొకటి లేదని బాణుడు నమ్ముచు గంధర్వ రాజపుత్రి అయిన కాదంబరిని తన కథకు నాయికను చేయుట కథ నద్భుతముగా నల్లుట కొరకే.

1. గాథాసప్తశతిలో కూడా దీపమును కవి ఇట్టి అర్థము స్ఫురించునట్లే వర్ణించెను. Ref:- II 85. గా. స. శ.

# కాదంబరి-సమకాలీన సమాజము

ప్రఖ్యాత విమర్శకులు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారన్నట్లు కథ పౌరాణికమైనను, జానపదమైఅభూతకల్పనమైనను, గంధర్వులది యక్షులది అయినను అందు కవి తనకు తెలియకుండగనే తన చుట్టు ఉన్న సామాజిక స్థితి గతులను పాఠకులకు పరిచయము చేయును. కవి మనస్సు అకాశపుటంచులలో విహరించినను కాళ్ళు భూమిమీదనే నిలచియుండును. ఇది సహజము. ఈ దృష్టితో చూచినపుడు కాదంబరిలో నుండు పాత్రల వైవిధ్యమును బట్టి బాణ భట్టుకుండు లోక జ్ఞానమును, దేశాటనము వల్ల ఏర్పడిన మైత్రీ బంధములను, విషయ పరిచయమునుబట్టి ఆ మహాకవికి శ్రౌతస్మార్తములలో వంశ పారంపర్య ముగా వచ్చిన సంస్కారముతో బాటు వ్యక్తిగతముగా నున్న సర్వతంత్ర స్వతంత్ర భావములను బట్టి మౌఖరి వంశపు రాజుల కిరీటరత్నములతో వారి తాతముత్తాతల కాలి గోళ్ళు అరుణారుణితములు కాగా రాచనగరు మర్యాదలు అచ్చటి జీవితమును క్షుణ్ణముగా అవగాహన చేసికొని, దుర్లభమయిన హర్ష వర్ధనుని ఆస్థానమును ప్రవేశించుట వలన ఏర్పడిన మాతంగ దివాకరాదుల పరి చయముల వలన బాణుడు రకరకాలు పాత్రలను సృష్టించుటయేగాక వానికి జీవనము పోయుటకు తన అసాధారణమైన ప్రతిభతో పరిసర సమాజమును ఆయా పాత్రలలో, వర్ణనములలో ప్రతిబింబింపజేసెను. బాణుని సృష్టిలో తారాపీడ, శుకనాసులు, మనోరమా విలాసవతులు, అంతఃపురసంచారి పరిజనము, మేఘనాధాదులు తప్ప తక్కిన పాత్రలన్నియును దివ్యాంశ సంభూ తులు, గంధర్వులు, దేవతలు, దేవయోని సంభూతులు. శాపగ్రస్తులే అయినా ఆ పాత్రలను పరిచయము చేయునప్పుడు కవి వాని ద్వారా సమకాలీన సమాజ మును పాఠకులకు సాక్షాత్కరింప జేయును. వారి వారి కట్టు బొట్టు ఆచార వ్యవహారములు, ఆటవికుల జీవనము, వివిధ ఆహార్యములు, అంతఃపుర వర్ణనము కవికి నచ్చని ఆచారముల గర్హణ, రాజుల ఠీవి మొదలగువానిని బాణుడు చాలా చక్కగా చూపించెను,

రాజరంజక కవిత్వము చెప్పి రాజుల పేరోలగములో తలపండిన వారికి కూడా రాజుల జీవన విధానమును వర్ణించుటకు బాణుని కున్నంత అవకాశము లేకపోయెను. అష్టాదశ వర్ణనములను మొక్కుబడిగా చెల్లించిన మహాకావ్య రచయిత కావ్యములతో కాదంబరిని పోల్చినపుడు ఇందలి వర్ణనా వైవిధ్యము రాజుల జీవనములోని అంతరాంతరములను చొచ్చుకొని పోయినదని పఠితల మనస్సులకు తోచును. బాణుడు గ్రహించిన ప్రక్రియ — (Medium) కథ కాబట్టి అతనికీ అవకాశము లభించినది. ప్రతీహారులు పరిగెత్తుటయే కాదు, కనక వేత్రిలతలతో సభా కుట్టిమమును నరపతి ప్రబోధనార్థము కొట్టుటయే గాదు, పట్టు వస్త్రముల రెపరెపలతో ఆభరణముల నిక్వణములతో ఒకరి అంగదములు వేరొకరి భుజకీర్తులకు రాచుకొని బంగారు పొడి రాలగా అహమహమికతో సామంత రాజులు చక్రవర్తి ముందుకు పరుగువంటి నడకతో నడచి వంగి దండములు పెట్టుటయే కాదు, నూపుర రవాను కృష్టములై రాజహంసలు ఆస్థాన సోపాన పంక్తిపై బారులు తీర్చుటయే కాదు, స్వర్ణ రజత మరకతమయ కలశములతో గంధోదకములతో స్నానద్రోణినుంచిలేచిన రాజునకు వారాంగనలుఅభిషేకదేవతల వలెస్నానము చేయించుటయే కాదు, తెలుపులో తెలుపయిన పాము కుబుసము వంటి దుకూల యుగ్మమును రాజు ధరించుటయే కాదు, గోరోచనా లిఖితమయిన రాజహంసల అంచుగల క్షౌమములే కాదు,[1] ఏక కర్ణావసక్తములయిన తాటంకములు దంత పత్రములు మేన నలదిన గోరోచన కుంకుమ మిశ్రిత చందన చర్చలు, నీల పీతహరిత రక్తాది వివిధ వర్ణముల వస్త్రములు, కాకపక్షధరులగు బాలకులు, వ్యాఘ్ర నఖపంక్తి మండితులయిన శిశువులు, రక్ష రేకులు కట్టుకొన్నవారు, అను మరణ వ్యవసితలయిన సతులు, పుత్రోదయాది శుభావసరములలో పూర్ణ పాత్రమును (బహుమతిని) హరించు మిత్ర భృత్యాది ఆప్త వర్గము, ఉత్తరీయము చుట్ట చుట్టి భూమి మీద పెట్టి కూర్చుండుడని ప్రతీహారి విజ్ఞానము చేసినను శాలీనతతో మృదువుగా కాలితో దానిని పక్కకు నెట్టి తండ్రి ఎదుటభూమి మీద కూర్చుండుట, ప్రియురాలి ఎడల అతని ప్రవర్తనము, మంగళ కలశములు, మంగళ వలయములు, ఆశ్రమ వర్ణనముతో మన కన్నుల ఎదుట నిలుచు గురు

---

1. 'వధూదుకూలం కలహంస లక్షణం' అని కాళిదాసు 'కుమార సంభవము'న పార్వతీ దేవి వస్త్రధారణమును వర్ణించెను.

కుల జీవనము, ప్రేయసీప్రియుల ప్రేమోపహారములు, ప్రేమలేఖలు, మృగయా వినోదము, వ్రాతసామగ్రి, వనమానుషులు, సితకంచుకములతో, సితాంగ రాగముతో, సితకుసుమములతో, సితోష్ణీషములతో, కృతయుగ పురుషులవలె, గీచిన బొమ్మలవలె, తొలచిన శిల్పములవలె, రాత్రింబవళ్ళు కదలక మెదలక నిలబడిన ద్వారపాలకులు—ఈ విధముగా ఒక మహా ప్రపంచమును, సమకాలీన ప్రపంచమును బాణుడు మన ఎదుట ప్రదర్శించును.

చాండాల జాతి అస్పృశ్యమైనదను సాంఘిక స్మృతి మనకు సాహిత్యములో కాదంబరిలోనే బహుశా ప్రథమ పర్యాయము కనిపించి కనువిప్పు కలుగుచున్నదనవచ్చును. చాండాల కన్యకను వర్ణించునపుడు కవి శూద్రకుని చేత 'యదినామేయం ఆత్మ రూపోపహసితాశేష రూప సంపదుత్పాదితా కిమర్థమపగతస్పర్శసంభోగసుఖే కృతంకులే జన్మ? మన్యేచ మాతంగజాతిస్పర్శదోషభయాత్ ? అస్పృశతేయ ముత్పాదితా ప్రజాపతినా' అని అనుట వలన ఈ విషయము స్పష్టమగును. ఇదే విషయము గ్రంథాంతమున చాండాల కన్యక నోట భూషణ భట్టు కూడా చెప్పించెను. బంధనములో నున్న శుకము ఆహారమ్ము మానివేయగా దానిని బుజ్జగించుచు చండాల కన్యక ఫలములకు తప్పు లేదనియు, కుల వ్యవస్థ మనుష్యులకే గాని జంతువులకు, పక్షులకు వర్తించదనియు చెప్పును.

ఈ గ్రంథములోని వసంతోత్సవ వర్ణనము, వివిధ క్రీడలు ఆ నాటి సామూహిక వినోదముల వివరణములను మనకు తెలియజేయును

'కదాచిన్ మకరకేతు కనకనారాచ పరంపరాభిరివ కామినీ కరపుట వినిర్గీతాభిః కుంకుమజలధారాభిః పింజరీక్రియమాణకాయః లాక్షాజలచ్ఛటాప్రహార పాటలీ కృత దుకూలః మృగమద జలబిందుశబలచందన స్థాసకః కనక శృంగకైః చిక్రీడ'[1] (బంగారు పిచికారీలతో కామినీ జనము కుంకుమ జలధారలను మన్మథుని బంగారు బాణములను వలె ఈతనిపై వర్షింపజేయగా దుకూలము తడిసి మేను చెన్ను మీరి మృగమద మిశ్రితమైన జలమువల్ల మేన నలదిన చందనము కర్పూరము కాగా తారాపీడుడు వసంతాలాడెనట)

---

1. కా. కా. పుట 93.

ఈ వర్ణనము హర్ష విరచితమైన రత్నావళి నాటిక ప్రథమాంకములోని వసంతోత్సవ వర్ణనమును పోలియున్నది. భంగ్యంతరముగా ఇది హర్షవర్ధనుని ఈవియే. దీనినే పూర్వులు ఫాల్గుణోత్సవ మనిరి. ఈ ఫాల్గుణోత్సవమును గ్రామీణు లెట్లు జరుపుకొందురో గాథా సప్తశతిలో నిట్లు వర్ణించిరి:-"కర్దమ ప్రహారముతో (బురదతో కొట్టుట) ఒక యువకుడు తన ప్రియురాలిని సంభావించగా సాత్త్విక భావముతో ఆమె వడలెల్ల చెమట పట్టి ఆ బురద కరిగిపోయెనట."[1] ఇది అంతః పురముల వసంతోత్సవమునకును, గ్రామోత్సవములకును ఉన్న భేదము. కనక శృంగములతో వసంతాలాడుటను చతుర్భాణీకారులు, కామసూత్రకారులు కూడ వర్ణించిరి. బాణుని కాలమునందు కూడా ఇది పండుగ లన్నింటిలోనూ పెద్దదే.

## క్రీడలు :-

అంతఃపుర బాలికలు కందుక క్రీడ పాంచాలికా క్రీడల నాడిరట.[2] బంతులా టను స్వప్నవాసవదత్తకారుడు,[3] పద్మ ప్రాభృతకకారుడును వర్ణించగా బాణుడు దానికి చెక్కబొమ్మలాట కూడా జోడించి చెప్పెను. బాలికలు ఉయ్యాల లూగు చుండగా ఉయ్యాలల చేరులమీది చిరుగంటల ధ్వనితో దిక్కులు నిండిపోయె నట. అంతఃపురమునందలి స్త్రీల హారములతిసుకుమారములై పాము కుబుసము వలె తోచగా వానిని నెమళ్ళెత్తుకొని పోగా, సౌధ శిఖరముల నుండి క్రిందకి దిగు పావురముల గుంపు నేల మీదనే ఉత్పలవనమును సృష్టించగా, అట్టి పరిసరము లలో స్త్రీలు తారాపీడ నరపతి చరితమును అనుకరించుచు హావభావ విలాసము లతో క్రీడించిరట. గుఱ్ఱపు శాలలో కట్టిన కోతులు గొలుసులు తెంపుకొని పరు గెత్తుచు దానిమ్మపండ్లను పడగొట్టుచు, మామిడాకులను త్రుంచివేయుచు, అంతః పురములోని కుబ్జవామన కిరాతుల నుండి లాగికొన్న ఆభరణములను వెదజల్లుచు ఆకుల క్రీడను జరిపెనట- విచ్చలవిడిగా ఆడెనట. ఈ కోతుల వర్ణనము

---

1. గా. స. IV-67. 2. కా. క. పుట 145. 3. స్వప్న. II

రత్నావళి నాటికలో రెండవ అంకమునందున్నది. ఇది కూడా బహుశాః హర్షుని అంతఃపురము నందొకనాడు జరిగిన సంఘటనమేమో![1]

కోడి పందెము, గొఱ్ఱెపొటేళ్ళ పందెములు సహజముగా మన మెరిగినవి. వానితోబాటు కురర కపింజల లావక వర్తిక పక్షుల పందెములు తారాపీడుని ఆస్థాన భవనమున జరిగెడివని తెలియుచున్నది. తెలుగునాట పలనాటి వీర చరిత్రములోని కోడి పందెము చరిత్రాత్మకమైనది.

తారాపీడుని సభాప్రాంగణము నందు గంధమాదనమను గంధహస్తి, ఇతర గజములు, జాజువలె ఎఱ్ఱనైన జూలుతో వనగజ రుధిరముచేత పాటల వర్ణమునకు మారినదా అను భావమును కలిగించునట్టి సింహములు, మందురా పాలకులతో కలిసి యవసమను గడ్డిమోపుల మీద కూర్చుని గీతధ్వనికి చెవులు రిక్కించి వినుచు, తేనెతో కలిపిన పేలాలను పుక్కిట నములుచున్న రాజుల కతి ప్రియమైన గుఱ్ఱము లుండెనట. అధికరణము (న్యాయస్థానము) నందు ఆర్యవేషమును ధరించి అత్యుచ్చవేత్రాసనోపవిష్టులయి ధర్మమూర్తుల వలె కనిపించు ధర్మాధికార మహాపురుషులుండిరట గ్రామముల, నగరముల పేర్లను తెలిసి జగత్తు నంతయు ఒక చిన్న భవనమువలె లీలగా నెరిగి అన్ని విషయ ములను వ్రాసుకొనుచు యమధర్మరాజు నగరమువలె ఆస్థానమును కనిపింప జేయున్న అధికరణ లేఖకులు శాసనములను శుద్ధపరచిరి. లోపలనున్న నరపతి బయటకు వచ్చువరకు వేచియున్న సామంతరాజులు గుంపులు గుంపులుగా చేరిరి. ఆంధ్ర ద్రవిడ సింహళదేశమునుండి వచ్చిన సేవకజనము బంగారు పువ్వులు కుట్టిన కవచమును ధరించి అర్ధచంద్రాకారములో వారిని పరివేష్టించిరి. నక్షత్రములతో ప్రకాశించు రాత్రివలె ఆ సేవకులు కన్పట్టుచుండిరి. వారిచేతిలో ధగధగ మెఱయు నిశిత కృపాణములు సూర్యకిరణముల ప్రకాశమును యినుమడింప జేసెను. ఇక సేవికలు ఒకే చెవికి దంత పత్రమును ధరించి సిగను పైకి బిగించికట్టి తెల్లని చందనపు రేఖలు రెండు భుజములపై ప్రకాశించగా బాకులను బిగించి నిలిచిరి. సామంతరాజులు కాలయాపనకొరకు దురోదర క్రీడలు సలుపుచు, అష్టాపదము (చదరంగము) అభ్యసించుచు, వీణలు మీటుచు,

---

1. రత్నావళి-II. 'నష్టం వర్షవరైః'

చిత్రఫలకమునందు భూమిపాలుని బొమ్మలు గీయుచు, కావ్యగోష్ఠిని సలుపుచు, పరిహాసోక్తులు ఆడుచు, బిందుమతీ ప్రహేళికాది కావ్యక్రీడలు జరుపుచు, నరపతి రచించిన కావ్యము నందలి సుభాషితమును వర్ణించుచు (హర్షుని కావ్యములా ?), ద్విపదీ ఖండమను గేయమును ఆలపించుచు (రత్నావళిలో కూడ ద్విపదీఖండము కలదు), పత్ర భంగములను (భూమిమీద వివిధములయిన అందమైన ఆకారములను) గీయుచు, వార విలాసినులతో ముచ్చటలాడుచు, వైతాళిక గీతములు వినుచు, అక్కడనే కూర్చుండిరట. సామంతరాజులు లేవగా వారి రత్నాసనములను పక్కకు తొలగించి, దర్భాసనములను చుట్టిపెట్టగా ఆ సభా పర్యంతము (ప్రాంగణము) ఇంద్రాయుధముల సమూహమువలె కనిపించెను. ఒకచోట బంగారు గొలుసులతో కుక్కలను కట్టివేసి ఉంచిరట. అక్షడ కస్తూరి మృగములను కట్టివేసి ఉంచుటవలన కస్తూరివాసన నలుదిక్కుల ప్రసరించెనట. ఆస్థానములో గూనివారు, కిరాతులు, నపుంసకులు, చెవిటివారు, మరుగుజ్జులు బహుళముగా తిరుగుచుండిరట. మొన్న మొన్నటి వరకును నెలకొనియున్న రాజాంతఃపురములందు వీరుండుట సంప్రదాయముగా ఉండెడిదే గదా !

బాణుని మృగయా వర్ణనము సంప్రదాయ బద్ధమైనది కాదు. ఇది యథార్థ మృగాయావర్ణనము, ఈతడు చేసిన వింధ్యాటవీ వర్ణనము వనగ్రహణ కోలాహలము, నాటి ఆటవికుల జీవనమును కన్నులకు కట్టినట్లుగా, మనము వారి మధ్య నివసించు చున్నట్లుగా తోపింపజేయును. బాణుడు ఏ వర్ణనమును చేత బట్టినను అందు సిద్ధహస్తుడే యని నిరూపించుకొనెను. దానికి కారణము అతడు ఎవరినుండియో వినిగాని, పుస్తకములలో చదివిగాని ఈ వర్ణనములు చేయలేదు. హర్ష చరిత్రములో తాను దేశద్రిమ్మరినని చెప్పుకొన్నట్లు ఈ వింధ్యాటవి ప్రాంతములో రాజుతోబాటు పర్యటించి ఉండును. తదనుభవములను మనఃపేటిక యందుంచుకొని కేరళీ కపోలకోమలచ్ఛవితో సహా తిరిగి కావ్యమంజూషలోనికి చేర్చెను. అందుకే ఇందు బాటసారులు వేసుకొన్న గడ్డి పరుపుల వద్దనుండి లవంగపుటాకుల పరుపులు, జింకలు ప్రసవించిన రక్తసిక్తమయిన నేలవరకు వర్ణించి, ఎండుటాకుల శబ్దమును గూడ చెవియొగ్గి విని పాఠకులకు వినిపించెను. ఈ వర్ణనము కేవలము అమరకోశములోని వనౌషధి వర్గను ఏకరువు పెట్టుట కానేకాదు. ఇందు జీవ సంబంధము, కవి కరస్పర్శ కలవు. నిశ్చలముగానున్న కాదంబరీ మహాశ్వేతల వర్ణనములు చేయుటయందు బాణుడెంత

నిపుణుడో, కదలుచు చైతన్యవంతముగా నుండు సభామండపములోని రాజుల సంరంభమును, వింధ్యాటవిలో జీవ జంతు జాలముల, వేటగాండ్ర కోలాహలమును, తమ తమ పనులు చేసుకొనుచున్న ఆశ్రమవాసుల జీవనమును వర్ణించుట యందు అంతకన్న నిపుణుడు.

శబరుల వనగ్రహణ కోలాహలము వారి మృగయోత్సేకముగాక నిర్భీకతను, నైపుణ్యమును, శరవేగముతో ప్రసగించు బుద్ధిని తెల్పును. పతితల గుండెలలో మాత్రము ఏ దిశ యందుండి ఏ మెకము మీద బడునో యన్నంత జంకుకల్గును. మడిసిపోవు జంతువులు చేయు ఆర్తనాదములను వర్ణించుచు బాణుడు చూపిన క్రియా నైపుణ్యము - ఒకే క్రియను రెండు జంతువుల ధ్వనిని వర్ణించుట కుపయోగింపకుండుట- ఆతని భాషా పాండిత్యమునకే గాక దాని వెనుక నున్న భావగరిమకు, సూక్ష్మేక్షికకు నిదర్శనము.[1] ఇక్కడ గజముల ఛీత్కారము, తమ పిల్లలను పోగొట్టుకొన్న ఖడ్గమృగముల ఆక్రందనము, చెట్లమీది నుండి ఎగిరిపోవు పత్రరథముల కోలాహలము (పక్షుల కోలాహలము), జంతువులను వెంబండించు శబరుల కాలిచప్పుడు, కర్ణాంతాకృష్టములై బాణములను వర్షించు ధనుస్సుల నినాదములతో గాలి కదలికకు క్వణితములగు ఖడ్గములతో, కఠినములయిన అడవి బత్రెల మూపురముపై పడినప్పటి రణితముతో వేట కుక్కల ఘర్ఘర ధ్వానముతో అడవి నిండిపోయెనట. శబరుల వేట ముగిసిన తర్వాత వర్షించి మూగవోయిన మేఘమువలె, మథనము తరువాత శాంతమయిన సముద్రమువలె, ఆ అడవి ప్రశాంతమయి పోయెనని వర్ణించి అక్కడ ఆటవికుల అతి కర్కశ జీవితమును ఆచార వ్యవహారములను తెలియజేయును.[2] వారి మేని నలుపువలన వారు కదలివచ్చు చీకటిచెట్లగుంపువలె కాళరాత్రుల యామములన్నియు ఒకచోట చేరినట్లు, కాటుక శిలా స్తంభములు భూకంపమునకు కదలిపోయినట్లు, సూర్యుని కిరణములకు చెదరిపోయిన అంధకార పుంజమువలె, యమభటులవలె, దానవులవలె, అశుభకర్మలవలె, దండకారణ్యవాస మునిజనులిచ్చిన శాపములు సంచరించినట్లు, రామునిచే హతులై అతనిని ధ్యానించనందున పిశాచములుగా మారిన ఖర దూషణాదులవలె, కలికాలమునందలి బంధు

1. కా. క. పుట 54.

2. కా. క. పుట. 54, 55.

వర్గమంతయు ఒకచోట కూడినట్లు స్నానమునకు బయలుదేరిన అడవి బర్రెల వలె, కొండ కొమ్ముమీద నిలబడి సింహములు లాగివేయగా క్రిందబడిన కాల మేఘములవలె, ధూమకేతువులవలె, అడవి నంధకారముతో నింపివేసిరట. ఈ శబరులు. వారి సేనాపతి దేహప్రభ నల్లకలువల వంటిది కనుక ఆ ప్రభా ప్రవాహము నర్మదానది ప్రవాహము వలె నుండెనట. వ్యాయామముతో కర్కశమై సన్నగా చాకువలె పదునైన ఇతని రూపు ఒక గొప్ప యోధుని, యుద్ధ నిపుణుని, శరవేగముతో ముందుకు సాగువానిని, యుద్ధము, వేట కొరకే ఇతడు పుట్టెనాయను భావము కలిగించు వానిని సాక్షాత్కరింపజేయును. హర్షుని పేరోలగములోని ఒక ఆటవిక నాయకుడెవరో బాణుని దృష్టి నాకర్షించి ఈ శబర సేనాపతిగా మారి యుండవచ్చును. భుజములమీదికి జారిన గిరజాలు, విశాల ఫాలము, ఎత్తై క్రూరమైన ముక్కు, ఎడమ చెవికి పెట్టుకొన్న భుజంగమణి ప్రభతో ఎడమ ప్రక్క ఎఱ్ఱబడగా చిగురుటాకుల సెజ్జపై ఎడమకు ఒత్తిగిలి నిద్రించినందులకు ఆ రంగు ఈతని దేహమున కంటెనాయని అనిపించు భావము, తాను చంపిన గజముల మదజలమును, సప్తచ్ఛద పరిమళ వాహిని మగు కృష్ణాగురు పంకమును దేహమున కలది కొనుట, ఆ వాసనకు ఈతని దేహముమీద ముసిరికొన్న తుమ్మెదలు నెమలి ఈకల గొడుగుతో పోల్చదగిన తమాల పల్లవములతో ఈతనికి నీడనిచ్చుచున్నవా యన్నట్లుండుట, చెవి వెనుక దోపుకొన్న ఆకులవలన వింధ్యాటవియే ఇతని దాసి అయి స్వేద జలమును తుడిచి వేయుచున్నదా అన్న భావమును కలిగించుట, కాఠిన్యముతో ఎఱ్ఱబారిన చూపులు, ఏనుగు తొండము కొలత తీసుకొని నిర్మించినవా అన్నట్లు కనిపించు అజాను బాహువులు, వానిపై చండికకు బలినిచ్చుటకొర కుపయోగించిన నిశిత కర వాలము, కత్తివేట్లు, ఎదమీద చెమట బిందువులు, వాని మధ్య అచ్చటచ్చట పడిన జింక నెత్తురు చుక్కలతో గురిగింజలు ముత్యాలు కలిపిన హారమును ధరించినట్లు కన్పింపజేయు వింధ్య శిలాతలమువంటి విశాల వక్షఃస్థలము,[1] వ్యాయామము వలన గీతలు తేలిన బల్లపరుపు వంటి కడుపు, ఆలాన స్తంభముల (ఏనుగుల కట్టుకొయ్యలు) వంటి తొడలు, కట్టుకొన్న ఎఱ్ఱని పట్టుదట్టి. అకారణ క్రౌర్యమువలన బొమ

1. కా. క. పుట. 57,

ముడిపాటుతో నుదుటిమీద తేలిన మూడు రేఖలు భక్తుని ఫాలతలముపై కాత్యా యని ముద్రించిన త్రిశూలపు ముద్రవలె కన్పించుట— ఇది శబర సేనాపతి వర్ణ నము. అతని వెనుక పారు వేటకుక్కలు మెడలలో గవ్వల దండలతో, చిన్నగా ఉన్నను అతిబల సంపన్నమయిన కాయముతో, జూలు పెరగని సింహ కిశో రములవలె కన్పించుచూ నాలుకలు బయటికి చాపి వగర్చుచూ పరిగెత్తగా చమరీ వాలములోని వెంద్రుకలను ఏనుగుదంతములను, తేనెతెట్టులను, ఏనుగుల కుంభ స్థలములందలి ముత్యములను, తాము వేటాడి తెచ్చిన జంతువుల మాంసమును తీసికొని ప్రమథ గణములవలె సింహముల చర్మములను ధరించి, క్షపణకులవలె నెమలి ఈకలను పట్టుకొని, కాకి ఈకలను తీసికొని అతని అనుయాయులు అతనిని అనుసరించిరట.[1] నెమలి ఈకల గొడుగును అనుచరులు అతనికి పట్టి రట. ఈతడడవి పందులతోసహా అన్ని జంతువులను, పక్షులను చంపి అక్క డక్కడ దొరికిన స్త్రీలను బందీలుగా చేసికొని నడచెనట. అతని పేరు మాతంగకుడు. (మాతంగ దివాకరుని పేరు ఇచ్చట బాణుడు గ్రహించెనా?)

ఈతని బ్రతుకు సాధుజనగర్హితమట. ఈతని ధర్మము మనుష్య మాంస మును ఉపహారముగా సమర్పించుట,[2] సాధుజన నిందితమగు మధుమాంసాదు లాహారము. ఈతడు పడుశ్రమ వేట వలననే నేర్చిన విద్య నక్కల కూతలను గ్రహించుట. గుడ్లగూబ లితని దేశికులు. పక్షులను గురించిన జ్ఞానమునందే ఇతని ప్రజ్ఞ, పరిచితులు కుక్కలే. రాజ్యము శూన్యాటవి. ఉత్సవము మధుపానమే. విత్తములు ధనువులే. సహాయము బాణముల వలన. ఇతడు వినోదించి గీతము మృగములను నశింపజేయు వ్యాధగీతమే. ఈతని ఇల్లాండ్రు బందీజనమే. పులు లతో ఇతనికి సహవాసము. జంతువుల రక్తముతో ఇతడు దేవతార్చనము చేయును. మాంసముతో బలికర్మను జరుపును. దొంగతనముతో జీవించును. పాము పడగమీది మణులే ఈతని అలంకారములు. మదగజ మదమే అంగ రాగము. ఏ అడవిలో నివసించునో అందలి జంతువులను చంపును- అని ఈ విధముగా వైశంపాయన శుక మతనిని చూచి ఈసడించుకొనును.[3] ఈ ఈస డింపు మాటలన్నియు బాణుని అభిప్రాయములే.

---

1. కా.కా. 58. 2. కా.కా. పుట. 59.

3. కా. కా. పుట 60.

ఈ సేనాపతి పల్లవాసనము మీద కూర్చుండి విశ్రమించగా, తామరాకుతో నీటిని తెచ్చి సేవకు డిచ్చెనట.

అందొక ముసలి శబరుడు జంతువుల వేటాడలేకపోగా అతని భాగమునకు మాంసము రాలేదట. అప్పుడతడు సేనాపతి కనుమరుగు కాగానే వైశంపాయనుడున్న శాల్మలీ వృక్షమునెక్కి ఆ చెట్టు పూవులవలె, చిగురు టాకులవలె, అరవిచ్చిన తామరాకు చుట్టలవలె ఉన్న శుకశిశువులను నిర్దాక్షిణ్యముగా తన యమదండమువంటి చేతితో గొంతు నులిమి చంపెనని బాణుడు వర్ణించినపుడెట్టివానికైనను హృదయము ద్రవించి కన్నీటి బొట్టొకటిరాలి నిర్వేదము కలుగక మానదు— ఇది ఆటవిక జీవనము.[1]

ఇదే జీవనమును భూషణభట్టు కూడ గ్రంథాంతమునందు పాఠకులకు చూపించును. బాణుడు వేటను వర్ణించగా అతని కుమారుడు పక్కణమునే (బోయపల్లెనే) వర్ణించెను. వారు వర్ణ వ్యవస్థకు బాహ్యులైన తీరు యావత్తూ ఇచ్చట మనకు పరిచయమగును. ఇక్కడ కథా ముఖమునందు బాణుడు వేటను వర్ణించిన తీరుతో చంద్రాపీడుని మృగయా వర్ణనమును పోల్చినప్పుడు రెండవ వర్ణనము తేలిపోవును. అచ్చట బాణుని దృష్టి యంతయు అచ్ఛోదసరోవరము, మహాశ్వేత, కాదంబరీ వృత్తాంతములపై కేంద్రీకృతమై, శుకనాసోపదేశము కాగానే మిగిలిన కథ మొక్కబడివలె చాప చుట్టుకొనినట్లు సంకుచితమై ముందుకు పరిగెత్తును.

భూషణభట్టు చిలుకను పట్టుకొన్న పురుషుని వర్ణించుచు, అతడు పాశములు లేని కాల పురుషుని వలె, ఉక్కు పరమాణువులతో నిర్మితుడైనట్లు, ప్రేతపతివలె, పుణ్యరాశికి ప్రతిపక్షమువలె, పాపమునకు ఆశ్రయమువలె, సహజ క్రూరమైన బొమముడి పాటు కలిగి ఎఱ్ఱని కన్నులతో క్రోధము లేకయే, అందరికినీ భయము కల్గించు కృతాంతునకే భయము కల్గించునట్లు ఉండెనట. అతని ఆశయము, కేశములు రెండును అస్నిగ్ధములట. ముఖములోను, జ్ఞానములోను అంధకారమేనట. రంగు, ప్రవర్తన రెండును నలుపేనట. వస్త్రము, కర్మ మలిన

1. కా. క. పుట. 61.

ములట. మాట,మేను పరుషములట చూడగనే క్రౌర్యం కొట్టవచ్చినట్టుకన్పించునట. ఈతని వర్ణనం శబర సేనాపతివర్ణనమునకు సంగ్రహ రూపముగా కన్పించును.[1]

నిద్రించిన పక్షులను చంపుట వీరి ధర్మమునకు విరుద్ధము కాదు.

పంజరబద్ధమైన శుకము 'అయ్యో ! మ్లేచ్ఛులకు కూడ పరిహృత ప్రవేశమైన ఈ పక్కణమును ప్రవేశించితినే !' అని వాపోవును.[2] విదేశీయులు ఈ వర్ణవ్యవస్థకు బాహ్యులే అయినను కృష్ణవర్ణము కల్గిన ఈ మాతంగులను చూచి ఏవగించుకొని వారిని తాము గూడా అస్పృశ్యులవలె చూచి యుండవచ్చును. పులిందులు, శబరులు, చాండాలులు, మాతంగు లందరును ఆ కాలమునం దస్పృశ్యులుగనే, ఒకే తెగవారిగనే పరిగణింపబడిరి. వారిని వర్ణించుచు ఈ పేర్లన్నింటినీ సమానార్థకములుగా బాణుడు ప్రయోగించెను. పుండరీకాత్మ, శుక నేపథ్యముగల వైశంపాయనుడు 'అయ్యో! నేనీ చండాల స్త్రీలు పెట్టిన అన్న కవళముల నెట్లు తిందును ? చివరకు చండాల బాలకుల కాట వస్తువునై పోతిని గదా ?'[3] అని విలపించును. అప్పుడు వర్ణవ్యవస్థ ఎంతగా వేరులు పాకిపోయి నదో దీనిని బట్టి తెలియును.

'నన్ను నీవు పట్టుకొన్నట్లె వరికినీ తెలియదు కదా ! నేను పూర్వ జన్మజ్ఞానమున్న మునిని. నన్నీ పాపసంకటమునుండి ఉద్ధరించి పుణ్యము కట్టుకొనుము. ఓ భద్రముఖుడానన్ను వదలిపెట్టుము'. అని బాలిశత్వముతో శుకము చండాలుని పాదములపై బడును. ఇక్కడ అతని జాత్యున్నతి అతనికి అడ్డు రాలేదు. ఈ విధముగా ప్రవర్తించుట వలన చండాలునకు అ వైశంపాయనుని మీద ఇంతో అంతో ఇదివరకున్న గౌరవము నశించి అతనిని ఏవగించుకొని ఇట్లు పలుకును: 'ఓ మోహాంధుడా ! నీ శరీరమునందున్న ఇంద్ర, యమ, వరుణ, సోమ, కుబేరులను పంచలోక పాలురు నీవు చేసిన అకార్యమును చూడకపోయిరి గదా! అందుకే నీ విట్లు ప్రవర్తించుచు తత్ఫలముననుభవించుచుంటివి. ఇతరుల భయముతో అకార్యము నాచరించుటయా ? నేను స్వామి అజ్ఞాబద్ధుడను' ఈ తిరస్కార వచనములు శీలము కులముకన్న మిన్న, అంతశ్శుద్ధి మిన్న అన్న విషయమును నిరూపించును.[4]

---

1. కా. పుట. 687
2. కా. పుట. 687
3. కా. పుట. 689
4. కా. పుట 690.

భూషణ భట్టు మాలపల్లెను వర్ణించుచు చండాలులు వలలను నీటిగుంటలలో కడుగుచుండిరని, మృగములు తమ బంధములను త్రెంచుకొనగా ఆ త్రాళ్ళను తిరిగి వారు పేనుచుండిరని, తెగిన కూట పాశమును (దొంగ ఉచ్చును) కొంద రల్లుచుండిరనియు, చేతిలో కోదండమును ధరించి యుండిరనియు, ప్రాసములను (కుంతములను) ధరించిరనియు, తాము పట్టుకున్న వివిధ విహంగములను పలుక రించుటయందు సమర్థులనియు, కుక్కలను విడిచిపెట్టి (ఉసికొల్పి) పరుగెత్తించ గల్గిన శబర బాలకులు వేటను క్రీడగా క్రీడించు చుండిరనియు చెప్పి వారి జీవన విధానమును, ఆదర్శములను వర్ణించుతరి శబరసేనాపతి వర్ణనమునే తల పించును.

## సూతికా గృహ వర్ణనము :-

మకరందోద్యానములను, సముద్ర గృహములను, వసంతోత్సవము లను, డోలికలను, ప్రేమ పత్రములను, పంచబాణుని బాణములను, స్త్రీ నఖశిఖ పర్యంత దేహమును, రాజమర్యాదను, నీతిని వర్ణించు సంస్కృత కావ్యములు, నాటకములు లెక్కలేనన్ని యున్నవి. కాని ప్రసూతి గృహమును, అందున్న పూచిక పుల్లతో సహా వర్ణించి నాటి సాంఘిక మర్యాదలను, వాని వెనుక దాగి యున్న నమ్మకములను, ఓషధుల బలమును, వైద్య శాస్త్ర విషయములను, స్త్రీల వేడుకలను, నవజాత శిశురక్షణ వ్యగ్రతను, ఆరోగ్య సూత్రము లను, పారిశుద్ధ్యమును వర్ణించి సాంఘిక చరిత్ర వ్రాయువారికి మహోపకారి అయిన వాడు బాణభట్టు.[1]

ఇతడు వర్ణించిన సూతికాగృహద్వార దేశమునందు పుత్రపతి ఇచ్చట కలదని తెలుపుటకు మణిమయ మంగళ కలశము లుంచిరట. మసితో పరస్పరా శ్లిష్టములయిన బొమ్మలను గీచిరట. నూనెగింజల చెట్లను పాతిరట. రకరకము లయిన ఆకులను వాని మధ్య తెల్లని పూవులను, దూర్వాగ్రములను అల్లి ద్వారము నలంకరించి వెనుక పులి చర్మమును తగిల్చిరట. ద్వారమువద్ద బంగా రపు నాగలిని రోకలిని ఉంచిరట. వందన మాలిక (తోరణము) మధ్య చిరు గంటల మాలను కట్టిరట. ద్వారమున కిరుప్రక్కల గోమయంతో నలికి గవ్వలను వెల్లకిలగా చెక్కి మధ్య మధ్యలో వివిధ వర్ణములతో అద్దిన దూది పింజలను,

1. కా. కా. పుట : 118.

పత్తి పువ్వులను అమర్చి, కుసుమ పువ్వు కేసరములవలన ఎఱ్ఱని రంగు కలసిన స్వస్తికములను, రంగ వల్లులను తీర్చుచు పసుపునీరు చిలకరించిన వస్త్రమును ధరింపజేసి షష్ఠీదేవిని (కాత్యాయినిని) నిలుపుచు, రెక్కలు విచ్చుకొన్న మయూరము నధిష్ఠించి ఎఱ్ఱని పట పతాకమును ధరించి గిరగిర తిరుగు శక్తి దండమును ధరించిన కార్తికేయుని ప్రతిమను గీయుచు, లత్తుకతో సూర్యుని చంద్రుని గీయుచు, కుంకుమపూసిన దారమునకు బంగారు కాంతులీను యవ ధాన్యమును తెల్ల ఆవాలను, మృణ్మయ గుటికలను, కదంబములను గ్రుచ్చుచు, చందనము నలదిన గోడలమీద తెలుపు నలుపు, ఎఱుపు, పసుపు, ఆకుపచ్చ రంగుల బట్ట పీలికల ఆకారములను గీచి పసుపురంగు పిండితో శరావముల (మూకుడుల) వరుసలను గీయుచు ఇంకను అనేకములయిన అలంకరణములను చేయు పురంధ్రీవర్గము (పతివ్రతవతుల సమూహము) ఉండెనట. సూతికా గృహపు దొడ్డి తలుపువద్ద సుగంధ పుష్పమాలికను మెడలో వేసి ఒక ముసలి మేకను నిలిపిరట. విలాసవతి తల దగ్గర వివిధ ధాన్యరాశుల మధ్య ఒకవృద్ధ స్త్రీని (పేద బొమ్మ అని ఒక వ్యాఖ్యాత)ఉంచిరట. సూతికా గృహములో నేతితో పాముకు బుసమును, అజశృంగి అను మూలికపొడిని అగ్నిలో వ్రేల్చుచుండిరట. బాలంతరాలి రక్షణకొరకు అగ్నిలో వేపాకును కాల్చుచు ఆ ధూమము నామె మీదికి పారింపజేసిరట. [1] బ్రాహ్మణులు శాంతి పాత్రములను పట్టి వేయుచు మంత్ర జలమును ప్రోక్షించుచుండిరట. దాదులు బట్టమీద శిశు రక్షకులయిన మాతృ గణమును గీచి పూజించుచుండిరట. అనేక వృద్ధాంగనలు సూతికా మంగళ గీతముల నాలపించుచుండగా నలువైపుల తెల్లని పూలమాలలు కట్టి యుండ ఎడతెగక నారాయణ (విష్ణు) సహస్ర నామమును పఠించుచుండగా, బంగారపు దీపస్తంభములు నిశ్చలముగా వెలుగుచు ఎన్నో దీవన లిచ్చుచు న్నట్లుండగా, ఒరనుండి తీసిన కత్తులను చేత ధరించి రక్షక భటులు నలువైపుల

---

1. సూతికాయాః పంచమ షష్ఠదినయోః :-

'ఆయాహి వరదే దేవి మహాషష్ఠీతి విశ్రుతే

శక్తిభిః సహ బాలమ్మే రక్ష జాగరవాసవే

శక్తిస్త్వం సర్వ దేవానాం లోకానాం హితకారిణీ

మాతర్బాల మిమం రక్ష మహా షష్ఠినమోస్తుతే. ఇతి షష్ఠీపూజా మంత్రః.-

గ స్త్రీ తిరుగుచుండగ తారాపీడుడు శుకనాసుని మాత్రము వెంటబెట్టుకొని నీటిని నిప్పును తాకి సూతికా గృహమును ప్రవేశించెనట.[1]

ఈ వర్ణనము వెనుక ఒక క్రొత్తజీవి ప్రపంచములో అడుగు పెట్టినపుడు ఇతరులకు కలుగు సంబరమంతయు ఇమిడి యున్నది. విలాసవతి సూతికా గృహ వైభవము సామాన్యుల ఇండ్లలో లేకపోయినను, పొగ వేయుట, పేడ బొమ్మను నిలుపుట, తెల్ల ఆవాల దండలు గుచ్చుట, రంగవల్లులు తీర్చుట, షష్ఠీదేవిని పూజించుట వంటివి సర్వజనీనములయిన ఆచారములుగా కనిపించుచున్నవి. జాన పద సాహిత్యమయిన గాథాసప్తశతిలో చూలింత తిను నొప్పులను కూడా వర్ణించి 'వల్లభవాదేన అలం' (ఇక మగని మాటే వద్దు) అని కవి ప్రసూతి వైరాగ్యమును చూపించెను.

## ఆశ్రమ వర్ణనము :-

ప్రాచీన భారత దేశములో వర్ణాశ్రమ వ్యవస్థకు సరి యయిన అర్థ ముండెను; నేటివలె నామ మాత్రము కాదు. అప్పుడు విద్యార్థులు గురుకులము నకు చేరగా, సంసారమును చేసి విరమించుకొన్నవారు వానప్రస్థులయిరి. వీరందరికిని ఋష్యాశ్రమములే ఆవాసస్థానము కాగా రాజదండనమునకు దూర ముగా కందమూలఫలములతో తృప్తిపడి జీవించువారు కొందరు, మానార్థులై ఈ ఆశ్రమములలో నుండిరి. వీరిని రక్షించుట రాజధర్మము కాగా వీరు చేసిన కర్మములో, తపస్సులో కొంతభాగము పన్నుగా రాజార్పణము కావించుచుండిరి. ఐహిక వాంఛలకు విముఖులై విద్వాంసులైన వీరిని అందరును గౌరవించు చుండిరి ఇట్టి ఆశ్రమమును వ్యాస వాల్మీకి భాసకాళిదాసు లెందరో వర్ణించినను కనివి తీరక బాణభట్టు జాబాలిముని ఆశ్రమమును వర్ణించి జీవనములోని మరి యొక పుటను పాఠకుల ముందు తెరచెను. బాణోచ్ఛిష్టమైన ఈ ఆశ్రమ గత్తును మనము పరిచయము చేసికొందము.

ఆశ్రమము ముందున శ్యామవనాంతములను, తుమ్మెదలను, మొగలి ప్రొవ్వులను, పోకమానులకు కట్టిన ఉయ్యాలలను, ఎగుడుదిగుడు భూములను, లవుల తీగలల్లుకొన్న కొబ్బరి చెట్లను, భయములేక తిరుగు లేళ్ళను కవి

1. కా.క. 120, 121.

వర్ణించెను. సమిధలను, కుశలను, కుసుమములను చేతబట్టి అధ్యయనము చేయుచు (పాఠములను వల్లె వేయుచు) వచ్చుచున్న శిష్యులను, బిందెలతో నీరు కొలనులనుండి నింపుతున్న శబ్దమును మేఘధ్వనియని భావించి చెవులు రిక్కించి వినుచు తమ పింఛములను విప్పి అగ్నిహోత్రములను విసిరి వంటచేయు నెమళ్ళను, ఉంగరాలుంగరాలుగా పైకిలేచు అగ్నిహోత్రము ఆకాశము మీదికి ఎగిరి పోవుచు మునిజనమును బొందితోనే కైలాసమునకు తీసికొనిపోవుటకు ఏర్పరచిన సోపాన పంక్తియా అన్నట్లుండుటను, తపోధనుల సంపర్కముతో శుద్ధములైనవా అన్నట్లు కనిపించుచు, కుముద వనములతో నిండియున్న దిగుడు బావులను, అందులో ప్రతిబింబించు రవి బింబ పరంపర తాపసులను దర్శించుటకు దివినుండి సప్త ఋషులు దిగి వచ్చిరా అన్నట్లుండుటను, గాలితాకిడికి వంగి మునులకు నమస్కరించుచున్నట్లున్న చెట్లను, తెల్లని పూవులను అధర్మమును నశింపజేయుటకై నక్షత్రములను రాల్చినట్లు రాల్చుచు మునులను కుసుమోపహారముతో పూజించుచున్న చెట్లను, చిగురుటాకుల దొన్నెలనే దోసిళ్ళతో మునులను ఉపాసించుచున్నట్లున్న కొమ్మలను మనకు బాణుడు చూపించి ఒకసారి ఆశ్రమము లోగిలిలోనికి తీసికొని పోవును. [1]

ఇక్కడ అంగణములో శ్యామాకధాన్యము (చామబియ్యము) ఎండబోసిరి. ఉసిరిక, రేగు, అరటి, పనస, మామిడి, తాటిచెట్లను పెంచిరి. ఎక్కడ చూచినను అధ్యయనము నందు వ్యగ్రులయిన వటువులుండిరి. వషట్కారములను నేర్చిన చిలుకలు తిరిగి పలుకు చుండెను. గోరువంకలు 'సుబ్రహ్మణ్యం' (బాగుబాగు) అని ఎలుగెత్తి అరచుచుండెను. అడవి కోళ్ళు వైశ్వదేవ బలిపిండముల నారగించు చుండెను. దిగుడుబావి వద్దనున్న కలహంసలు నివ్వరి ధాన్యమును తినుచుండెను. జింకలు నాలుకలతో మునిబాలకులను నాకుచుండెను. అగ్ని కార్యము నందు అర్ధ దగ్ధములయిన సమిధలు, కుశలు, కుసుమములు సిమసిమాయమానములయ్యెను, (ధ్వన్యనుకరణము) రాళ్ళమీద కొబ్బరికాయలు కొట్టగా అని చమురుతేలియుండెను. ఉతికిననార చీరలనుండి కారుచున్న ఎఱ్ఱని నీళ్ళతో భూమి ఎఱ్ఱనయ్యెను. రక్త చందనముతో సూర్య మండలమును చిత్రించి దానికి ఎఱ్ఱ గన్నేరు పువ్వులతో పూజలు చేసియుండిరి. విభూతి ...

1. కా. కా. ౬౮, ౬౯,

లను గీచి భోజన స్థలమును పాదధూళి పడకుండునట్లు మునిజనము కాపాడిరి. పరిచితములయిన కోతులు గుడ్డి ముసలి తాపసులకు చేయూతనిచ్చి లోపలకి బయటకి త్రిప్పుచుండెను. సరస్వతీ దేవి భుజముల నుండి జారి పడిన శంఖ వలయముల వలె, ఏనుగు గున్నలు నమలి పారవేసిన తామర తూడులు కని పించుచుండెను. జింకలు ఋషుల కొఱకు కొమ్ములతో కందమూలములను త్రవ్వి తీయుచుండెను. అడవి ఏనుగులు తామరాకు దొన్నెలతో చెట్ల పాదులకు నీరు పోయుచుండెను. అడవి పంది కోరలమధ్య నుండి శాలూక కందములను ఋషికుమారులు లాగికొనుచుండిరి. చరువు (హవిస్సు) సుగంధముతో, అర్ధపక్వ పురోడాశ పుణ్యగంధముతో, అవిచ్ఛిన్నాజ్యాహుతుల వలన ఝుంకారము చేయు అగ్నులతో, అతిథి సపర్యలతో, పితృదేవతల పూజలతో, హరిహర పితా మహుల (త్రిమూర్తుల) పూజలతో ఆశ్రమము ప్రతిధ్వనించెను. ఒకచోట తాపసులు చెట్లకారగట్టిన నార చీరలు, చెట్ల కింద కుమారికలు తీర్చిన పీతపిష్ట పంచాంగుళుల రంగవల్లులు (అయిదువేళ్ళ ముద్రలు), మరియొకచోట శ్రాద్ధ కల్పబోధ, వేరొకచోట యజ్ఞ విద్య, ధర్మ శాస్త్రాలోచనము, శాస్త్రార్థ చర్చలు వివిధ పుస్తక పఠనములతో ఈ ఆశ్రమ మొక విద్యానికేతనమై ఒప్పగా, ఆశ్రమ వాసులు తమ పనులన్నింటిని తామే చేసికొనుట నేర్చి పర్ణశాలను నిర్మించుచు, అంగణముల నలుకుచూ, ఉటజము లోపలి భాగములను ఊడ్చు చుండిరట. ధ్యానమగ్నులై కొందరు, మంత్ర సాధకులై కొందరు, యోగము నేర్చువారును, అధ్యాత్మ విద్యోపాసకులును అయి ఉండిరి. వన దేవతలకు బలులు సమర్పించువారు, మౌంజీ మేఖలను పేనువారు, నారచీర లుతుకువారు కృష్ణాజినములను శుభ్రపరచువారు, సమిధలు తెచ్చువారు, పుష్కర (తామర) బీజముల నెండ బెట్టువారు జపమాలలను గ్రుచ్చువారు, వేత్రదండమును తెచ్చి పెట్టువారు, పరివ్రాజకులను సత్కరించువారు, (వీరాశ్రమ వాసులు కారు), కమండలువులలో నీటిని నింపువారు - తమ తమ పనులలో నిమగ్నులయిన ఆశ్రమవాసులు మనకిచ్చట దర్శనమిచ్చి ! ఇది ఒక ఆదర్శ జీవన విధానము అని అనిపించునట్లు చేయును.[1]

---

1. కా. కా. పుట 70, 71.

ఇదే చాతుర్యముతో మహాశ్వేతపూజించు శూలపాణి సిద్ధాయతన మార్గము నందలి కైలాస పర్వతప్రాంత వనౌషధ వర్ణనము చేసి బాణుడు పాఠకులను తనియింపజేయును. ఆ వర్ణన మిట్లున్నది;-

భూర్జ వల్కలములు, ఆకుపచ్చని హారీతపక్షుల ధ్వనులు, భృంగ రాజములతో గిల్లివేయబడిన మొగ్గలు, మత్తెక్కిన కోకిలలు తిన్న మామిడి చిగుళ్ళు, భయము లేక చకోరపక్షులు చుంబించిన మరీచాంకురములు, సంపెంగల రంగు గల కపింజలములు తినివేసిన పిప్పళ్ళు, ఫల భారముతో వంగిన దానిమ్మ గుత్తులమధ్యలో, గూళ్ళుకట్టుకొని గుడ్లు పెట్టిన పిచ్చుకలు, కోతులు క్రీడించుచు చీల్చిన తాటియాకులు, ఒకదానితో నొకటి పోట్లాడుచు రెక్కలను కొట్టుచు పువ్వులను రాల్చిన పావురములు, పుప్పొళ్ళ రంగుతో కర్బురములయిన గోరువంకలు చేరుకొన్న పర్వతశిఖరములు, చిలుకలు కొరికి పారవైచిన పండ్లు, మేఘమునుండి జాలువారు నీటికి ఎదురుచూచి విసిగి వేసారిన చాతక పక్షుల ధ్వనితో నిండిన తమాల ఖండములు, పారావతములు రెక్కలు విదల్చగా రాలిపోవు పూగుత్తులు, చిరుగాలికే చీలి విరుగు అరటి ఆకులు, గుత్తులుగా పెరిగిన కాయలున్న కొబ్బరిచెట్లు, మెత్తని ఆకులతో పోకమానులు, పక్షులు కొరికివేసిన పిండ ఖర్జూరములు, ఆడనెమళ్ళ ధ్వనులు వీనితో ఆ ఆయతన భూమి వనశోభనంతయు వెల్లివిరియజేయుచుండెను[1]. చంద్రప్రభమను సరోవర తీరమందలిది ఈ ఆయతనము.

ఇచ్చటినుండి మహాశ్వేతాశ్రమమునకు కవి పాఠకులను నడిపించును. అక్కడ పగలే చీకట్లు కమ్మ చీకటి చెట్ల వరుసలలోనుండి లతాగృహములనుండి తుమ్మెదలు ఝుంకారమ్ము చేయుచుండగా, తెల్లని రాళ్ళ తాకిడితో, బుడగలుతేలు కాలువలు పారుచుండగా, మొనలు తేలిన కొండరాళ్ళ దగ్గర చీలిన మంచు విచ్చుకొని నీటి తుంపరలను వర్షించుచు నీహారమును ఏర్పరచగా మంచువలె ముత్యములవలె, హరుని అట్టహాసమువలె స్వచ్ఛమయిన నీటితో సెలయేళ్ళు ఆశ్రమగుహాద్వారమున కిరువైపుల పారుచుండగా, అటచామరములను నిలిపినట్లుండెనట.

1. ని. కా. పుట. 204.

ఆశ్రమమునందొకచోట యోగ పట్టిక (యోగాభ్యాసము చేయునప్పుడు ధరించువస్త్రము) ఆరవేసి యుండెనుట. విశాఖికకు (చిలుక కొయ్యకు) కొబ్బరి నారతో చేసిన చెప్పులు తగిలించి యుండిరట. ఒకవైపు అంగభస్మముతో ధూసరమైన నారచీరలు, శయనీయముండెనట. చంద్రమండలమను టంకముతో (ఉలితో) కోసి తయారుచేసినదా అన్నట్లున్న భిక్షా కపాలము, భస్మము పోసుకొను సొరకాయ బుఱ్ఱ ఉండెనట మహాశ్వేత జరిపిన అతిథి సత్కారము మాన్యము[1].

హారీత తాపస కుమారుని వర్ణనముకూడ తపోవన జీవన చిత్రణములోని భాగమే.

ఇట్టి వర్ణనమునే కాళిదాసు ఒక్క మాటలో—

'అథాజినాషాఢధరః ప్రగల్భవాక్
జ్వలన్నివ బ్రహ్మ మయేన తేజసా
వివేశ కశ్చిజ్జటిలః తపోవనం
శరీరబద్ధః ప్రథమాశ్రమోయథా'

అని ముగించెను.

హారీతుడు సూర్య మండలమునుండి ఉత్కీర్ణుడైనట్లు మెరపులతో నిర్మించబడి యున్నట్లు ఉండెనట. ఇతడు రెండవ సూర్యునివలె దుర్నిరీక్ష్యమూర్తి. బంగారుతో ఇతని అవయములు పూయబడినట్లు మెఱయుచుండెను. దేహ ప్రభతో ఎల్ల ఎడల ప్రాతఃకాలపు నీరెండును బరపుచు, అడవిలో దవానలమును వ్యాపింప జేయుచున్నట్లు ఉండెనట. ఈ వర్ణనమంతయూ కలిపి 'జ్వలన్నివ బ్రహ్మమయేన తేజసా' అని ఒక్కమాటలో కాళిదాసు ముగించెను. హారీతుని జటా కలాపము కాలిన ఇనుమువలె ఎఱ్ఱనై భుజముల మీదికి ప్రాకుచుండెను. అతడు సిగముడిని బిగించి కట్టి యుండెను. ఖాండవవనమును కాల్చివేయుటకు కపట వటువేషము ధరించిన అగ్నిదేవునివలె అతడు ప్రకాశించు చుండెను. తపోవన దేవత నూపురమువలె, ధర్మ శాసన కటకమువలె ఉండు స్ఫటికాక్ష మాలను అతడు కుడిచెవికి తగుల్చుకొని యుండెను. అన్ని విషయోపభోగముల

1. ని. కా. పుట. 216, 217.

నివృత్తి కొరకా యన్నట్లు త్రిసత్యములవలె (మనో వాక్కాయ లక్షణములవలె) భస్మత్రిపుండ్రక రేఖలను అతడు ఫాలభాగమున దాల్చి యుండెను. ఆకాశము మీది కెగయుటకు మెడ ఎత్తిన కొంగవలె, స్వర్గమార్గమును చూపించు దానివలె కన్పించు స్ఫటిక కమండలువును అతడు ఎడమచేత ధరించి యుండెను. భుజము మీద తెలుపు నలుపు మచ్చలున్న కృష్ణాజినముండెను. తామర తూడులతో నిర్మించిదా అన్నంత కోమలముగానున్న అతని యజ్ఞోపవీతము గాలికి అల్ల నల్లన ఆడుచు నిర్మాంసమగు అతని శరీరములోని ఎముకలను లెక్కించు చున్నదా అన్నట్లుండెను. కుడిచేత బట్టుకొన్న ఆషాఢ దండము చివర ఆకు దొన్నెలో దేవతార్చన కొరకు తెంపిన పువ్వులతో స్నాన మృత్తికను కొమ్ము లతో త్రవ్వి తీసికొని వచ్చు తపోవన మృగములు వెంటరాగా, శాంతవదనముతో మోక్షార్థియై హారీత కుమారుడు స్నానార్థము బయలుదేరెనట.[1]

అగస్త్య పుత్రుడగు దృఢదస్యుని వర్ణనమునూ ఇట్టిదే.

## పుత్రప్రాప్తి కొరకు వ్రతములు :-

స్త్రీ జీవితములో పుత్రప్రాప్తి కున్నంత మహత్త్వము దేనికి లేదు. స్త్రీలు చేయు వ్రతములు దానములన్నియు పసుపు కుంకుమలు నిలుపుకొనుటకు, సత్సంతాన ప్రాప్తికి, తద్రక్షణముకొరకు ఉద్దేశించి చేయునవే. విలాసవతి ఏ ఏ నోములను నోమి చంద్రాపీడుని గర్భమున ధరించెనో కవి వివరించిన తీరు ఆనాటి వ్రత నియమములను తెలియజేయును.

మహారాజ్ఞి తెల్లచీర గట్టి గుగ్గులు ధూపముతో అంధకారితమయిన చండికా దేవాలయములలో ఉపవాసముతో పచ్చగడ్డి పరచిన ముసల శయనముపై (రోకళ్ళ పడకపై) నిద్రించెనట.[2] దేహదండనార్థము చేసిన పని ఇది. గోకుల ములలో వృద్ధగోప వనితలు గోవులకు మాంగల్య మయాలంకరణము చేయగా, క్షీరపర్ణములు (మఱ్ఱి, మేడి, అశ్వత్థము, జువ్విచెట్ల పర్ణములు), పూవులు ఉన్న పుణ్య సలిలములు నిండిన బంగారు బిందెలతో ఆ ఆవుల క్రింద నిలబడి

---

1. కా. కా. పుట. 65.

2. ముసల శయనము వలన స్త్రీల అవయవములు చక్కబడి, గర్భాశయ దోషములుకూడ కుదురునని వైద్యుల మతము.

స్నానము చేసెనట. ప్రతిదినము సర్వ రత్నములను కలిపిన నువ్వులను బంగారు పాత్రలతోసహా బ్రాహ్మణులకు దానము చేసెనట. బహుళ పక్ష చతుర్దశులనాటి రాత్రులయందు ఇంద్రజాలికులు గీచిన మహేంద్రాది దేవాయతమున (మండలముల) మధ్య చతుష్పదములలో దిక్పాలకులకు బలులనిచ్చి దానములను చేసి స్నానములు చేసెడిదట. యోగుల ఆయతనములను దర్శించి వివిధములైన కామకిలను సమర్పించెనట. తన మహిమలను నిరూపించుకొనిన సప్తమాతృకలను పూజించెనట. నాగకులములకు ప్రసిద్ధములైన స్థలములలో స్నానమాడినది. అశ్వత్థ వృక్షములకు పూజచేసి ప్రదక్షిణము చేసి వందనము చేసెను. పిల్లల కొరకు ఇప్పటికిని అశ్వత్థ ప్రదక్షిణము చేయుట ఆచారమై యున్నది. ఆమె స్నాతయై కంకణములు కదలు చేతులతో స్వయముగా నూకలుకాని వరి అన్నమున పెరుగు కలిపి కాకబలి సమర్పించెను. అంబాదేవికి (జ్యేష్ఠాదేవికి) వివిధ కుసుమములను ధూపములను, విలేపములను, అపూపపలలపాయసలాజాములను సమర్పించెను. (అపూపమనగా కుడుములు, పలల మనగా నూల పిండి కలిపిన అన్నము-నూల సద్ది) శుద్ధులయిన నగ్నక్షపణకుల వద్దకు భక్తి పూర్వకముగా తానే భిక్షాన్నము తీసికొనిపోయి వారిని 'ప్రశ్న' లడిగెను. ప్రాశ్నికుల మాటను బహుమాన పూర్వకముగా గ్రహించెను. నిమిత్తజ్ఞుల నుపచరించెను. శకున జ్ఞాన వేత్తల నాదరించెను. వృద్ధపరంపరవలన తెలిసిన రహస్యముల నంగీకరించి ఆచరించెను. బ్రాహ్మణులచేత శ్రుతిపాఠములను చేయించెను. పుణ్యకథలను వినెను. భూర్జపత్రములమీద గోరోచనముతో లిఖించిన మంత్రముల కరండములను (తాయత్తులను) ధరించెను. రక్షాప్రతి సరములతో కూడిన ఓషధ సూత్రములను ధరించెను. ఆమె పరిజనులు కూడ దివ్యవాక్కులను వినుటకుబోయి ఆ నిమిత్తములను గ్రహించుచుండిరి. నక్కల కామె రాత్రులందు మాంస ఖండములను బలిగా సమర్పించెను. చత్వరములలో శివబలిని పెట్టెను. స్వప్న దర్శనములను గురించి ఆచార్యుని ప్రశ్నించెను.[1]

## సతీ సహగమనము :-

దీనినే అను మరణ మనియు, వ్యవసాయ మనియు అందురు. సహగమన విధాయకములు, నిషేధకములు అయిన వృత్తాంతములు మహాభారతములో మాద్రీ దేవి కుంతీదేవి కథలలో కనిపించును. కాని రామాయణములో దీని ప్రశంసయే

1. కా. కా పుట, 108, 109,

లేదు. క్రీ శ. 1వ శతాబ్దమునకు చెందిన గాథాసప్తశతిలో అనుమరణమును వర్ణించి నపుడెల్ల అది ఒక గ్రామణి (ఊరిపెద్ద) కుటుంబమునకు సంబంధించిన వ్యవస్థగా కనిపించును.[1] పాత సాహిత్యములో ఎన్నిచోట్ల చూచినను ఈ వ్యవస్థ విశ్వజనీనముగా తోచదు. ఇది యిట్లుండగా హర్షచరితములో బాణుడు ప్రభాకర వర్ధన చక్రవర్తి అస్తమించనుండ ఆయన పట్టపురాణి యశోమతీదేవి అగ్ని ప్రవేశముచేసి సతీత్వమును పొందినట్లు, ఆమె ధరించిన ఆర్ద్ర కుసంభవర్ణ వస్త్రములతో సహా కన్నులకు కట్టినట్లు వర్ణించినను కాదంబరి కథలో చంద్రాపీడుడు మహాశ్వేతతో పలుకు సాంత్వన వచనములలో అనుమరణమును గర్హించుచు, అది నిష్ఫలమని, సాధుజన విగర్హితమని, మూర్ఖజనాచరితమని, 'యది ప్రాణాః స్వయం నయాంతి నపరిత్యాజ్యాః' అని నిండు మనస్సుతో అమాయకముగా బలి అయిపోవు స్త్రీలపై సహానుభూతిని ప్రదర్శించును. యశోమతి మరణము ఈ ఆచారమునకు ఆనాటి సాంఘిక ప్రాబల్యమును తెలియజేయగా, బాణుని కలము దానిని ఎదురు ఎదతో ఎదురొడ్డి తన అసంతృప్తిని తెలియజేయును. ఆనాడు శిష్ట సదస్సులలో బాణుడు వ్రాసినయిట్టి వాక్యములు అలజడిని రేపి తీవ్ర విమర్శమునకు గురి అయి ఉండవచ్చును. బాణుడు బౌద్ధమత ప్రభావము వలన ఈ విధముగా వాదించియు యుండవచ్చును.

ఇదే సందర్భములో 'యదుపరతే పితరి, భ్రాతరి, సుహృది, భర్తరివా ప్రాణాః పరిత్యజ్యంతే' అని పలుకుట వలన సతీశోకము, అనుమరణము భర్తృ మరణమునకు మాత్రమే పరిమితము కాదనియు తండ్రి, సోదరుడు, మిత్రుడు, భర్త వీరిలో ఎవరు మరణించినను స్త్రీ అనుమరణమునకు సన్నద్ధ అయ్యేది దనియు తెలియుచున్నది. ఇప్పటికి పంజాబు ప్రాంతములో ఇంటి యజమాని గాని, మామగారు, తండ్రి, సోదరుడుగాని మరణించినప్పుడు కూడ భర్తృవియోగముతో వైధవ్యము ననుభవించు దక్షిణాపథ స్త్రీలవలె 'సోగ్' (శోకము)ను వెలిబుచ్చి మంగళకరములు అయిన గాజులు, తిలకము మున్నగు వానిని ధరించక ఎదలు కొట్టుకొనుచు స్త్రీలు ఏడ్చుచుండుట దీనికి తార్కాణము.

---

1. గా. స. పుట.

## చండికా వర్ణనము:-

బాణు డే విషయమును వర్ణించినను క్రమముగా ప్రతి చిన్న విషయమును పరిశీలించి, తన పరిశీలనకు సందర్భానుసారము కొంత సామ్యమును జోడించి వర్ణించును.

చంద్రాపీడుడు అచ్ఛోద సరోవరము వద్ద స్కంధావారములో వైశంపాయనుని నిలిపి తాను ఉజ్జయినికి తిరుగు ప్రయాణము కట్టును. ఇచ్చట దారిలో అడవిని వర్ణించుట సహజము. కాని అడవికి చివర చేలు, తోటను వర్ణించుచు ఒక రక్త ధ్వజమును (ఎఱ్ఱ ఝండాను) చండికాయతనమును దాని నాశ్రయించి యున్న జరద్ద్రవిడ ధార్మికుని వర్ణించును. ఈ వర్ణనములతో కథకెట్టి ప్రమేయమును లేదు. అయితే వీనినింత వివరముగా బాణు డెందులకు వర్ణించినట్లు?– అని ప్రశ్నించుకొనిన, పాఠకులకు రెండు మూడు సమాధానములు దొరుకును. కథ నవరస భూయిష్ఠముగా నుండవలెను కనుక ప్రధాన కథలో అవకాశములేని బీభత్సమును, ధార్మికుని వర్ణన వలన హాస్యమును కవి పోషించెను. రెండవ ప్రయోజనము ఇంతకన్న బలమైనది. మధ్యకాలములోని కవులందరును ఇట్టి చండికాయతనములను, నరబలులను ఏదో ఒక రూపమున వర్ణించి ఆనాడు ఉత్కటమైన సాంఘిక పరంపరను గ్రంథస్థము చేసిరి. ప్రతి అద్భుత కథలోను ఒక రాకుమారిని బలి ఇచ్చుటకు చండికాయతనమునకు ఎవరో అపహరించుకొని పోవుట, అక్కడ ఏదో ఒక అద్భుతము జరిగి రాకుమారుడెవరో వచ్చి ఆమెను రక్షించుటయును చెప్పుచుందురు. ఆనాడు అతి ప్రబలముగానున్న శాక్తమునందలి వామదక్షిణాచారములను, భైరవాచార్యులను, కౌలనారీగణములను, విపరీతముగా జరుగు పశుబలులను కవులు వర్ణించిరి. శంకరులవంటి ఆచార్యులు శక్తిస్తోత్ర రూపమున ప్రజల నమ్మకములను గౌరవించి వారిని శాంతపరచి సౌమ్యులను చేసిరి. ప్రభాకర వర్ధన చక్రవర్తి పరమ మాహేశ్వరుడు. బాణుడు నంతియే. అతని పేరే చెప్పక చెప్పుచున్నది. పైగా అతడు చండీ శతకము నొక దానిని రచించెను. శైవాచార్యులలో నొకరు బాణనామధేయులున్నారు. వీరశైవ సంప్రదాయాచార్యులలోను బాణుడొకడున్నాడు. అతడీ కవి బాణుడే కావచ్చును. మహాశ్వేత పూజించు శూలపాణి కైలాసవాసి. వింధ్య వాసిని యగు చండికను స్తుతించువరకు బాణునికి తనివి తీరినట్లు కనిపించలేదు. పైగా, జరద్ద్రవిడ ధార్మి

కుని ఒకనిని చూచి అతని చిత్రమును తన లేఖినితో చెక్కి అమరము చేసెను. మూఢనమ్మకములను ఈ జరద్ద్రావిడ ధార్మికుని రూపములో వ్యంగ్యరూపమున బాణుడు చూపించెను. భవభూతి, అతని సమాకాలికుడైన వాక్పతిరాజు ఇట్టి చండికాయతనముల వర్ణనమునే చేసిరి. ముఖ్యముగా వాక్పతిరాజు గౌడవహో కావ్యములో వింధ్యవాసినిని స్తుతించిన తీరు బాణుని వర్ణనమునే తలపించును.

తొలుత ఆయతనము ముందున్న రక్తధ్వజమునును బాణుడు వర్ణించుచు పాఠకుల ఒడలు జలదరింప జేయును. కాదంబరీ గౌడవహోకారు లిరువురికిని చండికా పూజాద్రవ్యములన్నియు బీభత్స ప్రాయముగానే కన్పించినవి. పువ్వులు, పండ్లు ఎముకలవలె, మాంసఖండములవలె, రక్తచందనాను లేపనము, రక్తాను లేపనమువలె కనిపించును.

## రక్తధ్వజము :-

అడవి చివరలో అటవీక్షేత్ర ప్రాంతములో రక్త చందన వృక్షము మీద ఒక రక్త ధ్వజముండెను. దీనికి చందన రసమలది యుండిరి. ధ్వజ దండమునకు నాలుకలవలె ఎఱ్ఱని పతాకములను, అప్పుడే చంపిన జంతువుల అవయవముల వలె కనిపించు కృష్ణ చామరములను చుట్టి యుండిరి. ధ్వజ శిఖరముమీద తామరస బీజములతో (గవ్వలని ఒక వ్యాఖ్యాత) చేసిన ఒక బుద్బుదాకార కందుకము, దానిక్రింద అర్ధ చంద్రాకార అలంకరణము, సూర్యుడు తన కుమారుడగు యముని వాహనమైన మహిషమును రక్షించుటకు శివుని తలమీదనున్న చంద్రలేఖను బ్రతిమాలి పిలిపించెనా యను భావమును కలిగించుచుండెను. క్రిందికి వ్రేలాడు ఇనుప గొలుసులకు కట్టిన గంట, సింహపుజూలుతో తయారు చేసిన చామరము, కాంచన త్రిశూలముతో ఆకాశమునే ఇటునటు వీచుచున్నట్లున్న ఈ రక్తధ్వజము ఉపహారములతో వచ్చు పథికులకు మార్గమును చూపుతున్నదా యన్నట్లుండెను.

ఆ ధ్వజము ననుసరించి కొంతదూరము పోగానే చండికాలయము కనిపించెను. ఈ ఆలయమునకు మొగలి ముండ్లవలె తెల్లగానున్న ఏనుగుదంతపు ప్రాకార ద్వారముండెనట. ద్వారమునందు ఇనుప తోరణము, దానిమీద ఉక్కుటద్దముల మాల రక్త చామరములు-వీనితో ఈ ద్వారము ఎఱ్ఱని జుట్టుగల శబరుల

వలె కన్పించుచుండెను. ముందుకు పోగానే లోహ మహిషము అంజన శిలా వేదిక పైన ప్రతిష్ఠితమై యుండెను. దానిమీద నున్న రక్త చందనపు చేతి ముద్రలు యమునిచేతి రక్త ముద్రలవలె కన్పించగా ఆ మహిషము కన్నులలో రక్తమున్నదనుకొని నక్కలు నాకుచుండెనట.

ఒకచో ఎఱ్ఱ కలువలు శబరులు చంపి పారవేసిన మహిషముల లోచనములవలె నుండెను. అగస్త్య ముకుళములు (అవిసె మొగ్గలు) సింహపు గోర్లవలె, మోదుగ మొగ్గలు రక్తసిక్తములయిన పులిగోర్లవలె నుండెను. జింకలను చంపి వాని కొమ్ములను పడవేయగా అవి మొలచిన అంకురములట్లు చంపిన జంతువుల నాలుకలు పల్లవితమైనట్లు ఊడబెరకిన కన్నులు పూవులవలె, తల కాయలు పండ్లవలె కన్పించసాగెను. పువ్వులు కన్నులవలె నున్నవని వర్ణించుటలో వామాచార దక్షిణాచార సంప్రదాయముల మేలనము నిచ్చట కవి చేసెను. అంగణమునందలి రక్తాశోకముల క్రింద కుక్కల భయమునకు వచ్చి దాగిన అడవికోళ్ళ ఎఱ్ఱని శిఖలు అకాలములో ఆ చెట్టుకు పూచిన పూలవలె కన్పించెను. తాటి పండ్లు రుధిరపాన తృష్ణతో అచ్చటికి చేరిన వేతాళులు చండికకు సమర్పించు ముండోపహారములవలె నుండెను.గాలికి కదలాడు అరటిచెట్లు శంకాజ్వర కంపితములైనట్లు మారేడుకాయలు భయముతో పులకాంకురములను పొందినట్లు, ఖర్జూర వనములు భయము, అలసటతో వెంట్రుకలు పైకి రేగినట్టు కనిపించెను.

అచ్చట క్రీడించు సింహకిశోరముల గోర్లనుండి ఏనుగుల కుంభస్థలములను చీల్చినపుడంటుకొనిన రక్తసిక్తములయిన ముత్యములు జారిపడగా వానిని రక్తము కలిపిన అన్నపు మెతుకులనుకొని కోళ్ళు తినబోయి మానుకొనెనట. ఈ అంగణములో పారు రక్తపుటేరులో ప్రతిబింబించిన సాయం సంధ్యారుణ సూర్య బింబము, అంత రక్తమును చూచి మూర్ఛిల్లి అందు పడినదా యన్నట్లుండెను.

గర్భగృహద్వారమునకు దీపములు, ధూమపాత్రములు, రక్తాంశుకములు వ్రేలాడుచుండెను. నెమలి కంఠముల దండ తోరణముగా కట్టి యుండిరి. పిండి పూతతో తెల్లబడిన గంటల వరుస కట్టబడి యుండెను. సీసపు సింహము నోటి మధ్యన ఉన్న ఇనుప మేకు, ఏనుగు దంతపు గడియమాను, తలుపుకు బిగించు బుడగల గొలుసులున్న తలుపులు, పసుపు, నీలము, ఎఱుపు అద్దములలో ప్రతి

బింబించుచు చూపరులకు దర్శనీయముగ నుండెను. చండికా విగ్రహపు పాద పీఠముపైన సమర్పించిన లత్తుకలో అద్దిన వస్త్రములు శరణుజొచ్చిన సర్వపశువుల జీవితమువలె నుండెను. గొడ్డలి, పట్టిసము వంటి జీవ వినాసన శస్త్రముల కాంతులతో గర్భగృహ మంధకారితమై చండిక పాతాళ గృహవాసినియా యని అనిపించెను. చండిక మెడలో వేసిన బిల్వఫల పత్రముల హారములకు ఎఱ్ఱచందన మలదుటవలన ఆ హారము చిన్నపిల్లల ముండమాలవలె నుండెను. ఎఱ్ఱని కదంబములతో అర్చించుట వలన, పశువులను బలి ఇచ్చునపుడు కొట్టి పటహారటితములవలన చండిక రోమాంచిత అయినదా అన్నట్లు క్రూరముగా కనిపించెను. చండికను కవి రక్తాంబర ధారిణియగు అభిసారికగా వర్ణించెను. అభిసారికలు సహజముగా నల్లని వస్త్రములు, తెల్లని వస్త్రములను మాత్రమే కాలానుగుణముగా ధరింతురు. ఈ చండికాభిసారిక మహాకాలుని అభిసరించుచు సర్వరక్తగా కనిపించెను - నొసటిపై బంగారు రేకు, శబర సుందరులు రచించిన రక్తతిలక బిందువు, చెవులకు పెట్టుకొన్న దానిమ్మ మొగ్గ కాంతితో ఎఱ్ఱబడ్డ కపోలభిత్తి, రుధిరమను తాంబూల చర్వణముతో ఎఱ్ఱబడ్డ పెదవులు, బొమముడిపాటుతో ఎఱ్ఱనయిన కన్నులు, కుసుమ పువ్వుతో రంగరించిన పట్టువస్త్రపు కాంతితో 'సర్వరక్తామహేశ్వరీ' అన్నట్లు బయలుదేరినట్లుండెను. గర్భగృహ మందలి దీపికా లతలపై గుగ్గిలము చల్లగా, ఎఱ్ఱని పొగలు చిమ్మినపుడు కాత్యాయని, మహిషాసురుని రక్తమంటిన తన వ్రేళ్ళతో త్రిశూల దండమునకు తన మూపున రాసుకొని తప్పుచేసిన వనమహిషమును బెదరించుచున్నదా యన్నట్లుండెను. గుడిలో నిడుపైన గడ్డములున్న మేకపోతులు కూడా వ్రతనిష్ఠము లైనట్లు, నోరు కదల్చుచున్న ఎలుకలు గూడా జపము చేయుచున్నట్లు, కృష్ణాజినమును కప్పుకొన్న జింకలుగూడ గుడిముందు ప్రాణాచారము బడినట్లు, పడగమీద మెరయు మాణిక్యములున్న పాములు కూడ గండాదీపములను మోయుచున్నట్లు, కావు కావుమని అరచు కాకులుగూడ చండికను స్తుతించు చున్నట్లుండెను.

ఇంతటి సూక్ష్మాతి సూక్ష్మ వర్ణనము, దానితో జోడించిన కావ్య శిల్పము, భావనా బలము, అలౌకిక కవితాశక్తి, పదగుంభనము వేరెక్కడను కన్పించవేమో !

## జరద్ద్రవిడ ధార్మికుడు:

దేశాంతరము నుండి పొట్టచేతబట్టుకొని వచ్చినవారు భాషాజ్ఞానములేక, ఆచార వ్యవహారములు తెలియక, కొంత మూర్ఖతవలన, ఛాందసప్రవృత్తి వలన అపహాస్యము పొలగుట మనము చూచుచున్నాము. దానితోపాటు అట్టివారికి మూఢ నమ్మకములు, కొంత క్రూరబుద్ధి ఉండిన యెడల జనులువారికి భయపడి అమడ దూరములో నుందురు. అట్టివాడే ఈ చండిక నాశ్రయించిన జరద్ద్రవిడ ధార్మికుడు. ద్రవిడదేశము నుండి వచ్చినందున మధ్య దేశముల కతడొక వింత వస్తువుగా కన్పించి యుండవచ్చును. అతని వ్యంగ్య చిత్రమును ఇచ్చట బాణుడు మన ఎదుట పెట్టెను. అతని దేహములో ముసలితనమువల్ల పైకితేలిన సిరలు, అతడు దగ్గ వృక్షమనుకొని పైకిచేరిన గోధా, గోలికా, కృకలాసములవలె (బల్లులు, తొండలు, ఊసరవెల్లులువలె) ఉండెనట. వార్ధక్యపు చంద్రకములు శరీరమంతట వ్యాపించి చిల్లులుపడ్డ గవాక్షమువలె నుండెను. మశూచివల్ల ఏర్పడిన మచ్చలవలన అతని అవయవములు వక్రించుటవలన అతని దేహము నుండి శుభలక్షణములను త్రవ్వుకొని పోయినట్లుండెను. చెవిమీద కట్టిన సిగ రుద్రాక్ష మాలవలె నుండెను. అంబికా పాదములపై తలను కొట్టుకొనుటవలన నొసట కంతి ఏర్పడెను. పడిరాని వారిచ్చిన కాటుక (అంజనము)తో ఒక కన్నుపోగా మిగిలిన కన్నును కాపాడుకొనుటకు త్రికాలములయందు కర్రపుల్లతో మందు రాచుకోగా ఆకన్నుకూడ సన్నబడెను. ముందరకు జారిన పండ్లకు చేదు సొర కాయ సొనను రాచువాడట – గట్టిపడుటకై. నొప్పియున్నదను భ్రాంతితో భుజముమీద కాలిన ఇటుకలు పెట్టుకొనుటవలన పుండ్లుకాగా వాసిని మాన్పుకొను టకు పాపము నూనె రాచుకొనువాడట! అన్ని మందులును పెట్టుకొనుటవలన ఉన్న కొంచము చూపు కూడా అనుటలేదు. రాళ్ళను పగులగొట్టుటకు పంది కోరను సంపాదించెనట. గారకాయ బుర్రలలో మందులను దాచేవాడట. పట్టు పురుగులు కరచుటవలన కాలి వ్రేళ్ళకు పుండ్లయినవట. బాగుగా వండని రసా యనము త్రాగి అకాల జ్వరమును తెచ్చుకొనెనట. ముసలితనములో గూడ తనను దక్షిణాపథ అధిపతిని జేయుమని పార్వతీదేవిని ప్రార్థించి ఆ కోరికను హృద యము నుండి తీసివేయలేక పోయెనట (హర్షుడా?) మిడిమిడి జ్ఞానమున్న శ్రమణకుడిచ్చిన తిలకముతో తనకదృష్టము పట్టనున్నదనుకొనెను. ఆకుల రస ముతో కలిపిన బొగ్గుమసి అలిచిప్పలలో దాచి యుంచెను. దుర్గాస్తోత్రమును

పట్టికపై (బట్టపై) వ్రాసియుంచెనట. మంత్ర తంత్రములకు సంబంధించిన తాళ పత్రములపై ఎఱ్ఱని లక్కను అద్ది పొగచూరించెనట. వృద్ధ తాపసులు చెప్పిన రీతిని మహాకాల మతమును (పూజా విధానమును) వ్రాసియుంచుకొనెనట. నిధి నిక్షేపములున్నవని నమ్మచు బంగారము చేయు రససిద్ధిని సాధించుచు పాతాళ మును ప్రవేశించి నిధులు పొందవలెననుకొచు మంత్ర తంత్రములతో యక్షిణులను కామించి వశరచుకొందుననుచు అంతర్థాన మంత్రసాధన వ్యామూఢుడై శ్రీ పర్వత మును గురించిన ఆశ్చర్య కథలు చెప్పుచుండెను. ఆవాలు మంత్రించి దయ్యాలు పట్టిన వారిమీద చల్లుటవలన వారు వేసిన దెబ్బలతో అతని చెవులు అణిగిపోయి ఉండెను. సొరకాయబుర్ర ఏకతార పట్టుకొని తల ఆడించుచు గార్దభ స్వరముతో గానము చేసి బాటసారులను అదరగొట్టి పారిపోయేటట్టు చేసేడివాడు. తన భాషలో రచించిన భాగీరథీ స్తవమును గానము చేయుచు నృత్యము చేసెడివాడు. ఇతడు ఘోటక బ్రహ్మచారి. ఇతర దేశముల నుండి వచ్చిన వృద్ధ సన్యాసినులమీద వశీకరణ చూర్ణమును చల్లువాడు. దేవాలయమునకు వచ్చిన బాటసారు లందరి తోను కోపముతో మల్లయుద్ధము చేయువాడు. ఆ మల్లయుద్ధములో అతని నడుము విరిగినది. చిన్న పిల్లలు అతని వికారరూపమునుచూచి గేలిచేయగా వారి వెంట పడినప్పుడు వారు విసిరిన మట్టిపెడ్డలు, రాళ్ళతో మెడ, తల చెక్కుకొని పోయినవి. ఇతర ధార్మికులను జనులు ఆదరించుటను సత్కరించుటను ఓర్వ లేకుండుట ఇతని తత్త్వము. ఇన్ని అవలక్షణములకు తోడు ఇతనికి రేజీకటి కూడా ఉండెను. కనుక పగలు మాత్రమే తిరుగాడువాడు. తిండిపోతు గనుక పెద్ద పొట్ట ఉండెడిది. చెట్ల పండ్లను రాల్చునపుడు కోతులు ఇతని మీదపడి రక్కగా ముక్కు చెక్కుకొని పోయెను. ఈ విధముగా అన్ని అవగుణముల పుట్ట ఈ ధార్మికుడు.

## మహాభారత రామాయణాలు:

రామాయణ భారతాలు రెండును భారతీయ సాహిత్యమునకు తలమాని కములయినా వాల్మీకి రామాయణము అంతగా ప్రమాణము కాదనియు, దాని మూలమయిన నారదీయము ప్రమాణమనియు, అది లోపించిపోయినదనియు ఒక ప్రథ గలదు. అందుకే కాబోలు బాణుడు భారతము మీద తనకున్న విపరీత

మయిన ప్రత్యయమును తెలియజేయును.[1] కాదంబరిలో గూడ అనేక స్థలములతో భారత ప్రశస్తిని బాణుడు పొగడును. బాణుని కాలములో భారత ఇతిహాసమున కెక్కువ ప్రశస్తి యుండెనేమో! అందుకే 'వ్యాసోచ్ఛిష్టం జగత్సర్వం' అను వ్యాసైకయోగ్యమగు మాన్యబిరుదమును 'బాణోచ్ఛిష్టం జగత్సర్వం' అని బాణుడు కూడా పొంది ధన్యుడయ్యెను.

## పుండరీకుని లేఖ

ప్రాచీన కాలములో వ్రాతసామగ్రికి దాళపత్రములను దక్షిణా పథము వారును; భూర్జపత్రములను ఉత్తరాహులును వాడుచుండిరని మనకు తెలియుచున్నది. పుండరీకుడు మహాశ్వేతకు ప్రేమలేఖను వ్రాయుటకు తమాలపల్లవమును త్రెంపి దానిని బుడమీద చిదిపి, ఆ రసముతో నారచీరలోని ఒకభాగము లేఖ వ్రాసెనని, అనగా తన చిటికెన వ్రేలి గోటితో నారచీర చింపుపై అక్షరములు లిఖించెనని బాణుడు వర్ణించినాడు.

## భారత వర్షము

భారత ఖండము కర్మభూమియని, ఇది మర్త్యలోకపు చివర అని వర్ణించినవాడు బాణుడు. ఇతని కాలమునకు ఇది ఒక భౌగోళిక, సాంస్కృతిక సమగా నెలకొనినది.

## పూర్ణ పాత్ర గ్రహణము

ఆనందోత్సేకము గలిగిన ఉత్సవముల సందర్భములలో పరిజనులకును స్నేహితులకును తమ దేహము మీదనున్న ఆభరణములను, వస్త్రములను ఒలిచి ఇచ్చుట సంప్రదాయము. దీనినే పూర్ణపాత్రగ్రహణము అని కవి అనెను. 'పూర్ణపాత్రం జహార' అనునది ఒక పదబంధమే అయినది) మీ సవతి గర్భము ధరించినదని చెప్పు కులవర్ధన అను దాది తారాపీడుని వద్ద పూర్ణ పాత్రను గ్రహించెను రాజ భవనములో శుకనాసుడుండగా అతనికి పుత్రోదయమైనట్లు

1. (a) 'పఠ్యమానే సర్వమంగళ మహాయసీ మహాభారతే' కా.కా. పుట 313.
(b) హర్షచరిత్ర శ్లోకాలు, (c) 'మహాభారతమివ అనంతగీతాకర్ణనానందిత నరం'—రాజకులవర్ణనము. కా కా. పుట 147.

వార్త అందగనే తారాపీడుడే అతని ఉత్తరీయమును పూర్ణపాత్రముగా గ్రహించెనట.

## ఇతర ప్రాంతములు :-

బాణుడు 'నరనారాయణ చరణ ముద్రాంకిత బదరికాశ్రమ...' అని బదరికాశ్రమ ప్రాశస్త్ర్యమును చెప్పెను. హరిద్వారమును, కైలాసమును, మానస సరోవరమును, అలకానగరమును వర్ణించిన కాళిదాసు బదరికావనమును ప్రస్తావించలేదు.[1]

కాళిదాసు వర్ణించిన ఉజ్జయినిని, మహాకాలుని ఇతడు గూడా వర్ణించెను. ఉజ్జయినిలో మహాకాలునికి సూర్యుడు తన రథాశ్వముల మెడల సందులోనుంచి నమస్కరించెనట.[2]

## పెంపుడు జంతువులు, పక్షులు :-

కాదంబరి చంద్రాపీడుని మరణానంతరము అనుమరణార్థము సన్నద్ధమై తన ప్రియ సఖి మదలేఖకు అప్పగింతలు పెట్టుచు తాను పెంచిన మాధవీ లతకు సహకార వృక్షమునకు వివాహము జరిపించ వలెననియు, మాలతీ లతను, అశోక వృక్షమును, చూత వృక్షములను శ్రద్ధతో పెంచవలెననియు, తన పడక టింటిలో తలవద్ద నున్న కామదేవుని పెద్ద పటమును చించివేయవలెననియు చెప్పుచు, తాను పెంచిన కాలింది అను గోరువంకకును, పరిహాసమను చిలుకకును పంజరవిముక్తి కలిగించవలెననియు, తన ఒడిలో పండుకొని నిద్రించు నకులిక (ముంగిసను) ఒడిలో పడుకోబెట్టుకొని లాలించ వలెననియు, తాను పెంచిన తరలకమను హరిణమును ఒక తపోవనములో విడిచిపెట్టవలెననియు, తాను పెంచిన జీవంజీవ (చకోర) మిథునమును క్రీడా పర్వతములో భద్రముగా కాపాడవలయుననియు, తన కాలివద్ద పెరిగిన హంసను ప్రేమతో రక్షించవలెననియు, మనుష్యులతో పరిచయములేని వనమానుషిని (అడవి మనిషిని) మరల అడవిలోనే వదలి వేయవలయుననియు, క్రీడా పర్వతము నొక తాపసికి, ఉలం

---

1. కా. కా. పుట : 94     2. కా. కా. పుట : 90.

కరణములను బ్రాహ్మణులకు దానము చేయవలయుననియు, వీణను తానే ఉంచు కొనవలయుననియు చెప్పెను.[1]

చంద్రాపీడుడు కైలాస పర్వత ప్రాంతములోనున్న అచ్ఛోద సరోవరము వద్ద జలాన్వేషియై తిరుగుచున్నప్పుడు ఒక పర్వత గుహముందు వన మానుష మిథునమును చూచెనట. ఈ అడవి మనుష్యులు ఎలుగుబంటికి, చింపాజీ కోతికి, మనిషికి మధ్య దశలో నున్న జీవులేమో ! వానిని పెంచుట దుస్సాధ్యమని కాదంబరి మదలేఖతో చెప్పి, అడవిలో వదలివేయుట ఉచితమని ఉపదేశించి యుండును.[2]

## తాంబూల చర్వణము

భారతీయుల జీవనములో అవినాభావ భాగము తాంబూల చర్వణము. వారి ఆతిథ్యమునకు, మర్యాదలకు ప్రతీకగా నిలుచునది తాంబూలము. ఈ గౌరవ తాంబూలమును చంద్రాపీడుడు కాదంబరినుండి గ్రహించి దానితోపాటు ఆమె హృదయమును గూడ గ్రహించెను.[3]

కాదంబరి తన అంతరంగ సంరక్షుడైన (Consience keeper) కేయూరకుని వెంట తనకు చంద్రాపీడుని యెడలగల ప్రేమాభిజ్ఞానముగా ఒక నలినీ పత్ర పుటమును తామర దారముతో చుట్టి దానిమీద చిన్నచిన్న తామర తూడులతో పచ్చిగంధము ముద్రవేసి ఆ పత్రపుటమును తడి గుడ్డతో చుట్టి చంద్రాపీడుని వద్దకు పంపెను. ఆ తామరాకు ముడిని కేయూరకుడు చంద్రా పీడుని వద్ద విప్పి అందుండి పచ్చలవలె కాంతులీనుచు పాలుగారు వానిని పొట్టు దీసిన పూగీ ఫలములను, గోరువంక కపోలములవలె పలుచనై పాండు వర్ణము గల తమలపాకులను, శివుని తలమీద నిలిచిన చందమామంత స్థూలముగా నున్న కర్పూరము ముద్దను బాగుగా కస్తూరి కలిపి రంగరించిన గంధమును చంద్రా పీడునికి సమర్పించెనట. ప్రేమికులకు పంపు ఉపహారములు ఎంత పేశలములో, అందు తాంబూల ముండుట ఎంత అనివార్యమో ఈ వర్ణనము వలన తెలియు చున్నది

---

1. ని కా పుట. 625. 2 కా. కా. పుట. 196.
3, కా. కా. పుట. 293,

## మర్యాదలు

బాణుడు మనుష్యుల ప్రవర్తనను, మర్యాదలను, రాజాంతఃపురము మొదలు ఋష్యాశ్రమములవరకు గల వైవిధ్యముతో చిత్రించెను. పరస్పరము కలిసికొన్న మిత్రులు సబహుమానముగా భూమి మీద కూర్చుండుట, తారాపీడుని ఎదుట, శుకనాసుని ఎదుట చంద్రాపీడుడు భూమిమీద కూర్చుండుట నాటి సాంఘిక మర్యాదలనేకాక రాచ మర్యాదలను కూడ ప్రతిబింబింపజేయును.

'దిష్ట్యా వర్ధయామః, దిష్ట్యా వర్ధసే' అనునవి అభినందించుటకు వ్యవహరించు చుండిరి.[1]

అనుకోకుండ వచ్చిన చంద్రాపీడుని మహాశ్వేత అతిప్రసన్నయై ఆదరించగా చంద్రాపీడుడు తన అభీప్సిత సిద్ధికొరకు ఆమెను దర్శించెనట సాత్త్వికోద్రేకముతో తలమునుకలయిపోవు కాదంబరిని చూచెనట, చేతుల జోడించి కంఠాశ్లేషము చేత మదలేఖను సంభావించి, కాళ్ళపై బడ్డ పత్రలేఖను పైకి లేవనెత్తి, కేయూరకుని పునః పునః పరిశీలించి తనను గుర్తించి నమస్కరించుచు ఇటనటు పరిగెత్తు పరిజనము తన ఆగమన వార్తను అందజేసిన సఖీజనము పూర్ణ పాత్రము నపహరింపగా హేమకూటము చేరెనట.

ఇట్లే కేయూరకుడు ప్రథమ పర్యాయము కాదంబరి వద్దనుండి సందేశమును గొనివచ్చి స్కంధావారమునందు విడిసిన చంద్రాపీడుని దర్శించిన 'చూడామణిని చుంబించు కోమలాంగుళులు ఎఱ్ఱని కాంతులు చిమ్ముచుండగా అంజలి యొగ్గి నమస్కరించు చున్నది కాదంబరి' అని చెప్పుట, గద్గద కంఠముతో మహాశ్వేత కుశల ప్రశ్నలు వేయుట, శిరోరత్నము నుదుటిపై పడి కాంతులు విరజిమ్మునట్లు మదలేఖ కిందికి వంగి నమస్కరించుట, కన్యకాజనము పాపటంరేఖలు, మకరికా కోటి (స్తనమండలము మీద గీచిన చిత్రముల) భూమిని స్పృశించగా వంగి నమస్కరించి పాదధూళి గైకొనునట్లు పాదములను స్పృశించుట, తమాలిక చంద్రాపీడుని అభినందించిన తీరు వారి వారి యోగ్యత

---

1 ని.కా పుట. 705.

లను స్తరమును తెలియజేయును.[1] చంద్రాపీడుడు ఉజ్జయినీ ప్రస్థానము చేయుచు, మేఘనాథునితో పత్రలేఖతో కలిసి ఉజ్జయినికి రావలెనని చెప్పుట, కేయూరకుడు పత్రలేఖను స్కంధావారమువరకు విడిచిపెట్టునని ఆదేశించుట, కాదంబరీ పరిజనమును మేఘనాథుని ముఖమున కుశల ప్రశ్న వేయు పద్ధతిలో కూడా ఈ తారతమ్యము కనిపించును.[2]

చంద్రాపీడుడు తాను జీవించి యున్నచో తిరిగి దర్శనము చేసికొందునని కాదంబరికే సందేశము పంపుట, ప్రదక్షిణ పూర్వకముగా మహాశ్వేత పాద వందనము చేసితినని చెప్పుట, మదలేఖను కంఠగ్రహణ పూర్వకముగా ప్రణామము చేసితినని చెప్పుట, తమాలికను గాఢాలింగనము చేసికొంటినని చెప్పుమనుట, కాదంబరి పరిజనమును కుశలప్రశ్న వేసితిననుట, భగవంతుడైన హేమకూటమును అంజలి బంధముతో అర్చించితినని తెలుపుట—ఇవన్నియు పారివారిక మర్యాదలను చిత్రించుటలో బాణుని సూక్ష్మ పరిశీలనమును తెలియజేయును.

కాళిదాసాదుల నాయికలు కేవలము ప్రేమకొరకే సృష్టింపబడిన వారు. వారికి చుట్టుపట్ల మనుష్యులతో గల సంబంధమును కవులు ఎక్కువగా చర్చించలేదు. చర్చించినను వారు అల్లంత దూరముననే నిలబడి సంఘటనలను చూచువారే. వారి దంతయూ ఒంటరి సంసారము వంటి జీవితము. అందుననే అందు పాత్రల సంఖ్య పరిమితముగా నుండును. కాదంబరిలో నన్నచో లెక్కకు మిక్కిలి పాత్రలు, వివిధ బాంధవ్యాలు, వివిధరీతుల ప్రేమలు, త్యాగములు—ఇదంతయు ఒక సమష్టి కుటుంబ వ్యవహారము వలె నున్నది.

1. వి. కా. పుట. 594, 595, 451.

2 వి. కా పుట 452.

# బాణుని సుభాషితములు

సంస్కృత సాహిత్యమే సుభాషితములకు పుట్టినిల్లు. జైన బౌద్ధ ప్రాకృత సాహిత్యములు ఈ పరంపరకు పుష్టి కలిగించెను. పూర్వాపరములతో సంబంధమున్నను సుభాషితములను ఆ సందర్భమునుండి తొలగించి వేరొకచోట ఉపయోగించి నప్పటికిని సరిగ అతుకును. ప్రతి మానవుని సమస్యలకు, హృదయమునకు ఈ సుభాషితములతో కవి చేరువ అయి 'కాంతా సమ్మిత తయా' ఉపదేష్ట అగును. నీతిబోధ కావ్యప్రయోజనము లన్నింటిలోను ప్రధానము కావున ఈ నీతిని కవి సుభాషితములద్వారా బోధించును.

కాదంబరి అవతారికా శ్లోకములోనే కవి-

'సుభాషితం హారి విశత్యధో గలాత్
నదుర్జనస్యార్క రిపోరివామృతం
తదేవ ధత్తే హృదయేన సజ్జనః
హరిర్మహారత్న మివాతి నిర్మలం'

అని సుభాషితముల సాంఘిక ప్రయోజనమును (రాహువు గొంతులోనికి అమృతము దిగనట్లే దుర్జనులకు సుభాషితములు మింగుడు పడవు. వారిని క్రాంత దర్శి అయినను మార్చలేడు. అదే మంచి మాటను మంచివాడు విష్ణువు కౌస్తుభమును వక్షఃస్థలమున ధరించినట్లు హృదయమున ధరించును—మననము చేసికొనును.) వక్కాణించును. ఈ ఒక్క మాటలో సుభాషితములు జిజ్ఞాస గలవారికే గాని మూర్ఖుల కొరకు కావన్న సత్యమును బాణుడు ఘంటా ఘోషముగా చెప్పెను. మంచివారికి ఇతడు కాదంబరిలో చెప్పిన సూక్తులనేకము. సూక్తులన్నిటిలోను రత్నము వంటిది శుకనాసోపదేశము. దీనికంటే భిన్నమయిన సూక్తులు మానవుని జీవనరంగములోని వివిధ అనుభవములను, ధర్మాధర్మములను, సత్యాసత్యములను, ఇన్నింటిని మించిన పరోపకార పరాయణత్వమును ఉగ్గడించును. స్థాలీపులాకన్యాయముగా కొన్ని సూక్తులను ఇచ్చట ఉదాహరించుచున్నాను.

1) నాస్తి జీవితా దన్యత్ అభిమతతరం ఇహ జగతి సర్వజంతూనామ్. (సర్వజంతువులకును జీవితముకన్న ఇష్టమయినది మరొకటిలేదు.)[1]

2) కిమివ దుష్కరం అకరుణానామ్! (క్రూరులు చేయరాని చెడ్డపని లేదు.)[2]

3) ప్రాయేణ అకారణ మిత్రాణి అతికరుణానిచ సదాభలు భవంతి సతాం చేతాంసి (గొప్పవారి మనస్సులు అకారణమైత్రి గలవి, కరుణామయమైనవి.)[3]

4) పుణ్యానిహి నామగ్రహణాన్యపి మహామునీనాం కింపునర్దర్శనాని (మహామునుల పేరు స్మరించుటయే పుణ్యకరమైనప్పుడు వారిదర్శనమునుగురించి చెప్పవలెనా!)[4]

5) అనాథపరిపాలనం హి ధర్మః అస్మద్విధానామ్ (మనబోటివారికి అనాథ పరిపాలనము ధర్మము.)[5]

6) గురూపదేశశ్చనామ పురుషాణాం అఖిలమల ప్రక్షాళన క్షమ జలం... (గురూప దేశమనునది మానవులకు మురికిని పూర్తిగా పోగొట్టు నీరు వంటిది)[6] శుకనాసోపదేశములో శబ్దాడంబరము లేదు; కేవలము స్వభావోక్తియే.

7) ఆత్మ కృతానాం హి దోషాణాం నియతమనుభవితవ్యం ఫలమాత్మనైవ (తాను చేసినతప్పుల ఫలము తాననుభవించక తప్పదు.)[7]

8) జనయతి హి ప్రభుప్రసాద లవోఽపి ప్రాగల్భ్య మధీర ప్రకృతేః కొంచముగా ప్రశంసించినను బేల అయిన వాడు పొంగిపోవును.)[8]

---

1. కా. కా. పుట. 63
2. కా. కా. పుట 61
3. కా. కా. పుట. 67
4. కా. కా. పుట. 77
5. కా. కా. పుట 80
6. కా. కా. పుట 169
7. కా.కా. పుట. 195
8. కా.కా. పుట. 217

9) సర్వథా న నకంచన స్పృశంతి శరీర ధర్మాణముపతాపాః (సంతాపములు మానవ మాత్రులందరికిని కష్టము కలిగించును.)[1]

10) బలవతీ ద్వంద్వానాం ప్రవృత్తిః (సుఖ దుఃఖములను ద్వంద్వములు ఎంతటివానినైనను ఊపివేయగల శక్తి గలవి.)[2]

11) న హి క్షుద్రనిర్ఘాతపాతాభిహతా చలతి వసుధా (చిన్న చిన్న దెబ్బలకు భూమి చలించదు.)[3]

12) మూఢో హి మదనేన ఆయాస్యతే (మూర్ఖులు కామముతో బాధపడెదరు.)[4]

13) సతతం అతిగర్హితేన అకృత్యేనాపి రక్షణీయాన్మన్యంతే సుహృదసూన్ సాధవః (చెడ్డపని చేసి అయిన మిత్రుల ప్రాణములను రక్షించుట అవసరమని సాధువులు భావింతురు.)[5]

14) ఆశయా హి కిమివ నక్రియతే (మానవుడు ఆశతో ఏమిచేయలేడు?)[6]

15) బలవతీ చ నియతిః (దైవము శక్తివంత మయినది)[7]

16) అనాయత స్వభావ భంగురాణి సుఖాని, ఆయతస్వభావ భంగురాణి దుఃఖాని (సుఖము లెప్పుడును దీర్ఘకాల ముండవు, దుఃఖము లెప్పుడును స్వల్పకాల ముండవు.)[8]

17) దుర్లభో హి దాక్షిణ్యపరవశః నిర్నిమిత్తమాత్రం అకృత్రిమ హృదయః విదగ్ధజనః (దాక్షిణ్యము కలిగి అకృత్రిమ హృదయముతో అకారణ మైత్రి చూపు సజ్జనుడు అరుదు)[9]

---

1) కా.కా. పుట. 218
2) కా.కా. పుట. 218
3) కా.కా. పుట. 218
4) కా.కా. పుట 243
5) కా కా. పుట. 246.
6) కా.కా. పుట. 267
7) కా. క. పుట 267
8) ,, ,, 268
9) ,, ,, 290

18) అపగతే మలే హి మనసి స్ఫటికమణావివ రజనికరగభస్తయః విశంతి సుఖముపదేశ గుణాః (దుమ్ము ధూళిలేని స్ఫటికముపై చంద్రకాంతులు సులభముగా ప్రసరించినట్లు నిర్మలమైన మనస్సులో ఉపదేశములు నాటును.)[1]

20) గురు వచన మమలమపి సలిలమివ మహదుపజనయతి శ్రవణ స్థితం శూలమభవ్యస్య (గురూపదేశము మంచిదయినను అయోగ్యునికి చెవిలో పడిన నీటివలె పోటు కలిగించును.)[2]

21) ప్రతి శబ్దకయివ రాజవచనమనుగచ్ఛతి జనోభయాత్ (ప్రజ రాజాజ్ఞను భయమువలన పలుకుబండవలె అనుసరించును.)[3]

---

6) కా. క. 168
7) ,, ,, 108
8) కా. క. 169

# బాణుని శాస్త్ర, పురాణ పాండిత్యము

బాణుడు పండిత వంశమునందు జన్మించినవాడు. ఇతని వంశమునందు తాత ముత్తాతల కాలము నుండి అందరును శ్రౌత స్మార్త కర్మలను చేసి వివిధ శాస్త్రములలో పాండిత్యమును సంపాదించి యజ్ఞములు చేసిన ఘనులు. ఇట్టి వంశమునందు తన పూర్వీకుల నందరిని అసమాన కవితా ప్రతిభతో అతిశయించిన బాణుడు ఉదయించెను. శ్రుతి స్మృతి పురాణాదుల పాండిత్యము శాస్త్రజ్ఞానములు, చర్చలు, కావ్యాలాపములు, సుభాషిత శ్రవణము ఈతనికి వెన్నతో పెట్టిన విద్యలని హర్ష చరితమునందు ఇట్లు చెప్పుకొనెను: 'కృతోపనయానాది క్రియాకలాపస్య సమావృత్తస్య చతుర్దశవర్ష దేశీయస్య పితాపి శ్రుతి స్మృతి విహితం ద్విజ జనోచితం కృత్వా నిఖిలం పుణ్యజాతం' (హర్ష. పుట. 19).

తానభ్యసించిన విద్యలను ఇతడు హర్షవర్ధన చక్రవర్తి ఎదుట కూడ చెప్పుకొని తాను నిందార్హుడను కానని విజ్ఞాపనము చేసెను. హర్షుని ఆస్థానమునుండి తిరిగి వచ్చి తన బంధువర్గమును కలిసికొని వారిని కుశల ప్రశ్నల నడిగినప్పుడు, వారు జరుపు శాస్త్ర పాఠములు యథాక్రమము జరుగుచున్నవాయని అడిగినప్పుడు కూడా ఇదే విశిష్టత కన్పించును. ఇతడు వైదిక కల్పమునకు చెందిన ఆమిక్షీయ క్షీర, నైచికీ, ఆశుశుక్షణిః, కృతకపిశుః, సోమకేదారికాః, వైశ్వదేవ బలిపిండం, హవిర్ధూమః, వైతానవేదీశం కవ్యానాం ఔదుంబరీశాఖానాం రాశిః - ఇత్యాది పదములను హర్ష చరితమునందు స్వీయచరితమును చెప్పుకొను సందర్భమున చెప్పెను. ఇట్టి పదముల ప్రయోగము అట్టి సంప్రదాయము నెరుగని వాని కసాధ్యము. దీనికితోడు పంచమ వేదమనదగిన మహాభారతము ఈతనికి రెండవ ప్రాణము అయి ఉండెను. గుప్తుల కాలములోనే (క్రీ. శ. 3,4,5 శతాబ్దములు) పురాణ వాఙ్మయమంతయు ఒక కొలికికి వచ్చినదని పాశ్చాత్య విమర్శకులు అభిప్రాయపడిరి. అట్టి పురాణములు వానిలోని అశేషములయిన కథలు ఈ కాలపు సంస్కృత కవులను ప్రాకృత కవులను బాగుగా నాకట్టుకొన్నవి. శివ శక్తుల తత్త్వము, లక్ష్మీనారాయణుల తత్త్వము (ఈ తత్త్వమును భాగవత విష్ణుపురాణాది సాత్త్విక పురాణములు రామాయణ భారత హరివంశాది గ్రంథవి

ములను బహుళ ప్రచారములోనికి తెచ్చెను. అంతేగాక రాధా మాధవ తత్వము జనసామాన్యములో చాలా ప్రసిద్ధముగా నుండెను. దీనికితోడు ఉదయన కథలు దేశమందంతట లోకుల మన్ననలను అందుకొన్నవి.) వీనన్నింటి ప్రసంగము కాదంబరియందు కనిపించును. కాదంబరి కల్పిత కథ కావున బాణునకు తర్క వ్యాకరణ మీమాంసాది శాస్త్రములలో గాని, వేదాంతము నందుగాని గల విశిష్ట జ్ఞానమును ప్రదర్శించుట కవకాశము లేకపోయెను. ఇతడు పరమ మాహేశ్వరుడు. చండీ శతకమును రచించినవాడు. అతని పేరే అతడు శివభక్తుడని చెప్పుచున్నది. అతని ఏలిక సూర్యోపాసకుడు, మాహేశ్వరుడు, సౌగతుడు. హర్షుని కాలమున బౌద్ధము మూడు పూవు లారుకాయలుగా వికాసము నొందినది. సౌగతుల సంపర్కమువలన బాణునకు విశాల దృక్పథము, సర్వమత సమన్వయ దృష్టి కలిగి యుండును. అందుకే బౌద్ధమత ప్రశంస వచ్చినప్పుడతడు వారిని తెగడక వారి ఎడల తనకుగల ఆదర భావమును 'బౌద్ధ ఇవ సర్వాస్తి వాదః, బౌద్ధేనేవ సర్వాస్తివాద శూరేణ......జిన ధర్మేణేవ జీవానుకంపినా' అని జైన బౌద్ధముల యందుగల మంచిని మాత్రమే గ్రహించి చెప్పెను.

'షడ్దర్శనాదులలో మాత్రమే కాక ఈ మహా కవికి రాజనీతి, యుద్ధనీతి, ధర్మశాస్త్ర, జ్యోతిష, ఆయుర్వేదాది గ్రంథములలో మంచి పరిచయ మున్నట్లు తెలియుచున్నది ఈతని శాస్త్ర పాండిత్యము చాలా లోతైనది. చంద్రాపీడు డభ్యసించెనని చెప్పిన విద్యలలో ఒక్క మహా ప్రాణత యందు తప్ప మిగిలిన ప్రధాన విద్యలయందు వైశంపాయనునకు వలెనే బాణభట్టునకు పరిచయ ముండి యుండును.

మహాశ్వేతను వర్ణించునపుడు కూడా ఇతడు ఆమెను 'బౌద్ధ బుద్ధి మివ నిరాలంబనాం'[1] (బౌద్ధబుద్ధివలె ఆమె విషయములందు అనాసక్త) అని వర్ణించి బౌద్ధులపై తనకుగల సహనభావమును వెలిబుచ్చెను. ఇదే సందర్భమునందు ఆమె పాడిన పాటను 'మీమాంసయేవ అనేక భావనాను విద్ధయా' (ఆ పాట మీమాంసా శాస్త్రమువలె అనేక విధములగు భావనలతో కూడి యుండెనట. భావనలనగా తాళము మొదలగు కాలమును లెక్కించు పద్ధతులు, మీమాంసా

---

1. కా. కా. పుట 218.

పక్షమునందు యాగాదుల యందు శబ్దనిష్ఠములు అగు భావనలు అని అర్థము.) అని వర్ణించెను[1]. ఇట్లతి సూక్ష్మముగా పరిశీలించినపుడు ఇంకను ఎన్నియో రత్నములు ఈతని రచనలనుండి బయలు వడును. ఇచ్చట స్థూల దృష్టికి గోచరించిన కొన్ని విషయములను మాత్రమే ఉదహరించనైనది.

బాణుడు స్పృశించిన కొన్ని పురాణ కథలను మాత్రమిచ్చట ఇచ్చుచున్నాను. అందు కొన్ని ప్రసిద్ధములు, మరికొన్ని అప్రసిద్ధములు.

చండాల కన్యకను వర్ణించుచు కవి 'ఆకపిల గోరోచనారచిత తిలక తృతీయలోచనాం ఈశానరచితానురచిత కిరాత వేషామివ భవానీం, ఉరఃస్థల నివాస సంక్రాంత నారాయణ దేహ ప్రభా శ్యామలితా మివశ్రియం కుపితహర హుతాశన దహ్యమాన మదన ధూమ మలినీకృతా మివరతిం, ఉన్మద హలి హలాకపర్షణ భయప్రపలాయితామివ యమునాం, అతి బహల పిండాలక్తక రసరాగ పల్లవిత పాదపంకజాం, అచిరమృదిత మహిషాసుర రుధిరక్త చరణా మివకాత్యాయనీం'[2] అని పురాణ కథలను వివరించెను. మొదట చండాల కన్యక నతడు కిరాత వేషధారియగు శివుని వెంట కిరాతి వేషమును ధరించిన భవానితో పోల్చెను. ఈ కిరాతార్జునీయ కథ మహాభారతమునందు ప్రసిద్ధము. దీనినే భారవి మహాకావ్యముగా మలచెను. ఇతడు బాణునకు పూర్వవర్తి. రెండవ ఉపమానము లక్ష్మీదేవిది. ఈమె స్వతః శ్వేతవర్ణ. కాని నల్లని వాని వక్షస్థలము నందుండి నల్లగా కన్పించెను. అట్టి స్థితిలోనున్న లక్ష్మీదేవితో కవి చండాల కన్యకను పోల్చెను. మన్మథదాహ సందర్భమునందు పొగ దుమ్ముకొట్టుకొనిపోయి నల్లబడిన రతీదేవివలె చండాలకన్యక ఉండెనని కవి వర్ణించి కాళిదాసు రచించిన కుమారసంభవమునందలి రతి విలాప ఘట్టము నొకసారి స్మరించెను. ఒకసారి బలరాముడు యమునా నదిని తన వద్దకు రమ్మని పిలువగా ఆ నల్లని తల్లి నిరాకరించెనట. కోపగించిన బలరాముడు తల హలాయుధముతో నామెను ఆకర్షించెను. అప్పుడు పరుగెట్ట మొదలుపెట్టిన యమునానదితో చాండాల కన్యక పోల్చదగినదని కవి అభిప్రాయము. ఈ చండాల కన్యక తన కాలికి

---

2. కా. కా. పుట 23.

1. కా. కా. పుట 2/3.

లత్తుక పూసుకొని మహిషాసురుని రక్తముతో పాదము లెఱ్ఱబడ్డ కాత్యాయనివలె నుండెనట.

ఈ ఉదాహరణములవలన బాణునకీ కథల జ్ఞానముండెనని చెప్పుట వేయి సూర్యుల ప్రకాశముతో వెలుగు అతని మేధాశక్తిని కించపరచుటయే. ఈ కథలను నల్లని చండాల కన్యకతో ఉపమించుట కతడెట్లు మలచెనను విషయమే సహృదయులకు ముదావహము.

స్ఫుటాలాపతగలిగిన శుకశిశువు జ్ఞానమును సమర్థించుచు శూద్రకుని మంత్రి కుమార పాలితు డన్నమాటలివి : (అగ్నిశాపాత్త్వపరిస్ఫుటాలాపతా శుకానాముపజాతా, 'కరిణాంచ జిహ్వా పరివృత్తిః' — అగ్ని శాప వశమున అంతకుముందు స్ఫుటముగా నుండు చిలుక పలుకులు అస్ఫుటము లయ్యెను. గజములకు నాలుక మడతబడి ముందు అతుకుకొని వెనుక విడివడెను ఈ శాపము పురాణప్రసిద్ధమని కాదంబరీ వ్యాఖ్యాకారుడు ఇట్లు చెప్పెను:'అత్రాయం ప్రవాదః : ఛద్మనా గృహీతరూపస్య వహ్నేః యాదృశం సంవాదం శ్రుతవాన్ శుకః తదైవ ఉక్తవాన్ ఇతి తంప్రతి క్రుద్ధేన వహ్నినా శప్తః ... సవిశేషస్తు మహాభారతే అనుశాసన పర్వణి పంచాశీతిత మేఽధ్యాయే ద్రష్టవ్యః.'

ఇంద్రాయుధము దివ్యరూపమును చూచినపుడు చంద్రాపీడునకాశ్చర్యము కలిగి ఒక వేళ ఏదో మహాపురుషుడు శాప వశమున నిట్లవతరించెనా అని విస్మయావిష్టుడయ్యెను. 'దైవతాన్యపి హి ముని శాపవశాత్ ఉజ్ఝిత నిజశరీరకాణి శాపవచనోపనీతాని శరీరాంతరాణ్యధ్యాసత ఏవ. శ్రూయతేహి. పురాకిల స్థూలశిరానామ మహాతపామునిరఖిల భువన లలామ భూతామప్సరసం రంభాభిధానాం శశాప, సా సురలోకమపహాయ అశ్వహృదయే నివేశ్య ఆత్మానం అశ్వహృదయేతివిఖ్యాతా. వడవా మృత్తికావత్యాం శతధన్వానం నామ రాజానముపసేవమానా మర్త్యలోకే మహాంతం కాలమువాస'[1] (స్థూల శిరస్సను ఋషి రంభను శపించగా ఆమె అశ్వహృదయమును ప్రవేశించి అశ్వహృదయ మను విఖ్యాత వడవ (ఆడజాతి గుఱ్ఱము)గా మారి మృత్తికావతియందు శతధన్వుడను రాజును

1. కా. కా. పుట. 132.

సేవించుచు భూలోకమునందుండెనట. ఈ కథకు కూడా పురాణములే మూల మని తెలియుచున్నది.

మహాశ్వేత తన వంశావళిని చంద్రాపీడునితో చెప్పుచు అప్సరసల కుల ములు పదునాలుగని, వీరు స్వర్గలోకమున నివసింతురని చెప్పెను. ఈ కులముల ఉత్పత్తి ఇట్లున్నది: ఒకటి బ్రహ్మ మనస్సు నుండి పుట్టెను. ఒకటి వేదముల నుండి, ఒకటి అగ్ని నుండి, మరియొకటి వాయువునుండి, వేరొకటి అమృత మథనము జరుగుచున్నప్పుడు, ఇంకొకటి జలమునుండి, మరియొకటి సూర్య కిరణ ములనుండి, ఇంకను చంద్రకిరణములనుండి, భూమినుండి, విద్యుల్లతలనుండి, మృత్యువునుండి, మన్మథునినుండి, మరి రెండు కులములు ముని, అరిష్ట అను దక్షప్రజాపతి కన్యకలకు గంధర్వులతో సంపర్కమేర్పడుటవలన పుట్టెను. ముని తనయుడు చిత్రరథుడు గంధర్వ శ్రేష్ఠుడు. ఈతని కూతురు కాదంబరి. అరిష్ట తనయుడు తుంబురుడు మున్నగు ఆరుగురు సహోదరులలో పెద్దవాడు హంసు డనువాడు.[1] ఈ హంసునకు గౌరియను (చంద్రునివలన పుట్టిన అప్స రసల కులము ఈమెది) కన్యకతో వివాహమయ్యెను. వారికి మహాశ్వేత జన్మించెను.

ఈ ఉత్పత్తి క్రమమునకు ఆకరము మనకు తెలియదు. దీనిని వెలికి తీయుట అవసరము.

బాణునకున్న పురాణ జ్ఞానమునకు పై ఉదాహరణములు మచ్చుతున కలు మాత్రమే.

## ఆయుర్వేదము :-

బాణభట్టు సూతికాగృహ వర్ణనము నందు తప్పనిసరిగా ప్రతి నాగరకు నకును ఆయుర్వేద విద్యయందు ఉండు ఇంతో అంతో జ్ఞానమును వ్యక్తము చేయును. ఈ వర్ణనమునం దారోగ్యసూత్రములతో పాటు గృహాలంకరణ శాస్త్రా దుల మేలనము, అందునను రంగవల్లులు పీత పిష్ట పంచాంగులులును, సూర్య

1. కా. కా. పుట. 219-20.

చంద్రుల బొమ్మలు అతని నిశిత పరిశీలననే గాక సుసంబద్ధమగు అభ్యంతరా లంకరణ రీతిని (Interior decoration) చూపించును. ఆస్థాన అంతఃపుర వర్ణనము అంతయును బాణుని పరిశీలనను, రసికదృష్టిని, పరిసరములందున్న వానిలో అందమయిన వర్ణముల మేళనమును భావించుకొని వర్ణింపగలుగు ప్రతిభను తెలియజేయును.

సూతికాగృహమునందు హల ముసలముల నుంచిరనియు అనుభవజ్ఞులైన స్త్రీలు అక్కడ నిలిచి యుండిరనియు తెలిపెను. ప్రసవమగుటలో ఆలస్యము అయినచో రోటిలో ధాన్యమునుగాని, పొట్టును గాని పోసి దంపినచో ఆ ధ్వనికి ప్రసవమగునని పాతకాలపు ముసలమ్మలు చెప్పుచుండిరి. అదే మాటను చరక సంహితాకారుడు కూడా ఇట్లు సమర్థించెను.

1. 'ద్వేకుండ ముసలే, ద్వే ఉలూఖలే ఖర వృషభశ్చ...స్త్రియః బహ్వ్యః బహుశః ప్రజాతాః సౌహార్దయుక్తాః సతతమనురక్తాః ప్రదక్షిణాచారాః ప్రతిపత్తి కుశలాః, ప్రకృతి వత్సలాః. త్యక్త విషాదాః, క్లేశ సహిష్ణోఽభిమతాః, బ్రాహ్మణాశ్చాథర్వ వేదవిదః, యచ్చాన్యదపి తత్రసమర్థం మన్యేత'

(చరక సంహితా-శారీరస్థానం VIII. 34)

2. శుశ్రుతకారు డిట్లు చెప్పెను :

'నాగోదరోప విష్టకస్య (రోగము పేరు) చికిత్సాధికరణే కాలాతీత స్థాయిని గర్భే విశేషతః సధాన్యములూఖలం ముసలేనాభిహన్యాత్ విషమే వా యానాసనే సేవేత'

(శుశ్రుత సంహితా-శారీరస్థానం X.)

అతి ప్రాచీనమైన ప్రసూతి తంత్రము ఇందు ప్రస్తుతమై యున్నది.

అరిష్ట గృహమునందు భుజగ నిర్మోకమును, అజశృంగి పొడిని నేతితో కలిపి అగ్నియందు వేల్చిరని బాణుడు చెప్పెను. ఇది కూడా సుఖముగా త్వరితముగా ప్రసవమున కనుకూలించు ప్రక్రియయని ఆయుర్వేద వైద్యులు అందురు. శూద్రకుడు భోజనానంతరము ధూమవర్తి పానము చేసెనని కవి వర్ణించెను ఆరోగ్య రక్షణ కొరకు కాస చికిత్సతో (దగ్గు కొరకు) వివిధ ఓషధు

లను వర్తికగా చుట్టి వాని ధూమమును పానము చేయవలెనని ఆయుర్వేద శాస్త్రము చెప్పుచున్నది.

'శిరసః పీడనే స్రావే నాసాయాః హృది తామ్యతి,
కాసప్రతిశ్యాయవతాం ధూమం వైద్యః ప్రయోజయేత్'
—చరక, చికిత్సాస్థానము X VIII.65.

ఇంకను ఏ ఏ ఓషధులను ధూమపానమునం దుపయోగించవలెనో ఇట్లు చెప్పిరి :

'మనశ్శిలైలా మరిచక్షారాంజన ఇన కుటన్నటైః
వంశలేఖన సేవ్యాల క్షామాలక్తక రోహిషైః
పూర్వ కల్కేన ధూమోఽయం సానుపానో విధీయతే.
మనశ్శిలాలే తద్వచ్చ పిప్పలీ నాగరైః సహ
త్వగ్గైగుదీ బృహత్యోర్ద్వే తాలమూలీ మనశ్శిలాః.
కార్పాసాస్థ్యశ్వగంధాచ ధూమః కాసవినాశనః'
చరక. చికిత్సాస్థానము 73-75.

## అశ్వ శాస్త్రము :-

రాజకులములయందు యందు మెలగిన వారికి అశ్వములను గురించి, గజములను గురించి కొంత జ్ఞానముండి యుండును. బాణుడింద్రాయుధమును వర్ణించుచు 'పృథుభిః ఖుర పుటైః జర్జరిత వసుంధరైః మురజవాద్యమివ అభ్యస్యంతం, ఉత్కీర్ణమివ జంఘాసు విస్తారిత మివ ఉరసి, శ్లక్ష్ణీ కృతమివ ముఖే, ప్రసారిత మివ కంధరాసు, ఉల్లిఖితమివ పార్శ్వయోః, ద్విగుణీకృతమివ జఘన భాగే, జవప్రతి'పక్షమివ గరుత్మతః...[1]

---

1. ఇంద్రాయుధాశ్వము పెద్దనైన గిట్టలతో భూమిని జర్జరిత మొనర్చుచు మృదంగవాద్యము నభ్యసించుచున్నదా యన్నట్లుండెను. ఆ గుఱ్ఱపు పిక్కలు గీచినట్లు తేలియుండెను. వక్షఃస్థలము నిడుదగాను, ముఖము నునుపుగాను, భుజములు ప్రసారితములైనట్లును, రెండు పక్కలలో చెక్కి సన్నగా చేసినట్లును, పిరుదుల భాగములో రెండు రెట్లు ఎదిగినట్లును, గరుడపక్షితో వేగములో పోటి పడుతున్నట్లును ఉండెను.

అసిత పీత హరిత పాటలాభిః ఆఖండల చాపానుకారిణీభిః లేఖాభిః కల్మాషిత శరీరం'[1] అని చెప్పెను. ఒక మేలు జాతి అశ్వలక్షణములన్నిటిని ఇచ్చట కవి ఉదాహరించెను. హర్ష చరితమునందు ఇతడు దర్పశాత మను గజమును వర్ణించిన తీరు అతనికి గజములను గురించి గల జ్ఞానముతోపాటు చమత్కారము ఎంత యున్నదో తెలియజేయును.

విలాసవతి చేసిన వ్రతములు ఆనాటి సాంఘికాచారములనేకాక బాణుని ధర్మశాస్త్ర జ్ఞానమునకు కూడా తార్కాణము.

## అంగ విద్య:-

నవజాతశిశువు అగు చంద్రాపీడుని వర్ణించుచూ బాణుడు ఇట్లనెను:

'సమృద్ధ మనోరథః శుకనాసస్తు శనైః శనైః అంగ ప్రత్యంగాన్యస్య నిరూపయన్ ప్రీతి విస్తారిత లోచనో భూమిపాల మవాదీత్ దేవ పశ్యపశ్యాస్య కుమారస్య గర్భ సంపీడనవశాత్ అపరిస్ఫుటావయవ శోభస్యాపి మాహాత్మ్య మావిర్భావయంతి చక్రవర్తి చిహ్నాని. తథాహి అస్య సంధ్యాంశురక్త బాల శశ కలాకరే లలాట పట్టే నలినా నాలభంగతంతుతన్వీయ. మూర్ధా : పరిస్ఫురతి. ఏత ద్వికచ పుండరీక ధవలం కర్ణాంతాయత ముహుర్ముహురున్మిషితైః ధవలయతీవ వాసభవన మరాల పక్ష్మ లోచన యుగలం... సహజమాననామోదమాజిఘ్రతీవదూరాయతా కనక లేఖేవ నాసికా... భగవతో విష్ణరస్రవస యివ శంఖచక్రచిహ్నౌ ప్రశస్తలేఖాలాంఛితౌ కరౌ. అభినవ కల్పతరు పల్లవ కోమలం... అనేక నరేంద్ర సహస్ర చూడామణి చక్ర చుంబనోచితం చరణ యమలం. ఏషచ దుందుభేరివ అతి గంభీరః స్వర యోగోఽస్య రుదతః శ్రూయతే.'[2] శుకనాసు డతి సంతసముతో మెల్లమెల్ల నవజాత శిశువు అంగములను తడివిచూచి పరీక్షించి ప్రీతివిస్ఫారిత లోచనుడై రాజుతో నిట్లనెను : 'దేవా! చూడుము చూడుము. ఈ శిశువు గర్భములో ఒదిగిపోయి

---

1. కా. కా. పుట. 129-131.
2. కా. కా. పుట. 122.

ఉండి ఇప్పుడే బయట పడినందు కీతని శరీరము మీది అనేక చిహ్నములుస్పష్టముగా ఇంకా పైకి తేలుచున్నను ఈతని మాహాత్మ్యమును చక్రవర్తి చిహ్నములను తెలియ జేయుచునే యున్నవి. సాయంసంధ్యచేత రంజితమైన చంద్రరేఖవలె కన్పించు ఈ శిశువు నుదుట తామర తూడును విరిచితే లోపల కనిపించు సన్నని దారము వలె ఒక ఊర్ణా చిహ్నము కనిపిస్తున్నది. అందముగా పైకి స్ఫురించు కను రెప్పలున్న ఈ శిశువు కన్నులు తెల్లతామరలే. అవి కర్ణాంతాయతములు. కండ్లు తెరచిచూచినప్పుడంతయును ఈ శిశువు కన్నుల కాంతితో ఈ నివాస భవనమును ప్రకాశింపజేయుచున్నట్లున్నాడు. బంగారు కడ్డీవలె నిటారుగా ఉన్న ఈ పిల్లవాని ముక్కు తన ముఖములో నుండి సహజముగా వెలువడు సుగంధమును ఆఘ్రాణించుచున్నట్లున్నది. ప్రశస్తములైన రేఖలున్న ఈతని చేతులు విష్ణుమూర్తిచేతులవలె శంఖచక్రలాంఛితములు. ఎందరో ఇంద్రుల చూడా మణుల సమూహము చుంబించుటకు ఉచితమైనవీ పిల్లవాని పాదములు ఈ శిశువు ఏడుపు మంగళధ్వానము వలె ఉన్నది.)

ఉత్తమ స్త్రీ పురుష జాతి లక్షణములు సమగ్రముగా తెలియని వాడ ఇట్లు చంద్రాపీడ శిశువును గాని, యౌవ్వనమునందు ప్రవేశించిన యువరాజును గాని కాదంబరీ మహాశ్వేతల ఉత్తమ స్త్రీ లక్షణములను గాని వర్ణించజాలడు.

## రాజనీతి :-

సంస్కృత మహాకవులలో చాలామంది రాజకులములతో సంపర్క ముండుటవలనో, రాజ ధర్మములను నీతిని గూర్చి ప్రజలు విరివిగా చర్చించుట వలననో, రాజు ప్రజా జీవనమునకు ప్రాణమగు వర్ణాశ్రమ ధర్మరక్షకుడగుట వలననో, ధర్మము మతము అను స్తంభములపై రాజ్య మాధారపడి యుండుట వలననో, రామాయణ మహాభారతాది ఆర్ష గ్రంథములు రాజధర్మములను నీతిని రాజునకు ప్రజల ఎడల, ప్రజలకు రాజు ఎడల గల బాధ్యతలను, విధు లను చర్చించుటవలననో, ఈ రాజనీతి శాస్త్రమును విరివిగా తమ కావ్యములలో చర్చించిరి. ఇందు మనుయాజ్ఞవల్క్యాది స్మృతులు, కామందకీయ నీతి

సారము వంటి గ్రంథముల ప్రభావము అదే నీతికి బద్ధమైన ఆనాటి సాంఘిక స్థితి ఉండుట గమనించదగిన విషయము.

నాటికి నేటికిని ప్రజలు సునిశ్చితమైన రాజ్యములో సుఖశాంతులతో జీవనము గడుపుటకు రాజు, అతని వ్యక్తిగత శీల సౌజన్యములే కారణమని రాజనీతిజ్ఞులు అనుభవపూర్వకముగా చెప్పగలుగుచున్నారు. భూషణ భట్టు కూడా ఇదే మాటను 'రాజా కాలస్య కారణం' అను మహా భారత వాక్యముతో పునరుక్తము చేసెను. తారాపీడ దేవుడు ఉత్తరార్ధ భాగమునందు చంద్రాపీడు నకు చేసిన ఉపదేశములో కూడ సచ్ఛీలుడు గాని రాజు ఎడల ప్రజలకు ప్రత్యయ ముండదనియే పలికి, శీల రక్షణము విశేషముగా రాజునకు అనివార్యమని చెప్పెను. ఇదే నీతిని ఉపదేశించునది ఉపదేశ సారమన దగిన శుకనాసోప దేశము. చంద్రాపీడుని వ్యక్తిత్వ వికాసమంతయును ఈ ఉపదేశము మీదనే ఆధారపడి యున్నది. శుకనాసుని మాటలు చంద్రాపీడునకు శంఖములో పోసిన నీరాయెను. ఈ శాస్త్రానుసారమే చంద్రాపీడునకు శరీర వ్యాయామము, ఈత, ఆయుధ విద్య, వ్యూహ నిర్మాణాది యుద్ధ తంత్ర కౌశలము గరపబడెను. రాజ నీతి గ్రంథములు, అందునను ప్రధానముగా కౌటిల్య అర్థశాస్త్రము రాజు నేర్వ వలసిన విద్యలన్నింటిని విపులీకరించినవి. రాజనీతి సూత్రములనే కాక ప్రత్యక్ష ముగా బాణునకు కార్యరంగమునందు వ్యవహార దక్షత ఉన్నందున ఈ శాస్త్ర మును గూర్చి కాళిదాస భారవుల వలెనే, పంచతంత్రకారుని వలెనే ఇతడు అతి సమర్థతతో చర్చించగలిగెను. ఇదే సందర్భమునందు బాణుడు యుద్ధనీతి, తదంగములయిన ఆయుధ ప్రయోగము, దండనీతి మున్నగు శాస్త్రములయందు తనకున్న జ్ఞానమును పాఠకులకు తెలియజేయును.

ఇంతేకాక బాణునకు ఉన్న వనవిజ్ఞానము, ఆటవిక జీవనమును గురిం చిన విశేషజ్ఞానము, వారిజీవనాధారమైన వేట, వేటాడు పద్ధతి, వేట కుక్కల నుసి కొల్పు నేర్పు మున్నగు విషయములందు మామూలు సంస్కృత కవులలో కన్న అసాధారణమగు ప్రజ్ఞా పాటవములు కన్పించును. ఈ విజ్ఞానము అంతయు వింధ్యాటవీ వర్ణనములో ఆరంభమయి శబరమృగయా వర్ణనమును చేయుటలో అతిశయించును.

ఇట్లనేక శాస్త్ర జ్ఞానము వలన కల్గిన వ్యుత్పత్తిని కవి సహజమగు ప్రతిభతో అసాధారణ మేధాశక్తితో, వీనికి ఈడగు శబ్దశక్తితో జోడించినప్పుడే అసదృశమగు కళాఖండ మనిపించు కొనదగిన కాదంబరీ నిర్మాణము జరిగెను. ఇంతటి గ్రంథము కవి తపస్సు ఫలితమేకాని ఏదో ఆకాశమునుండి ఊడిపడ్డ ఇంద్ర ధనుస్సు కాదు. కాదంబరి చదివిన ప్రతిఒక్కరి మనస్సులోనూ ఎంతటి ప్రతిభా వంతునకయినను ఇట్టి తపస్సు, అభ్యాసము పరిశీలనము మననములు ఎంత అవసరమో స్పష్టము కాగలదు.

# పూర్వోత్తరార్ధముల తారతమ్యము

కాదంబరి పూర్వభాగము ప్రథితయశస్కుఁడగు తండ్రి చేతినుండి వెలువడినది. ఉత్తరార్ధము తనయునిది. బాణభట్టుని నామమును భారతీయ నాగరకులందరు ఎరుగుదురు. భూషణుని నామమును సంస్కృత భాషతో పరిచయమున్నవారే ఎరుగుదురు. బాణుడు తన అలౌకిక ప్రతిభతో వ్యుత్పత్తిని జోడించి ఒక పెద్ద పథకమును తయారుచేసి తనకుతానే సాటి యనిపించుకొన్నప్పటికిని, కావ్యనిర్మాణమును ముగించలేక పోయెను. భూషణుడు పూర్వార్ధమునందతని ప్రతి ఎత్తుగడను ప్రతి పాత్ర ఔచిత్యానౌచిత్యమును జాగ్రత్తగా పరిశీలించి కావ్యనిర్వహణమునందు విజయమును సాధించి 'యః క్రియావాన్ సపండితః' అని నిరూపించుకొనెను. బాణున కున్నంత వర్ణన పటిమ శాస్త్రజ్ఞానము భూషణ భట్టునకు లేకపోయినను, అతనిది గజ్జె కట్టినచేయి కాకపోయినను, సుదీర్ఘములు, సుశ్లిష్టములు, సమాస భూయిష్టములగు పెద్దపెద్ద వాక్యములనతడు నిర్మించలేకపోయినను అతడు ప్రశస్త గద్య కర్తగా బాణునికన్న భిన్నులగు వారందరికిని మూర్ధన్యుఁడగును. ఈతని వాక్యములు సంక్షేపములు, సులభగ్రాహ్యములు, సరళములు. ఇందు ఉత్ప్రేక్షలు, ఉపమలు, రూపకములు పోటాపోటీ పడవు. అయినప్పటికిని భూషణభట్టు పాత్ర పోషణము అసదృశము అమోఘము. వివిధ భావములను ప్రదర్శించుటలో కూడ ఇతని కితడే సాటి. కథ పూర్వార్ధమునందు నిర్వహించిన వర్ణనములను సంగ్రహముగానైన అచ్చటచ్చట తడివి చూపించుట అవశ్యకమని ఈతడెరిగెను. ఆ విధముగా సాధ్యమయినంతవరకు పూర్వోత్తరార్ధముల మధ్యన వారధిని నిర్మించనెంచి కృతార్థుడయ్యెను. కథయందు ఏకసూత్రత (Uniformity) ఏర్పడెను. కథ ముగింపు మొక్కుబడివలె, అందతుకులవలె, (Patch work) వలె కాక పాలలో పాలు కలిపి నట్లయ్యెను. చెప్పదలచుకున్న మాటను సంగ్రహించి సూటిగా చెప్పగల సామర్థ్య మితనియందుకలదు. శబ్దశిల్పమునందు మాత్రము ఇతడు తండ్రి కీడు కాలేడేమో! అయితే సులభశైలిలో వాక్యమును నిర్మించుట కూడా ఒక కళయే. ఇదేమాటను Somerset Maughm ఇట్లు చెప్పెను:

"But if richness needs gifts with which everyone is endowed, simplicity by no means comes by nature. To achieve it needs a great discipline."- ఈ వాక్యం యమము తండ్రి కొడుకు లిద్దరకును సమముగానే ఉన్నను, తండ్రి ఇతరత్ర కొడుకు నతిశయించును

ఉత్తరార్ధమునందలి కొన్ని పద ప్రయోగములను, కొన్ని వర్ణనములను జ్ఞాత్రముగా నుదాహరించి అతను తండ్రి ప్రక్కన నిలబడుటకు అర్హుడని, అంతటి తండ్రితో కావ్యరచనయందు పాలు పంచుకొనుట అతని అదృష్టమని, అందువలననే అతని కృతి అమరకృతి యయ్యెనని తెలుపుటకు ప్రయత్నింతును. దాగిపోయిన హర్ష చరితము నట్లేయుంచి, దాని ప్రశంస కూడా చేయక కాదంబరి రచనను మాత్రమే ఇతడు గ్రహించెను. బాణుడు కూడా అంతటి హర్ష చరితమును వ్రాసి హర్షుని ప్రశంసించియూ కాదంబరి అవతారికా శ్లోకములయందు అతనిని ప్రశంసించకుండుట కూడా గమనించ దగిన విషయము. కాదంబరీ రచనను వీరుభయులును వ్యక్తిగత విజయముగను, తమ విద్వద్వంశ ప్రతిష్ఠకు సంబంధించిన విషయముగను భావించి యుండవచ్చును. హర్ష చక్రవర్తితో ప్రత్యక్ష ప్రమేయములేని రచన కాదంబరి ఇక భూషణుని ప్రయోగములు చూడుడు:

"పక్ష్మాగ్ర సంపిండిత నయన జల వర్షిణీ" (కను రెప్పల చివరలలో కన్నీటిని పిండి వర్షించునది) యని ఇతడు కాదంబరి కార్చిన కన్నీటిని వర్ణించిన తీరు అతనికిగల సాహిత్యాభినివేశమును చూపించును.[1]

కాదంబరి సందేశమును అంతను విన్న చంద్రాపీడుని భూషణు డిట్లు వర్ణించెను: 'అథ కాదంబరీ శరీరాదివాలాపపదైరేవ సహాగత్యేయుగపద్గృహీతో హృదయేమన్యునా, కంఠే జీవితేన, అధరపల్లవే వేపథునా, ముఖే శ్వసితేన, నాసాగ్రే స్ఫురితేన, చక్షుషి బాష్పేణ, తుల్యవృత్తిర్భూత్వా కాదంబర్యాః క్షరద్బాష్ప విక్షేప పర్యాకులాక్షర ముచ్చైః పత్యువాచ'[2] (కాదంబరి ఎట్టి మానసిక స్థితిలో నుండి సందేశమును పంపెనో ఆ మాటలు విన్న చంద్రాపీడుని స్థితి అట్లే అయ్యెను. ఆ సందేశమును వింటున్నంత సేపు అమె ఆ

1. ని. కా పుట. 492. 2. ని. కా. పుట. 498.

మాటలు చెప్పుతున్నట్లే అతడు భావించెను. ఒక్కుమ్మడిగా అతని హృదయ మును దుఃఖము ఆక్రమించుకొనగా, ప్రాణములు కంఠగతము లయినట్లుండెను. అప్పుడే పెదవి వడకసాగెను. ముఖము నుండి ఉచ్ఛ్వాస నిశ్వాసములు వెలు వడెను. నాసికా పుటము లదిరిపోదొడగెను. కన్నుల నీరు ప్రవహించుచుండగా తడబడు మాటలతో బిగ్గరగా నతడు బదులు బలికెను.

'మనసా (చంద్రాపీడః) సంస్కారలావణ్య పూరప్లనే స్మరాయతన భూతస్య కాదంబరీ రూపస్య-......[1]

చంద్రాపీడుని విరహావస్థను భూషణుడిట్లు వర్ణించెను:

'ఏవంచ నిష్ప్రీతి క్రియతయా దుస్త్యజత యా వాతి సంస్థులేనో పాస్య మానోఽపి మనసిజేనాకార మేవ లోకలోచనేభ్యోఽరక్షత్, న కుసుమశర సాయ కేభ్యః జీవితమ్, తనోరేవ తానవమంగీచకార నలజ్జాయాః, శరీరస్థితావేవా నాదరం కృతవాన్ నకులస్థితౌ, ప్రజా ఏవాన్వరుద్ధ్యత నమన్మథోత్కలికాః, సుఖమేవావ ధీరయామాస నధైర్యమ్' (పరిసంఖ్య)

(ఇట్లు తిరుగులేని మన్మథ వికారమునకు చంద్రాపీడుడు లోనయ్యెను. తననుతాను అతడు ప్రజల దృష్టి నుండి రక్షించుకొనగలిగెనేకాని, మన్మథుని బాణ వృష్టి నుండి జీవితము రక్షింపనేరదయ్యెను. అతని శరీర మేగాని లజ్జ సన్న గిల్లలేదు. తన శరీర సంస్కారమునందు అశ్రద్ధ చూపెనేగాని కులగౌరవము నందుగాదు. ప్రజల ఆభ్యుదయమునే లెక్కపెట్టెను గాని మన్మథ వికార మును లెక్కింప దయ్యెను. సుఖమును వదలుకొనెను గాని ధైర్యమునుగాదు.)

చంద్రోదయమును వర్ణించుచూ ఇతడు ప్రకృతి వర్ణనయందు సిద్ధమగు తన లేఖినిని ఒకసారి ఝళిపించెను.

''పరివర్తయద్భిరివ స్వకాంత్యా నీలిమాన మంబర తలస్య అపహరద్భి రివ హరితతాం తీరగహనానాం అధస్తాదపి ఛిద్రయిత్వేవ ప్రవిశద్భిః నిర్వా సయద్భిరివ తరుతలచ్ఛాయామ్ దరీకుహర కుంజోదరేష్వపి నిలీనం తిమిర మశాం త్యేవ ప్రవిశ్యోతాఎటయద్భిః...అన్యథా పునర్ధవలయద్భిరివ సాంద్ర

1. ని. కా. పుట. 502

చందన ద్రవేణ యామినీయ్...పి.డీ భూయ వహద్భిరివ రథ్యాము'శేష......
షాశితై రివ చంద్రకాంతచ్యుతజల ధారా సహస్రైః'

(చంద్ర కిరణముల కాంతితో గగనతలములోని నీలిరాగమును కడిగివేసి నట్లుండెను. చుట్టునున్న అడవులలోని ఆకుపచ్చని రంగును అపహరించుచుండెనా యన్నట్లుండెను. క్రిందకు ఛిద్రముచేసి ఈ కిరణములు ప్రవేశించుచున్నట్లుండెను. చెట్లక్రింది నీడను నిర్వాసింపజేయుచున్నట్లుండెను. పొదలమాటున పర్వత గుహలలో దాగి ఉన్న అంధకారమును బలవంతముగా ప్రవేశించి నశింపజేయు న్నట్లుండెను. చిక్కని చందన ద్రవముతో రాత్రిని తెల్లపరచుచున్నట్లుండెను. చంద్రకాంత మణినుండి జాలువారు జలధారలతో ఆ ప్రాంతమంతయు కడిగి వేసినట్లుండెను).

కాదంబరిని పొందబోవుచున్న ఉబలాటముతో చంద్రాపీడుడు తాను కుమారీ పురమును చేరి కాదంబరీ మహాశ్వేతలను, మదలేఖను కలిసి కొన్నట్లు కాదంబరీ వివాహము ఆమెతో గడుపబోవు మధుర క్షణములను గురించి తీయని పగటి కలలను కనెను. ఇట్టి భావములు యౌవనమునం దడుగు పెట్టిపెట్టని వయస్సునందున్న ప్రతి ఒక్కరును ఇచ్చట నాయకునితో పంచుకొనవలసినదే. ఇట్లు పాఠకులను ఉద్రూతలూగించి చంద్రాపీడుని ప్రాణత్యాగముతో కథకు విషాదపు మలుపును కవి తీసికొని వచ్చెను. కాదంబరిని గూర్చి అత దనిన మాటలు Dramatic Irony ని సృష్టించును. 'వాసభవనే బలాద్దోర్భ్యాం ఆదాయ శయనీయమ్, శయనీయాదంకమంకాచ్చ హృదయం దేవీం కాదంబరీ మారోపయామి' (నేను రెండు చేతులతో కాదంబరిని ఎత్తుకొనివచ్చి శయ్యపై చేర్చెదను. శయ్య నుండి ఒడిలోనికి ఒడి నుండి హృదయములోనికి చేర్చెదను.) ఉజ్జయిని నుండి బయలుదేరి హేమకూటమును త్వరితగతిని చేరుకొనగోరిన చంద్రాపీడుడు ప్రయాణ ముహూర్త నిర్ణయమునందు కాలయాపన చేయవలదని రహస్యమంతనములాడెను. వారందుల కంగీకరించి లెక్కలువేసి తారాపీడునితో నిట్లందురు:

'కర్మాను రోధాద్రాజేచ్ఛైవకాలః. తత్రాపిన కార్యమేవాహర్నిరూపణయా రాజా కాలస్య కారణమ్ యస్యామేవ వేలాయాంచిత్తవృత్తిః సైవవేలాసర్వ

1. ని. కా. పుట. 542.

కార్యేషు (కర్మాను రోధము వలన రాజేచ్ఛయే శుభాశుభకాల నిర్ణయమునకు కారణము. అందున ఇది మంచిరోజు ఇదికాదు అని లెక్కలువేసి చూడనక్కరలేదు. రాజే కాలమునకు కలుగుటకు గూడా కారణము కదా! రాజుకు ఏవేళలో పనిని చేయవలెనని అనిపించితే అదేవేళ అన్ని పనులకు సరి అయిన కాలము.) రాజు తలిచిన దెబ్బలకు కొదువలేదుకదా ! (రాజాకాలస్య కారణమ్-ఇది మహాభారతోక్తి)

చంద్రాపీడుడు బయలుదేరగనే ఏదో ఆపదను శంకించిన విలాసవతి మాతృహృదయము అదిరిపోవును;-

'మమ పునర్నేదృశీ ప్రథమగమనేఽపితే పీడా సముత్పన్నా యాదృశీ తవ గమనేఽధునా. దీర్యత ఇవమే హృదయం. సముత్పాట్యంత ఇవ మర్మాణి; ఉత్క్వాథ్యత ఇవశరీరమ్, ఉత్ప్లవత ఇవచేతః విఘటంత ఇవ సంధి బంధనాని, నిర్యాంతీవ ప్రాణాః......సర్వమేవ శూన్యం పశ్యామి'.[1]

(నేడు నా మనస్సెందులకో చాలా బాధకు లోనయినది. ఇంతకుముందు నీవు ఉజ్జయినికి వదలిపోయినప్పుడింతటి బాధ నాకు కలుగ లేదు. ఇప్పుడు నా హృదయమును చీల్చివేసినట్లున్నది. మర్మములు పగిలిపోవుచున్నట్లున్నవి. శరీరము ఉడికిపోవుచున్నట్లున్నది. మనస్సు అదిరిపోవుచున్నది. సంధిబంధములన్ని తెగిపోవుచున్నట్లున్నది ప్రాణములు పోవుచున్నట్లున్నవి అంతయు శూన్యముగా నున్నది).

చంద్రాపీడునికి వీడ్కోలు చెప్పుచు తారాపీడుడు బోధించిన రాజనీతి ప్రశంసనీయము. 'రాజ్యం హి నా మైత త్పృథివీ భారేణైవ అతిదురుద్వహం... ......(రాజ్యం)నా విక్రాంతే నా మహోత్సాహే, నాప్రియవాదిని, నా సత్యసంధే, నా ప్రాజ్ఞే, నావివేకిని, నాకృతజ్ఞే నాన్యాయవర్తిని, నా ధర్మరుచౌ, నా శాస్త్ర వ్యవహారిణీ,నాశరణ్యే నా బ్రహ్మణ్యే, నా కృపాలౌ, నా మిత్ర వత్సలే, నా వశ్యాత్మని, నానిర్జితేంద్రియే, నా సేవకే. పదమేవా దధాతి'[1] (ఈ భూ భారమును వహించుట చాలా కష్టము కావున రాజ్యము చేయువాడు మెలకువతో నుండవలెను. పరాక్రమము ఉత్సాహము లేనివానికి,రాజ్యము దక్కదు రాజు ప్రియవాది,సత్యవాది,ప్రాజ్ఞుడు,

1. ని. కా. పుట. 587.
2. ని. కా. పుట. 590.

వివేకి,కృతజ్ఞుడు,న్యాయవర్తనుడు,ధార్మికుడు, శాస్త్ర వ్యావహారజ్ఞానమున్నవాడు, ఇతరులకు శరణ్యుడు, బ్రహ్మణ్యుడు, కృపాలువు, మిత్రవత్సలుడు. వశ్యేంద్రియుడు, జితేంద్రియుడు, సేవకుడు అయియుండవలెను.) ఇది శుకనాసోపదేశమునకు సంపిండితార్థమగు సంగ్రహ రూపమని యనిపించును. ఇచ్చట కావ్యశయ్య; 'రసేన శయ్యా స్వయ మభ్యుపాగతా' అన్న బాణుని మాటలను తలపించును.[1]

తారాపీడు డింకను రాజ ధర్మమును తా నవలంబించిన తీరు నిట్లు చెప్పెను :

'గతఃఖలుకాలో౽స్మాకం, న పీడితాః ప్రజా లోభేన, నోద్వేజితా గురవోమానేన......నరాజధర్మో నిరుద్ధః. స్వరుచ్యా వృద్ధాః సమాసేవితా నవ్యసనాని. సతాం చరితాన్యనువర్తితాని నేంద్రియాణి. ధనురవనామితం న మనః, వృత్తం రక్షితం న శరీరమ్. వాచ్యాద్భీతం. నమరణాత్' - (మా కాలము గడిచిపోయినది. నేను ప్రజలను లోభముతో పీడించలేదు. గురువుల నవమానముతో తలవంపుల పాలుచేయలేదు. రాజధర్మమునకు వ్యతిరేకముగా వ్యవహరించలేదు. వృద్ధులను సేవించితిని గాని వ్యసనములను సేవించలేదు. సజ్జనుల చరిత్రమునే గాని ఇంద్రియములను అనువర్తించలేదు. ధనుస్సును ఒంచితినే గాని, మనస్సును గాదు. శీలమునే గాని శరీరమును రక్షించుకొనలేదు.) ఇచ్చట పరిసంఖ్యాలంకార మతిరమణీయము.

బాణుడు చేసిన శబరసేన వర్ణమునకు దీటైనది భూషణుని పక్కణ వర్ణనము.

ఇట్లు కాదంబరీ కథను నిర్వహించిన భూషణ భట్ట బాణ భట్టు లిరువురుః సహృదయుల కభినందనీయులే. పాఠకులు భూషణునకు నమోవాకముల చేయక తప్పదు.

---

1. కా. అవ. శ్లో.

# కాదంబరి - తెలుగు సాహిత్యముపై దాని ప్రభావము

మధ్య యుగము నుండి దాదాపు వేయి సంవత్సరముల కాలము వరకు పైగా భారతదేశము నందలి వివిధ భాషా సాహిత్యములు, అందునను ముఖ్యముగా గద్య వాఙ్మయము బాణభట్టునకు ఎంతయో ఋణపడి యున్నది. కాదంబరి కథను కాదంబరీ కళ్యాణము అను నాటకముగా కాకతీయ యుగమునందలి నరసింహ కవి అను నతడు సంస్కృతమున రచించగా దానిని శ్రీ సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారు ఆంధ్రభాషయం దనువదించిరి. తెలుగు దేశము నందు క్రీ. శ. 14 వ శతాబ్దముతో జన్మించిన వామన భట్ట బాణుడు తాను బాణుని అవతరమే యని భావించెను. ఈతని వేమ భూపాల చరితముకాదంబరి వల్ల ప్రభావితమైనది. తెలుగు కావ్యములలోని గద్యముల ఎత్తుగడలన్నింటిలోను సుశ్లిష్ట సమాస గుంభనము నందును కాదంబరి ముద్ర స్పష్టముగా కనిపించును. మరాఠీ కన్నడ భాషలయందు నవలకు కాదంబరి యనియే పేరు. ఉత్తర దక్షిణ భారత భాషల మధ్య వారధి వంటివి భాషలు. వీరి భాషల యందు కాదంబరి ప్రభావము ఎట్టిదో మనకు తెలియదు. కాని ప్రతి కల్పిత కథకును అదే పేరు పెట్టి విశేష నామమైన కాదంబరిని వారు సామాన్య నామ వాచకముగా మార్చి వేసిరి.

కాదంబరి ప్రభావము తెలుగు సాహిత్యముపై ఎంతవరకు పడినదో తెలిసికొనుటకు విశేష పరిశ్రమ జరుగవలసి యున్నది. ప్రత్యేక పరిశోధనకు తగినంత సామగ్రి తెలుగు భాషలో దొరుక వచ్చును. ఇచ్చట దిఙ్మాత్రముగా శ్రీనాథ మహాకవి రచించిన శివరాత్రి మహాత్మ్యమునుండి కొన్ని ఉదాహరణలను మాత్రము గ్రహించి విషయ ప్రాధాన్యమును తెలియ జేయుటకు ప్రయత్నము చేయుదును. శ్రీనాథుడు కాదంబరిలోని కొన్ని భాగములను మక్కికిమక్కి గ్రహించి 'శివరాత్రి మాహాత్మ్యము'నందు అచ్చటచ్చట అతి

కించినట్లు కన్పించును. కాదంబరియందు శ్రీనాథునకు చాలా నచ్చిన భాగములు చండాల కన్యకా వర్ణనము, శబరులు, మృగయ, విలాసవతి కొడుకు పుట్టుట కొరకు చేసిన వ్రతములు, సూతికా గృహ వర్ణనము, చంద్రాపీడుని జన్మ, శుకనాసోపదేశము, చండికాయతనము, ద్రవిడ ధార్మికుడు. దీని నుండి కొన్ని భాగములను గ్రహించి తన ఈ కావ్యములో అచ్చటచ్చట సందర్భములను కల్పించి చేర్చెను.

1) సుకుమారుని జనన సందర్భమునందు సూతికా గృహమును శ్రీనాథుడు ఇట్లు వర్ణించెను:

సీ. 'తలయంపి ధవళ ముద్రాకుంభమిడువారు,
        రక్షాభసిత రేఖ వ్రాయువారు
గౌర సర్షపరాజ కలయ చల్లెడువారు,
        బలి విధానంబుల పరగువారు,
లవణంబు నింబ పల్లవము త్రిప్పెడు వారు,
        వేము మంచంబుతో పెనచువారు,

గరల ధూపంబు సంఘటియించువారు,
... ... ... ...
... ... ... ...
నైరిశుద్ధాంత సతులరిష్టాలయమున—' శివ. II. 70.
మరియొక పద్యమును చూడుడు

సీ. కర్పూర సమ్మిశ్ర గంధసారంబున
        జరచె చప్పట భిత్తి జామ యొకతె
వెలికిలంబెట్టె నుత్పలగంధియొక్కర్తు
        కప్పు గర్భ గృహోపకంఠభూమి
జ్యేష్ఠాధిదేవత సేవించె నొక యింతి
        పసపు పట్టపుగట్టి భక్తి గరిమ
జటముపై లిఖియించె బాటలాధర యొర్తు
        క్రొత్తలత్తుక శశాంకుని ఖరాంశు

గీ. జరఠ మేంతంబు కంఠ దేశమున జుట్టి
పుష్పడుండుభముల నొక్క పువ్వుబోడి
అంబుజానన యొకతె నెయ్యభిఘరించె
భుజగ నిర్మోకమొకతె నిప్పుల గమర్చె. శివ-II-71.

గీ. దాన ధర్మంబులొనరించి త్యాగమిచ్చి
... ... ... ...
యంబు పావక సంస్పర్శ మాచరించి
ప్రథమ తనయు ముఖేందు బింబంబు సూచె — శివ—II—74.

ఈ వర్ణనమంతయును కాదంబరి యందలి సూతికా గృహ వర్ణనములోని అంతర్భాగమే (చూడుడు. 'సూతికాగృహ వర్ణనము—సామాజిక జీవనము').

సుకుమారుని పొందుటకు అతని తల్లి చేసిన వ్రతములు కూడ విలాసవతి వ్రతములనే తలపించును. చూడుడు;-

సీ. భక్తితో మాతృకాభవనంబులకు నేగు
గావించునతి దిశాదేవతలకు
వాయసంబులకు నిర్వర్తించు దధిబలి
గొలుచు జ్యేష్ఠాదేవి నలఘుమహిమ
జదివించుకొను బుణ్యసంహితావ్రాతంబు
మూలికా మాణిక్యములు ధరించు
దాంబూల గంధాక్షతలు చిరంటుల కిడు
విప్రశ్నికల గారవించు తరచు
...............................

శివ-II-90.

(చూ. విలాసవతి వ్రతములు-సామాజిక జీవనము)
సుకుమారుడు కామించిన చండాల కన్యక బాణుని సృష్టియే.

సీ. ఆదికాలమున మాయా విలాసినియైన
మురదైత్య దమనుని మూర్తిబోలె

ధరణీ తలంబున చరియించ నేర్చిన
పురహూత మణి-శిలా పుత్రివోలె

..............................

..............................

గీ. వేడ్కకై మానుషీ విగ్రహంబు ధరించి
విహరించు తొలి కారు వేళ వోలె.'

శివ-III.32

మెలత మధుమాస కుసుమ సమృద్ధివోలె
జాతి విరహితమయ్యు సంప్రీతి నొసగె.
'అప్సర స్త్రీ వోలె నకులీనయై' శివ III. 35

గీ. దీని గల్పించె నజుడభిధ్యానమునను
నాతిమును ముట్టరాకుండ నంత్యజాతి
ముట్టుటయు కల్గెనేని యిమ్ముదిత మేను
గందకుండునె పుష్పంబుకంటె మృదువు.

బాణుడు చండాల కన్యకను అసుర గృహీతామృతాపహరణ కృత కపటపటువిలాసినీ వేషస్య శ్యామతయా భగవతో హరేరివానుకుర్వతీం, ...దివ్యయోషితమివ అకులీనాం...అమూర్తామి వస్పర్శ వివర్జితాం ఆలేఖ్య గతా మివ దర్శన మాత్ర ఫలాం మధుమాస కుసుమ సమృద్ధి మివ విజాతిం... 'మన్యేచ మాతంగజాతి స్పర్శదోషభయాత్ అస్పృశ్యతేయముత్పాదితా ప్రజాపతినా[1]'

దారితప్పి ఇంద్రియలోలుపుడైన సుకుమారుని గూర్చి కవి -

గీ. ఆదిగర్భేశ్వరత్వంబు యౌవనంబుఁ
జక్కఁదనమును నతిసాహసంబుఁ జనవు
నొక్కఁ డొక్కండు చాలు దోషోత్కరమున
కన్నియును గూడియున్నవి యతని యందు

—శివ- II 36.

---

1. కా. కా. పుట. 22, 23.

ఈ సందర్భములో మాటలలో 'అది గర్వైశ్వరత్వము' వంటి పద ప్రయోగములేగాక విషయమంతయు శుకనాసోపదేశము నందలిదే.

అట్లే-

'ఇవ్విధంబున తృష్ణా విషవల్లికాలవాలంబును నింద్రియ గుణంబులకు శరణంబును మోహ నిద్రకు విభ్రమ శయనంబును, శాస్త్రదృష్టికి తిమిరోద్గమంబును, దోషాశీ విషంబులకు నావాస వల్మీకంబును, సుగుణ కలహంసలకు ప్రావృట్కాలంబును, కపటనాటకంబునకు ప్రస్తావనయు, ధర్మేందు మండలంబునకు రాహువక్త్రంబు నైన యౌవనారంభమున' - శివ. II. 88.

అని సుకుమార యౌవనోదయమును వర్ణించెను. ఇదికూడా శుకనాసోపదేశమునందలి భాగమే. ఇందలి సమాసము లన్నింటికిని యథాతథముగా తెలుగు విభక్తి ప్రత్యయములను మాత్రము చేర్చి శ్రీనాథుడు గ్రహించెను.

కాదంబరి యందు చండికాయతన వర్ణనమునదాని నాశ్రయించి యున్న ద్రవిడ ధార్మికుడు, అతి జటిలమైన నాటి పూజా విధానమును, వామాచార, దక్షిణాచార సంప్రదాయములను కవి ప్రతిబింబింపజేయును. శ్రీనాథుడు రక్తధ్వజమును కాళిక దివ్యమందిరమును ఇట్లు వర్ణించెను:

ఉ. కాళిక దివ్య మందిరము (కట్టెదురం బశుకంఠ) నాళకీ
లాల రసంబు గ్రోలు నభిలాషమునం జనుదెంచి యున్నవే
తాళగణంబు వోలె నతి దైర్ఘ్యమునన్ దివిదాకియున్న హిం
తాళవనంబు గన్గొని యతండు మహాద్భుతమందె నాత్మలోన్.

— శివ. III. 110

పయిపయి గర్భదేహమున బన్నిక మీరి వెలుంగు మాలికా

ఉ. — — — — — — — — — — —
దీపశిఖా ప్రరోహములు దేరగ జూచి యనుస్మరించెలో
నా పృథివీ సుతుండు మహిషాసుర మస్తక శోణితాద్రదు
ర్గాపరమేశ్వరీ పదనఖంబులరూపము సంవరించినన్.

- శివ. III 111.

గీ. సదనవన హటికా నికుంజములందు
నెలుక లధరోష్ఠ సంపుటంబులు కదల్ప

శక్తిమంత్రాక్షరంబులు జపముసేయు
నవియువలెనున్న నద్భుతంబందె నతడు.

- శివ. III. 112

ఈ మూడు పద్యములయందును బాణుడు చేసిన చండికాయతన వర్ణనమే కన్పించును. చూడుడు;—

1. ప్రచలంతీభిః గర్భ గృహ దీపికా లతాభిః అంగుళీభిరివ మహిషాసుర శోణిత లవాలోహినీ భిః......[1]

2. బలిరుధిర పాన తృష్ణయా సమాగతైశ్చ వేతాలైరివ తాలైః దీపక మాన ఫలముంతోపహారా......[2]

3. స్ఫురదధరపుటైః ఆఖుభిరపి జపపరైరివ......[3]

ఇచ్చటనే శ్రీనాథుడు సుకుమారునికి మంత్ర తంత్రములపైగల నమ్మకమును తెలుపుచూ-

సీ. 'మంత్రవాదులతోడి మైత్రి సంపాదించు
యంత్రవాదుల గని యాదరించు
సిద్ధ యోగీశ్వర శ్రేణి సంసేవించు
ధా(తువాదులకు వం) దనము సేయు
కదలి వశ్యాశ్చర్య కథలెరుంగగ గోరు
బలము సాధింప నపేక్ష సేయు
బహుదేశభాష లభ్యాసింపవాంఛించు
శల్యతంత్రము మీద జాపుమనసు

గీ. ఘటిక కట్టగ బెన్నిధి గుద్దలింప
నింద్రజాలంబు పన్నంగ నిచ్చగించు
గట్టి భవనములకు సురంగములు ద్రవ్వ
నేర్చుకొను ప్రత్యహంబును నీచ బుద్ధి

1. కా.కా. పుట 337 2. కా.కా. పుట. 335
3. కా.కా. పుట. 337

ఈ పద్యమునందు బాణుడు సృష్టించిన జరద్ద్రావిడ ధార్మికుడే సాక్షాత్కరించును. చూడుడు :-

'......ఆవిర్భూత నిధివ్యాధినా సంజాత ధాతు వాద వాయునా లగ్నా సురవివర ప్రవేశ పిశాచేన...సంప్రయుక్త స్త్రీ వశీకరణ చూర్ణేన'[1]

శ్రీనాథుడు సుకుమారుని వేట వర్ణనమును కాదంబరిలోని శబరుల మృగయా వర్ణనమును చూచి వ్రాసెనా అన్నట్లున్నది.

శ్రీనాథుడు సుకుమారుడు పక్కణ శబరులతో గూడి వేటకు వెళ్ళిన తీరును ఇట్లు వర్ణించెను:-

వ. 'ఒక్కనాఁడక్కనిష్ఠవర్తనుండు పక్కణ శబరులం గూడి కరిక్రవ్యాదంబులగు కుక్కలంబట్టుకొని ప్రత్యుషఃకాలంబున విపిన వీధుల నీవార భసల విఘటిత సరఃకమల షండ సౌరభోద్గారభరిత దిక్కటాహంబుకరటి మార్గంబిదే, కఠిన విషాణకోటి విభిద్యమాన వల్మీకధూళిపాళికా నిచుళిత తరుపలాశంబు మహిష వర్తనంబిదే. దూర్వాప్రవాళ చర్వణ హరిచందన పరిపాండనంబు హరిణమార్గంబిదే, కటుదీర్ఘఘర్ఘర వ్యాక్రోశంబు కర్కరేటుకుల కులాయస్థానంబిదే, కహకహారావంబు, దాత్యూహ వ్యూహ ప్రవేశంబు ననుచు నాఖేట కౌతుకంబున నాఖేలన క్రీడా విహారంబుల నృశంసుండయి'[2]...

కాదంబరిలోని ఆఖేటవర్ణన పంక్తులివి: 'అనంతరంచ సరభసమితో గజయూథపతి లులిత కమలినీ పరిమళః, ఇతః క్రోడకుల దశ్యమాన భద్రముస్తారసామోదః, ఇతః కరికలభ భజ్యమాన సల్లకీ కషాయ గంధః, ఇతో నిపతిత శుష్క మర్మరధ్వనిః, ఇతో వనమహిష విషాణ కోటి కులిశభిద్యమాన వల్మీక ధూలిః. ఇతోమృగ కదంబకం, ఇతో వనగజకులం, ఇతోవనవరాహయూథం, ఇతో వన మహిష బృంధం...ఇయమభినవ శష్పకబలరస శ్యామలా హరిణ రోమంథ ఫేనసంహతిః ... ఇతః శిఖండిమండలవిరుతం, ఇతః కపింజల కుల కల కూజితం, ఇతః కురర కులక్వణితం...'[3]

---

1. కా.కా. పుట. 333

2. శివ. III-117 3. కా. కా. పుట 52.53

ఈ రెండింటిని పోల్చి చూచిన శ్రీనాథుడు అనుపదమును బాణుని అనుస రించెనని స్పష్టము. శ్రీనాథుడు బాణుని రచనను చూచినందులకు కృతజ్ఞత తెలిపెనా యన్నట్లు అప్రయత్నముగానే 'కాదంబరీ' అను పదమును గూడా వాడుటవలన ఆంతరమైన సాక్ష్యముగూడ మనకు లభించినది.

సీ. 'కామినీ గండూష కాదంబరీధార
బులకించె నారామభూమి బొగడ'

ఇట అప్రయత్నముగానో లేక సప్రయత్నముగనో ప్రయోగించిన 'కాదంబరీ' శబ్దము శ్రీనాథునకు ఆ గ్రంథము నందు గల గౌరవము తెలిసినది. శ్రీనాథుడు కాదంబర్యాది మహా కావ్యములను పుక్కిట బట్టినా డనుటకు ఇట్టి వెన్నియేని నిదర్శనముల చూపవచ్చును, చండాల కన్యకను చూచిన సుకు మారుడు సరిగ చంద్రాపీడుడు కాదంబరిని చూచిన మాటనే పునరుక్తము చేసినాడు.

సీ. 'ఏల చేయండు శేషేంద్రియంబులు నాల్గు
సలినగర్భుడు లోచనములుగాగ
ఎట్టు గల్గె విధాతకీరూప నిర్మాణ
పరమాణువులు కోటి పరిమితంబు'

- శివ. III. 51

కాదంబరిని చూచిన చంద్రాపీడుని మాటలివి: 'శేషేంద్రియాణ్యపి మే వేధసా కిమితి లోచనమయాన్యేవ నకృతాని...అహో చిత్రమేత దుత్పాదితం వేధసా సర్వ రమణీయానామేకం ధామ. కుతఏతే రూపాతిశయ పరమాణవః సమాసాదితాః'[1]

శ్రీనాథుని వంటి వాడు కాదంబరిని తు చ. తప్పక అనుసరించె ననుటకు స్థాలీపులాకముగా కొన్నిటిని ఉదాహరించితిమి. ప్రబంధ కవులు-ముఖ్యముగా మను వసు చరిత్రకారులు బాణుని అనుసరించిన సందర్భములు కోకొల్లలు.

వసు చరిత్రలోని సూర్యాస్తమయ వర్ణనమును చూడుడు.

---

1. కా. కా. పుట. 288

తే. చరమ గిరియను మరకాడు జలధి సరణి
దరణి దించిన నతడు తత్సలిలమగ్న.
విమల ముక్తాఫలంబులు వెలికి చౌరిపె
ననగ నవతారకానికాయంబులడరె- —వసు. IV. 15.

అస్తాద్రియను సముద్రములోనికి సూర్యుడను గోళము పడగనే అందుండి పైకి లేచిన ముత్యాలు అనునట్లు ఆకాశము మీద నక్షత్రములు వ్యాపించెను.

ఇట్టి వర్ణనమునే కాదంబరి కథాముఖములో చూడవచ్చును. ...''అపర సాగ రాంభసి పతితే దినకరే పతనవేగోత్థితమంభఃసీకరనికరమివ తారాగణ మంబర మధారయత్''- కాదంబరీకారుడు పశ్చిమాంబుధినుండి నీటి తుంపరలు పైకి లేచెనని చెప్పగా వసుచరిత్రకారుడా నీటి తుంపరలను ముత్యాలుగా మార్చి వేసెను.



ఈ విషయముపై ప్రత్యేకముగా అనుసంధానము చేయుట పాడి.

# ఉపసంహారము

'ద్విజేన తేనాక్షత కంఠ కౌంఠ్యయా
మహా మనోమోహ మలీమ సాంధయా,
అలబ్ధ వైదగ్ధ్య విలాస ముగ్ధయా
ధియా నిబద్ధేయ మతిద్వయీ కథా'[1]

అని బాణుడు కాదంబరి ప్రాస్తావిక శ్లోకములలో అత్యంత వినయ వినమితుడై చెప్పుకొనినాడు. మనసు మరుగున తారాడు భావాలను మాటలలో చెప్పలేకపోయితిని. చమత్కార స్ఫురణ శూన్యము. వర్ణన విలాస వైదగ్ధ్య మను నది లేనేలేదు. ఇట్టిది నా బుద్ధి. కాని నేనల్ల దలచిన కథఏమో గొప్పది - అని తన రచనల ఎడల అపారమగు గౌరవమును కూడ ప్రకటించెను. రచయితయే అన్నట్లు ఈ కథ 'అతిద్వయియే' - సాటిలేనిదే.

ఒకవైపు ఐశ్వర్య విలాసతుందిలమైన రాజాంతఃపురములు, మరియొకవైపు క్రూరశ్వపద సదృశులగుఆటవికులు, ఇంకొకవైపు అమాయక నిష్కాపట్య నిర్భరహృదయులగు జానపదులు, మానవ సేవకోసమే జన్మించినట్లున్న పశుపక్ష్యాదులు – వేయేల ? బాణుడు :

'నియతి కృత నియమ రహితామ్
హ్లాదైక మయీం అనన్య పరతంత్రామ్,
నవరస రుచిరామ్ నిర్మితిమ్
ఆదధతీ భారతీ కవేర్జయతి'[2]

అని కావ్య ప్రకాశ కారులు అన్నట్లు అత్యపూర్వ ప్రపంచమునే మన ఎదుట అవతరింపజేసెను.

చిన్ననాడు ప్రేమామృతము నాస్వాదించని కొందరు ఉత్తర జీవితమున ఆ భాగ్యము కల్గిన వారిని ద్వేషించుట, మరికొందరు తమకు లేనిది ఇతరులనుభవించుచున్నారు గదా యని ఆనందముతో విశ్వప్రేమికులగుట మనము చూచుచున్నాము. బాణకవి రెండవ కోవలోని వాడు. చిన్ననాడు తల్లి ప్రేమను కోల్పోయిన వాడు కనుక తన వారిని, పెరవారిని అందరినీ ప్రేమించెను.

---

1. కా.కా. పుట. 8.
2. కావ్యప్రకాశ. పుట 1. (ఆనందాశ్రమ ప్రచురణ)

ఈతని చిన్ననాటి మిత్ర బృందమును చూచినను ఇది తేటతెల్లమగును. ఈ ప్రేమయే కాదంబరిలో విశ్వరూపము దాల్చినది.

మాతా పితరుల వాత్సల్యము, పెంచిన వారి ప్రేమ గురు శిష్యుల అనుబంధము, అవ్యాజ సవ్యాజ ప్రేమలు, సేవ్య సేవకుల గౌరవాదరములు, స్వామిభక్తి పరిజనానురక్తి, ప్రేమికుల జంటల అమర ప్రేమ- ఇట్లు ప్రేమకు పర్యాయములగునవన్నియు పరీవాహమై ప్రవహించినవి కాదంబరిలో.

దేశాటనము వలన, రాజకుల పరిచయము వలన వివిధ మనః ప్రవృత్తుల పరిశీలన పాండిత్యము బాణునకు కలిగినది; అందువలన ప్రతి విషయమును సూక్ష్మాతిసూక్ష్మముగా, పేశలాతిపేశలముగ, మధురాతిమధురముగా వర్ణించ గలిగెను. ప్రకృతిని-మానవ ప్రకృతిని, తిర్యక్ప్రకృతిని, స్థావర ప్రకృతిని విశ్లేషించి చూపుటలో బాణునకు బాణుడే సాటియనుట అతిశయోక్తి కాదు. కనుకనే 'బాణోచ్ఛిష్ట మిదం జగత్'ను నానుడి ఏర్పడి యుండును. బాణుడు స్పృశించని విషయము కల్పనామయ జగత్తులో లేదు.

నియమ బద్ధమైన పద్య రచన మెంత క్లిష్టమో, నియమ బద్ధము కాని గద్యరచనము అంత సులభమన్న మాట నిజమే. కాని, ఛందోబంధాలు లేని గద్యము భావ తీవ్రత లేకున్న పఠిత మనసును ఆకట్టుకొనజాలదు. భావ తీవ్రతకు శైలీసంపద తోడైనచో గద్యము పద్యమునే మించిపోవును ఇటువంటి గద్యరచనే అక్లిష్టము కాదు కనుకనే 'గద్యం కవీనాం నికషం' అయినది. బాణుని గద్యము ఈ నికషమునకే నికషమయినట్లు పఠితలకు అనుభవైక వేద్యము. భావ తీవ్రతకు ఉత్ప్రేక్షలు, ఉపమలు, పరిసంఖ్యలు, రూపకములు, ముక్తపదగ్రస్తములు సుమధుర సాధనము లైనవి.

ఔచిత్యమును పాటించుటలో బాణునికి గల దృష్టి అపూర్వము. పద ప్రయోగ ప్రలోభముగాని, పద దారిద్ర్యముగాని ఇతనికి లేవు. ఇతని పాత్రలు సంయమముతో, అదృశ్యమైన ప్రగ్రహాలు పూన్చిన పంచకళ్యాణి గుఱ్ఱాలవలె వడచును. కాని సారథి కానరాడు. శోకము, సంతోషము, సంభ్రమము పాత్రల స్వభావ స్వరూపాలను ఉల్లంఘించలేదు. అట్లని కవి చెప్పు చేతలలోనివియును కావు; కవిని కాదని దుస్స్వాతంత్ర్యము నవలంబించినవియును కావు. తమ అంతస్తును, తమ స్తరము మించవు. బాణుని కావ్యాత్మ ఔచిత్యమే యనుట సమంజసము.

సంస్కృత సాహిత్య ప్రపంచములోనే గాక విశ్వ సాహిత్య ప్రపంచము లోను బాణభట్టు పేరు చిరస్థాయి.

# అనుబంధము

## కాదంబరిపై తెలుగు వ్యాసములు, కావ్యములు


1. 'కాదంబరీ కళ్యాణము'; నరసింహ కవి (కాకతీయ యుగము) ఆంధ్రాను వాదము సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు.
2. బాణకవి - కాదంబరి : కె. యస్. శర్మ, భారతి 1929 జూన్-శుక్ల జేష్ఠ.
3. భట్ట బాణుని గృహ గమనము : కొమాండూరు కృష్ణమాచార్యులు, భారతి 1931 జనవరి.
4. బాణుని హర్ష చరిత్రము : కె. యస్. శర్మ, ఆంధ్రపత్రిక ఉగాది సంచిక ప్రమోదూత - 1930.
5. బాణుని కాదంబరిలోని మహాశ్వేతను గూర్చి : స్ఫూర్తిశ్రీ, 1960 భారతి ఏప్రిల్.
6. బాణ : Ann Bh. O. R. I. 1964.
7. బాణ భట్టారకుని సూక్తి వైచిత్రి : డా. యస్. వి. జోగారావు, భారతి 1962 మార్చి.
8. భట్టబాణుడు (కాదంబరి కావ్య మధుర సందేశము) : సాహిత్య వాల్లభ్యము 1968.

# రచయిత్రి పరిచయము

అభిమాన విషయములు :- సంస్కృత ప్రాకృతాంధ్ర భాషా సాహిత్యములు

డాక్టరేటు పరిశోధనా విషయము.

"Every Day Life in Ancient India As Depicted in Prakrit Literature.

(అముద్రితము)

రచనలు :- వివిధ విమర్శనాత్మక వ్యాసములు, రేడియో ప్రసంగములు.

"బాణుని రచనోద్దేశం ప్రేమ విస్తరణమని ఈ రచయిత్రి చాలా చక్కగా తెలిపింది. నా ఉద్దేశమూ అదే గనుక నాకు నచ్చింది. కాదంబరి పాత్ర చిత్రణం మరింత చక్కగా చేసింది కమలమ్మ.

—శ్రీ తిరుమల రామచంద్ర

మనము ఈనాటి నిర్వచనములో బాణుని అభ్యుదయవాదిగా చెప్పవచ్చును అని డా॥ కమల అభిప్రాయము. ఇది సర్వథా సత్యము.

—డా॥ బి. ఆర్. శాస్త్రి

నూనం సా విదుషీ అధీతినీ గద్యకావ్యే గృహీతినీ చ బాణభట్ట రచనాయామ్.

—డా॥ పి. జి లాలే

కథా కథనం విషయంలో బాణుడవలంబించిన పద్ధతి నేటి Flash Back పద్ధతివలె ఉన్నదని చెప్పడం చాలాయుక్తంగా ఉన్నది. ఇది బాణుని కథాకథన పద్ధతికి సూత్ర రూప వ్యాఖ్యానము.

—డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు